అపరాధ పరిశోధన అనుబంధం—16

# నాలుగు నవలలు

(మీ కోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## బ్రెయిన్ దొంగతనం?

రచన: ఏ. వీ. మోహన్రావ్

## భూగర్భ సాహసయాత్ర!

రచన: 'రాజా'

## కపట మనిషి

రచన: టెంపోరావ్

## త్రినేత్రుడు

రచన: సుజనశ్రీ

"ఖైదీ" సీరియల్-11 వ భాగము

**అపరాధ పరిశోధన సప్లిమెంట్—16**
ఏప్రిల్, 1975
వెల: రు. 3_00
ఏడాది చందా 39 రూపాయలు
30_3_'75 లోగా పంపితే 39 రూపాయలు
ఉచిత చందా డిపాజిట్టు 250 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్:
**శ్యామ దామోదర్ రెడ్డి**

సంపాదక వర్గం:
**టెంపోరావ్**
**శ్యాంబాబు**
**రమణశ్రీ**
**ఏ. వీ. మోహన్రావ్**
**సుజనశ్రీ**
**వసుంధర**
**కంచర్ల రమణ**

కార్యాలయం:
**అపరాధ పరిశోధన కార్యాలయం**
నారాయణగూడ, హైదరాబాద్_29
ఫోన్—36959

ముద్రణ:
క్రాంతి ప్రెస్
12, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్
మద్రాసు—1

# బ్రెయిన్ దొంగతనం!

ఏ. వీ. మోహన్రావ్

గాలిలో ఎగురుతూంది విమానం.

భూమికి ఆరువేలడుగుల ఎత్తున, మబ్బుల్ని రాచుకుంటూ నక్షత్రాల్ని గీచుకుంటూ, నల్లటి చీకటిని చీల్చుకుంటూ పోతూంది.

సైన్స్ జర్నల్ తిరగేస్తూ కూర్చున్నాడు ప్రొఫెసర్ శాస్త్రి. ప్రపంచంలో ఆటమిక్ సైన్స్ గురించి క్షుణ్ణంగా తెలిసిన శాస్త్రవేత్తలలో అతను ప్రథముడు. హేగ్ నగరంలో జరిగిన కాన్ఫరెన్సులో భారతదేశం తరఫున పాల్గొని తిరిగి ఇండియాకు వస్తున్నాడు. విమానంలో దాదాపు సగం సీట్లు ఖాళీగానే వున్నాయి.

వరుసగా నాలుగైదు విమానాల్ని అంతకుముందు

వారంలో హైజాక్ చేశారు అరబ్ కమాండోలు. ప్రయాణీకుల్ని చిత్రహింసలు పెట్టారు. కొంతమందిని దారుణంగా కాల్చి చంపారు. ఆ అకారణ దారుణ మారణహోమం ప్రపంచ వ్యాప్తంగా పొందిన ప్రచారం దెబ్బకు, విమాన సర్వీసులు విపరీతంగా నష్టపోయాయి.

"నేనిక్కడ కూర్చోవచ్చా శాస్త్రీ?" అడిగింది శాస్త్రిగార్ని అందమైన అమ్మాయి. ఆయన తలెత్తి చూశాడు. మెరుపుతీగలావుంది. యవ్వనంతో బంగారులా వెలిగిపోతోంది వొళ్ళు. చక్రాల్లాంటి కళ్ళు నెమలిరంగులో వున్నాయి. పొడవుపాటి ముక్కు చిన్న నోటిపైకి తొంగి చూస్తున్నట్లు వొంపు తిరిగివుంది. వంగివుండడంతో గౌను లోపలినుంచి కనుపించాయి అందమైన, బరువుగావున్న లావుపాటి రొమ్ములు.

"సైనాట్!" అన్నాడు ఉత్సాహంగా శాస్త్రి. ఆయనకు నలభై సంవత్సరాలుంటాయి. మనిషి అందంగానే వుంటాడు. తల ముప్పాతిక భాగం తెల్లబడింది.

"మా ఫాదర్ ఇండియనే! నేను హేగ్‌లో సిరపడిపోయాను. మీరు!" అంది చలాకీగా రొమ్ములు కదలిస్తూ.

"ఇండియన్ని. కాన్ఫరెన్సు అటండయి పోతున్నాను" అన్నాడు శాస్త్రి.

"పేపరులో చదివాను, ఇక్కడేదో అటమిక్ సైన్సు గురించి ప్రపంచ సభలు జరుగుతున్నట్లు" అంది ఆమె.

"అవును. వాటికోసమే వచ్చాను" అన్నాడు శాస్త్రి

"ఇండియా చాలా ఇంప్రూవ్ అయిందని విన్నాను. నిజమేనా?"

"నిజమే! నువ్వు వస్తున్నావుగా. స్వయంగా చూసి అభిప్రాయం ఏర్పరచుకో."

ఎయిర్ హోస్టెస్ వచ్చి బిస్కెట్స్, కాఫీ అందించింది. ఇద్దరూ మాట్లాడుకుంటూ వాటిన్ని సేవించారు.

ప్రొఫెసర్ శాస్త్రికి పెళ్ళికాలేదు. అతని తల్లిదండ్రులు చాలాసార్లు చెప్పి చూశారు. కానీ అతను వినలేదు. అతని వృత్తిరీత్యా ఆడవాళ్ళను కలుసుకునే అవకాశంగానీ, వాళ్ళతో పరిచయం పెంచుకొనే వీలుగానీ లేవు. డిఫెన్స్ డిపార్ట్‌మెంట్ ఆధ్వర్యంలో నడుస్తున్న రిసెర్చి లాబ్‌కు డైరెక్టరుగా పనిచేస్తున్నాడు శాస్త్రి. అణుశాస్త్రాన్ని మిలిటరీ ప్రయోజనాలకోసం ఎలా ఉపయోగించడమన్నదే ఆయన నిత్యం జరిపే పరిశోధన.

"నాపేరు సుసనా" అందామె.

"ఇండియన్ అంటున్నావుగా. హాయిగా సుశీలని పెట్టుకోలేకపోయావా?"

"మీరు నన్ను అలాగే పిలవండి. ఎటూ ఇండియాలో రెండు మాసాలు వుండేందుకు వస్తున్నాను. ఎవరన్నా అడిగితే మీరు చెప్పిన పేరే చెప్తాను. మీ పేరుచెప్పారు కాదు!" అంది సుసనా.

"శాస్త్రి!" అన్నాడు నవ్వుతూ.

ఆమె అలా ఏవేవో, నోటికొచ్చిందల్లా మాట్లాడుతూనేవుంది. తనకు తెలిసిన విషయాలు, హేగ్‌లో జీవితం ఎలావుంటుందో ఏమిటో వివరంగా చెప్పింది. శాస్త్రికి అంత ఇంటరెస్టు లేకున్నా విన్నాడు. అలా వింటూ దృష్టంతా, ఆమె అందంపైన నిలిపి, కళ్ళతోనే జుర్రుకుని త్రాగసాగాడు.

సుసనాకూ్కడా, శాస్త్రి చూపులు, మాటి మాటికీ సీటులో అటూ ఇటూ కదులుతున్న ఉద్రేకపు సూచనలు, అర్థమయినాయి. అయినా గమనించనట్టు తన అంగాంగ

ప్రదర్శన మోతాదు మరికొంత పెంచి మాట్లాడసాగింది.

ఎయిర్ హోస్టెస్ వచ్చి అందర్నీ బెల్ట్ కట్టుకోమని హెచ్చరించి వెళ్ళింది. అంటే ప్లేన్ లాండింగ్ కాబోతుందన్నమాట. ఏవిధమైన ఇబ్బందికీ గురికాకుండా విమానం ఇండియా చేరినందుకు ప్రయాణీకులు ఆనందంగా వున్నారు.

"మనం దిగేది బొంబాయికదూ!" అడిగింది సుశీల.

"అవును! నువ్వెక్కడకెళ్ళాలి?"

"మద్రాసు! అక్కడ నా ఫ్రెండ్స్ అదే పెన్ ఫ్రెండ్స్ వున్నారు. మీరిక్కడే వుంటారా?" అడిగింది.

"ఢిల్లీలో వుంటాను. అక్కడ చూడవలసినవి చాలా వున్నాయి. తిరిగి మీదేశం వెళ్ళేలోగా అక్కడికి వచ్చి పోరాదూ!" అడిగాడు శాస్త్రి.

"వస్తాను. కానీ మీరు ఆతిథ్యం ఇస్తామని మాటిస్తే" అంది గోముగా.

"ష్యూర్! ఇది నా అడ్రస్. వచ్చేముందు వైర్ చెయ్యి" అంటూ తన అడ్రసు ప్రింటుచేసివున్న కార్డు ఇచ్చాడు.

విమానం శాంతాక్రజ్ లో ఆగింది. అందరూ దిగి వెలుపలికొచ్చారు. అరగంటలోగానే బయలుదేరిన ఇండియన్ ఎయిర్ లైన్స్ ప్లేన్ లో సుశీల మద్రాసు వెళ్ళిపోయింది. శాస్త్రి టాక్సీ ఎక్కి గెస్ట్ హౌస్ కు వెళ్ళిపోయాడు. కాస్త రెస్ట్ తీసుకొని, రాజధాని ఎక్స్ప్రెస్ లో ఢిల్లీ వెళ్ళాలని ముందుగానే నిర్ణయించుకొని వున్నాడు.

సుసనా శాస్త్రిని తలచుకొని నవ్వుకుంది. అంతర్జాతీయంగా పేరు ప్రఖ్యాతులు గడించిన మనిషి, కేవలం ఒక ఆడదాన్ని, యవ్వనాన్ని చూడగానే మత్తుమందువున్నట్లు మైకం కమ్మినట్లు, ప్రవర్తించడం వింతగా తోచింది. తను ఇండియా చూచేందుకు రాలేదనీ, ప్రొఫెసర్ శాస్త్రి

పన్నెండు సంవత్సరాలు కృషి చేసి కనిపెట్టిన "ఆటమిక్ డిఫెన్స్ రేస్"కు సంబంధించిన ఫార్ములాలను తస్కరించుకు పోయేందుకని చెప్పివుంటే. ఏం చేసి వుండేవాడాని ఊహించసాగింది.

ప్రొఫెసర్ శాస్త్రి గురించి కూలంకషంగా సేకరించిన వివరాలుగల ఫైలు తన దగ్గర వుంది. దాన్ని వెంట తెచ్చింది. అందులో పుట్టింది మొదలు అతను చేసిన పనులు, సాధించిన ఘనకార్యాలు పొందుపరచబడివున్నాయి. అతను పని చేస్తున్నది మిలటరీ వాళ్ళకు సంబంధించిన లాబ్ కావడం, అందులోనూ గొప్ప సైంటిస్టుగా పేరు తెచ్చుకోవడంతో ప్రభుత్వం ప్రత్యేకమైన సెక్యూరిటీ ఏర్పాట్లు చేసింది. ఇరవై నాలుగు గంటలు అతనికి తెలీకుండానే మిలిటరీ ఏజెంట్లు అతన్ని కాపలా కాస్తున్న విషయం శాస్త్రికి తెలియకున్నా, తనకు తెలుసు. అందుకే చాలా జాగ్రత్తగా, తెలివిగా, తాను పని సాధించదలచుకొంది.

మద్రాసులో విమానం ఆగింది. బ్రీఫ్ కేసుతో దిగి వెలుపలికొచ్చింది. కస్టమ్స్ చెకింగ్ పూర్తయ్యాక పాసెంజరు లాంజ్ లోకొచ్చి నిలబడింది.

ఒకతను ప్రక్కగా వచ్చి "యం. ఎస్. వై ఫోర్ త్రీస్" అన్నాడు. అది తాను ఎక్కవలసిన కారు నెంబరయివుండాలనుకొని వెళ్ళింది వెలుపలకు. పోర్టికోలోవున్న కార్ల నెంబర్లకేసి చూసుకుంటూ వెళ్ళింది. పోర్టికోకు కాస్త దూరంగా నిలబడివుంది నల్ల అంబాసిడర్. నెంబరు చదువుకుంది. బ్యాక్ డోర్ తెరచుకుని ఎక్కి "గో ఆన్!" అంది.

కారు మద్రాసు మహానగరపు వీధుల్ని చీల్చుకుంటూ రివ్వున వెళ్ళసాగింది. డ్రైవరు తప్ప మరెవ్వరూ లేరు.

హోటల్ ఎమరాల్డ్ ముందాగింది కారు. డ్రైవరు

తాళాలరింగు తీసిచ్చాడు. రింగుకి వ్రేలాడుతున్న ఇత్తడి బిళ్ళ శేసి చూసింది. రూం నెంబరు నాలుగొందల నలభై నాలుగు అని వుంది. తనకోసం తనవాళ్ళు రిజర్వ్ చేసిన రూం అదే అయివుండాలనుకొంది. కారుదిగి, బ్రీఫ్ కేసుతో సహా లిఫ్టువేపు వెళ్ళింది.

ఆరో అంతస్తులోవున్న రూంని చేరుకుంది. లోనికెళ్ళి తలుపులకు గొళ్లెం పెట్టింది. ఏర్పాట్లన్నీ ఎంతో బాగున్నందుకు సంతోషపడింది. తనకు అప్పగించబడినది చాలా కష్టసాధ్యమైన కార్యం. సాధించగలిగితే...

టెలిఫోన్ మ్రోగింది. లేచి రిసీవరు అందుకొని "హలో!" అంది సుసనా.

"సుఖంగా చేరావా?" అవతలివేపునుండి మగకంఠం వినిపించింది.

"ఆc! విశేషాలేమైనా ఉన్నాయా?" అడిగింది.

"రాత్రికి ఓడియన్‌లో కలుసుకుందాం. నీకోసం వెయిట్ చేస్తుంటాను వెలుపల" అన్నాడు అవతలి వ్యక్తి.

"అలాగే!" అంది సుసనా.

లైన్ కట్ అయిన శబ్దమయింది.

రిసీవరు క్రేడిల్ పైన పడేసింది సుసనా.

# 2

ఆర్మీ హెడ్ క్వార్టర్సులోని, ఇంటలిజెన్స్ వింగ్‌లోని సీనియర్ డైరక్టరు గది వెలుపల ఎర్రలైటు వెలిగింది. లోపల ముగ్గురు వ్యక్తులు కూర్చున్నారు. ఇద్దరు ఉన్నతాధికారులు. మరొకతను వాళ్ళు చెప్పేది శ్రద్ధగా వింటున్నాడు.

ప్రొఫెసర్ శాస్త్రి ఇండియానుండి బయలుదేరాక, అతను ఎవరెవరితో తిరిగిందీ, ఎక్కడెక్కడ మకాం

చేసిందీ, ఏమేం మాట్లాడింది అంతా వివరంగా రికార్డు చేసిన ఫైలు తిరిగేస్తూ కూర్చున్నాడు సీనియర్ డైరక్టరు.

"మిస్టర్ మోహన్! ఈ ఫోటోల్లో ఒక వింత విషయం గమనించారా?" అడిగాడు డైరక్టరు.

"ఏమిటి?"

"ఈ అమ్మాయెవరోగానీ, శాస్త్రిగారు వెళ్ళిన ప్రతి చోట ప్రత్యక్షమైంది. ప్రతి ఫోటోలో వుంది. చివరకు ఆయన వెంట విమానంలో ప్రయాణం చేసింది. ఇండియాకు చేరింది. మీ రిపోర్టునుబట్టి ఆమె మద్రాసుకు వెళ్ళింది. ఈమె ఎందుకిలా శాస్త్రిని వెంటాడుతున్నట్లు?" అడిగాడు సీనియర్ డైరక్టరు.

మోహన్ కూడా ఫోటోలన్నీ తదేకంగా పరీక్షించి చూశాడు.

"యస్ సార్! ఆమె కూడా సైంటిస్టేమో?" తన అనుమానం వ్యక్తపరిచాడు మోహన్.

"ఆమె సైంటిస్టయితే ఏ సెమినార్‌లోనూ మాట్లాడినట్లు లేదు. అన్నింటినీ మించి ఆమె శాస్త్రిగారొచ్చిన విమానంలోనే ఇండియాకు ఎందుకు రావలసివచ్చింది."

"కాకతాళీయంగా జరిగిందేమో?"

"కావచ్చు. కానీ ఇలాంటి కాకతాళీయంగా జరిగే పనులు నమ్మశక్యంగానివి. అలా నమ్మకపోవడంలోనే మనకు ఎక్కువ జాగ్రత్త వుంటుంది. మీకు తెలుసు. భారతదేశానికీ, ముఖ్యంగా సైనిక దళానికి శాస్త్రిగారి శాస్త్ర పరిజ్ఞానం ఎంతో అవసరం. ఆయన పేరు ప్రఖ్యాతులు ప్రపంచమంతా ప్రాకాయి. ఆధిక్యతకోసం, అధికారంకోసం తహతహలాడే దేశాలు, ఆయన్ని అపహరించుకుపోవడానికి ప్రయత్నాలు ప్రారంభంచేస్తాయి. ఈ

అమ్మాయి అలాంటి పథకంలోనే బహుశా ఇండియాకు వచ్చి వుంటుందని నాకు అనుమానంగా వుంది. చేతులు కాలాక ఆకులు పట్టుకోవడంకన్నా ముందే తగిన జాగ్రత్తలో వుండటం మంచిది. ఈ క్షణంనుండి ప్రొఫెసర్ శాస్త్రినీ, ఈ అమ్మాయినీ, కనిపెట్టి వుండటం అవసరం. అందుకు తగిన ఏర్పాట్లు చెయ్యి" అన్నాడు మోహన్ కేసి చూస్తూ సీనియర్ డైరక్టరు.

"యస్ సార్! అలాగే."

"ఇప్పుడిప్పుడే ఇది ప్రభుత్వం దృష్టికి తేనవసరంలేదు. ఎక్కడా మనం రంగంలో దిగివున్న విషయం వెలుపలకు రాకూడదు. లోకల్ పోలీసుతో పేచీలుగానీ, మరే విధమైన చిక్కులుగానీ తెచ్చుకోవద్దు. దానివల్ల లేనిపోని పబ్లిసిటీ మొదలయి అసలు పని చెడుతుంది. పిట్టలు ఎగిరి పోయే ప్రమాదంకూడా వుంది" అన్నాడు ఆయన.

మోహన్ వింటూ "శాస్త్రిగార్ని హెచ్చరిస్తే..." సూచించాడు.

"వద్దు! ఆయనకుకూడా మనం ఏంచేస్తున్నదీ తెలియకూడదు!" అన్నాడు డైరక్టరు.

మోహన్ సెలవు తీసుకుని వెలుపలకు వచ్చాడు. విజిటర్స్ రూంలో వెయిట్ చేస్తున్న అతని అసిస్టెంటు మంజుల, మోహన్ రావడం గమనించి లేచి నిలుచుంది.

"సారీ! చాలాసేపు ఒంటరిగా వుంచేశాను" అన్నాడు మోహన్.

"ఫరవాలేదు!" అంది.

ఇద్దరూ మెట్లు దిగి క్రిందికొచ్చి కారెక్కారు.

మంజులతో మోహన్ అంతా చెప్పాడు. మంజుల మధ్య మధ్య ఊకొడుతూ వినింది.

"అయితే మనమేం చెయ్యాలి!" అడిగింది మంజుల.

"నువ్వు ఈ దినం ప్లేన్‌లో మద్రాసు వెళ్ళు. నేను ఇక్కడ శాస్త్రిగారి సెక్యూరిటీకి యింకొన్ని ఏర్పాట్లు చేస్తాను. పని పూర్తికాగానే వచ్చేస్తాను. ఈలోగా నాకు రోజూ నువ్వు తెలుసుకున్న విషయాలు తెలుపుతూ వుండాలి!" అన్నాడు మోహన్.

"మద్రాసులో ఆమె మకాం తెలుసా?"

"తెలీదు. ఫోటో వుంది ఇస్తాను. ఆమె ఫారిన్ లేడీ. అందంగా వుంటుంది. కనిపెట్టడం నీకు అంత కష్టం గాదనుకుంటాను" అన్నాడు ఫైలులోంచి ఫోటో ఒకటి లాగి అందిస్తూ.

"అలాగే!" అంది మంజుల.

కారు డిఫెన్సు హాస్టలు ముందాగింది.

"నువ్వెళ్ళి బట్టలు వగైరా సర్దుకొని తెచ్చుకో! ప్లేన్‌లో వెళ్ళిపోదువుగాని" అన్నాడు మోహన్.

మంజుల దిగి వెళ్ళిపోయింది. ఆమె వెళ్ళిన వైపే చూస్తూ కూర్చున్నాడు మోహన్.

మంజుల పెద్ద ఆర్మీ ఆఫీసరు కుమార్తె. ఆమె తండ్రి పాకిస్తాన్‌తో జరిగిన యుద్ధంలో చనిపోయాడు. ప్రభుత్వం ఆమెకు వేరే ఉద్యోగం ఇస్తానన్నా వినకుండా ఆర్మీలో చేరింది. బాగా చదువుకొంది కావడంవల్ల మంచి పోస్టు ఇచ్చేందుకు ప్రభుత్వంకి ఇబ్బంది లేకుండా పోయింది.

మోహన్, మంజుల కలసి పనిచెయ్యడం ప్రారంభించి మూడేళ్ళయింది. అప్పగించిన పనిని సాధించడంకోసం, అనుక్షణం, అవసరమైతే ప్రాణాలను పణంగా పెట్టడం అతనికి అలవాటు. మంజుల అతనికన్నా పదిరెట్లు ఎక్కువ సాహసం, చొరవ చూపిస్తుంది. అందుకే వీళ్ళిద్దరూ మంచి

పేరు సంపాదించుకున్నారు సీనియర్ డిటెక్టివద్ద.

మోహన్ రెండు సిగరెట్లు తగలబెట్టాడు.

మంజుల చిన్న బ్రీఫ్ కేస్ పట్టుకొని వస్తూండటం దూరాన్నించే గమనించి కారు స్టార్టు చేశాడు.

మంజుల వచ్చి "కాస్త లేటయింది" అంది ఎక్కి కూర్చుంటూ.

"ఫరవాలేదు" అన్నాడు ఆక్సిలేటరు పైన కాలు పెడుతూ.

"మిస్టర్ మోహన్! ప్రొఫెసర్ శాస్త్రిని ఎత్తుకు పోయేందుకు వాళ్ళు ఎలాంటి ఎత్తులు వేస్తుంటారో మీరూహించగలరా?" అడిగింది మంజుల.

"అందమైన అమ్మాయిని అంత దూరంనుంచి పిలుచుకొచ్చి రంగంలో ప్రవేశపెట్టారంటే, బహుశా అతన్ని ఆమె మైకంలో పడేట్టుచేసి ఆమె ద్వారా అతని దగ్గరున్న ఫార్ములాల్ని, అతన్ని లేదు దేశానికి తరలించుకు పోయేందుకు ప్లాన్ చేసి వుంటారనిపిస్తూంది. కానీ అది ఖచ్చితంగా చెప్పలేను. సైన్సు సాధించిన ప్రగతితో ఇలాంటి నేరాల పద్ధతే, మారిపోయింది. ఆ అమ్మాయి గురించి అవసరమైన అన్ని వివరాలు నువ్వు సేకరించాలి. దానిపైనే మన విజయం ఆధారపడి వుంటుంది" అన్నాడు మోహన్.

"నా సాయశక్తులా ప్రయత్నిస్తాను" అంది మంజుల.

కారు పాలం విమానాశ్రయం చేరుకుంది.

మద్రాసుకు వెళ్ళేందుకు విమానం సిద్ధంగా వుంది. మంజుల మోహన్‌కు చెప్పి రన్ వే వేపు వెళ్ళిపోయింది.

విమానం గాలిలోకి లేచిందాకా అక్కడే నిలబడ్డాడు మోహన్. అది కనుమరుగుకాగానే పోర్టికోలోకి వచ్చి కారెక్కాడు.

## 13

కారు శాస్త్రిగారి బంగళా వేపు పోనిచ్చాడు. అరగంట పట్టింది ఆయనిల్లు చేరుకునేందుకు.

గేటు దగ్గర కాపలా వున్న జవాన్ మోహన్‌ను చూడగానే సెల్యూట్ చేశాడు.

"సాబ్ వున్నాడా?" అడిగాడు మోహన్.

"వెలుపలకు వెళ్ళారు సార్!" చెప్పాడు.

కార్ను ముందుకు పోనిచ్చాడు. బంగళాకు కుడివేపు వున్న చిన్న ఔట్ హౌస్ ముందాపాడు కారు. ఆ బంగళా సెక్యూరిటీ ఇన్‌ఛార్జి అందులోనే వుంటాడు. వెలుపలికొచ్చి మేజర్ మోహన్‌ను చూచి, వడివడిగా పరుగెత్తుకొచ్చాడు అతను.

"ఏర్పాట్లు ఎలా వున్నాయి?" అడిగాడు అతన్ని మోహన్.

"మామూలే సార్!" అన్నాడతను.

"ఓమారు చూడాలి! శాస్త్రిగారు లేరుగా?" అన్నాడు.

"లేరు సార్!" అంటూ అతని వెంట నడిచాడు.

మోహన్ ముందు బంగళా చుట్టూ తిరిగాడు. కాంపౌండ్ వాల్ కేసి చూశాడు. ఐదడుగుల ఎత్తు వుంటుంది. ఎవరైనా సులభంగా దూకి లోనికి రావచ్చు.

"బంగళా చుట్టూ ఎంతమంది కాపలా వున్నారు?"

"ఒక్క సిపాయి వుంటాడు సార్. రాత్రంతా పహరా తిరుగుతూనే వుంటాడు."

"ఎవరైనా సులభంగా గోడదూకి లోనికి రావచ్చు. ఇద్దరు మనుషులు వచ్చారంటే మన జవాన్ను సులభంగా లోబరుచుకోగలరు. ఇది బాగాలేదు. ఇంతకు ముందులా అశ్రద్ధ పనికిరాదు. చాలా జాగ్రత్తగా వుండాలి. ముందు కాంపౌండ్ వాల్ పైన రెండడుగుల ఎత్తున ఐరన్ మెష్

వేయించండి. దాంట్లోకి ఇరవై నాలుగు గంటలు కరెంటు పాసయ్యే ఏర్పాట్లు చేయించాలి. రాత్రిళ్ళు ఇంటిచుట్టూ నలుగుర్ని కాపలా పెట్టు. అర్థమయిందా?'' అడిగాడు మోహన్.

''యస్ బాస్!'' అన్నాడతను.

''లోనికి పద!'' అంటూ దారితీశాడు మోహన్.

ఇద్దరూ లోనికి నడిచారు.

శాస్త్రిగారి లాబొరేటరీ అండర్ గ్రౌండ్‌లో వుంది. హాలు మధ్యనున్న ద్వారం ద్వారా క్రిందకి మెట్లమీదుగా వెళ్ళాలి అందులోకి. శాస్త్రితోపాటు మరి కొంతమంది కూడా అందులో పనిచేస్తున్నారు.

మేడ పైభాగాన మూడు గదులున్నాయి. ఆ గదులన్నీ క్షుణ్ణంగా పరిశీలించాడు. డ్రైనేజి, వాటర్, పైపులు క్రిందికి వున్నాయి. వాటిని ఆసరగా తీసుకొని ఎవరైనా పైకి ఎక్కి వచ్చే ప్రమాదముందని గ్రహించిన మోహన్, ప్రక్కనున్న సెక్యూరిటీ ఇన్‌ఛార్జికి తన అభిప్రాయం తెలిపాడు.

''ఏం చెయ్యమంటారు?'' అడిగాడు అతను.

''గోడను మధ్యకు పగుల గొట్టించి, మధ్యగా ఆ పైపులు పోయే ఏర్పాట్లు చేయించండి'' అన్నాడు మోహన్.

అతను అలాగే అంటూ తలూపాడు.

కారెక్కబోతూ ''మీరంతా అప్రమత్తులై వుండాలి. అతిత్వరలో ఆయన్ను అపహరించడానికి ఒక పెద్ద ముఠా ప్రయత్నంచేసే సూచనలు కనుపిస్తున్నాయి. ఆయన్ని చూడను వచ్చే ప్రతి మనిషినీ జాగ్రత్తగా పరిశీలించండి. కంటికి రెప్పలా కాపలా కాస్తూవుండండి!'' అన్నాడు మోహన్.

అందుకు అలాగే నన్నట్లు తల జోరుగా ఊపాడు.

మోహన్ కారెక్కి వెళ్ళిపోయాడు.

## 3

ఓడియన్ ముందాగిన టాక్సీలోంచి దిగింది సుసనా. డబ్బిచ్చి లోనికి వెళ్ళింది. కాఫీ బార్ ముందు నిలుచున్న కాఫీ కలర్ సూట్‌వాలాను చూసి నవ్వింది.

అతను కూడా నవ్వాడు. ఆమె అతని దగ్గరగా వెళ్ళింది.

"షో ప్రారంభం కాబోతుంది. వెళ్దామా లోనికి" అడిగాడతను ఇంగ్లీషులో.

"వెళ్దాం!" అంది సుసనా.

ఇద్దరూ ఒకరి చేతిలో మరొకరి చెయ్యి పట్టుకొని వెళ్ళారు. అతను హిప్పీలా జుట్టు పెంచివున్నాడు.

ఎప్పటిదో పాత చెత్త ఇంగ్లీషు సినిమా కావడంవల్ల, హైక్లాసులో అసలు జనమేలేరు. ఎవ్వరూ లేనిచోట ఒక మూలగా కూర్చున్నారిద్దరూ.

సినిమా మొదలయింది.

దాంతోపాటు వాళ్ళ సంభాషణ కూడా మొదలయింది.

"ప్రొఫెసర్ ఎలా వున్నాడు."

"మార్వెలస్. నన్ను చూడగానే అతనిలో కాస్త మార్పు కనుపించింది."

"నీ గురించి వివరాలు అడిగాడా?"

"ఆఁ! ఏదో చెప్పాను."

"ఆ తర్వాత."

"ఇండియా వదిలి వెళ్ళేముందు ఒకమారు వచ్చి తనతో కొద్ది రోజులుండి వెళ్ళమన్నాడు."

"వండర్‌ఫుల్! మన పని చాలా సులభంగా జరిగేట్లుంది," అన్నాడు అతను.

"ఇది సాధిస్తే...మనకు జీవితంలో దేనికీ లోటు లేకుండా చేస్తుందట మన ప్రభుత్వం" అంది ఆమె.

"ఇంతకు ముందు దాకా జరిగిన దొంగతనాలు, దోపిడీలు, సైంటిస్టుల అపహరణలు మన ప్లాను ముందు బలాదూరు. అభివృద్ధి చెందిన శాస్త్రంతోపాటు, మన పద్ధతులు కూడా అభివృద్ధి చెందాయి" అన్నాడతను.

"నువ్వేం చెబుతున్నావో నాకు అర్థంకావాలేదు." అంది సుసనా.

"చెబుతాను" అంటూ చీకట్లోనే చుట్టూ పరికించి చూశాడు. ఎవ్వరు దగ్గరలో మనిషి కనుపించకపోవడంతో ధైర్యం తెచ్చుకొని ఆమె చెవిపైకి తన నోరు పెట్టి చెప్పడం మొదలెట్టాడు.

"ప్రొఫెసర్ శాస్త్రిది చాలా గొప్ప బ్రెయిన్. మనకు మనిషితో పనిలేదు. కావలసింది అతని విలువైన మెదడు. దాన్ని దొంగిలించుకుపోతే చాలు" అన్నాడు.

"ఆఁ!" అంటూ ఆశ్చర్యపోతూ పిరుదులు సర్దుకుని కూర్చుంది నిటారుగా సీట్లో సుసనా.

"ఎందుకలా ఆశ్చర్యపోతున్నావ్?"

"అదెలా సాధ్యం!"

"అసాధ్యమనేది ఏదీ ప్రపంచంలో లేదు. బ్రెయిన్ ట్రాన్స్‌ప్లాంటేషన్ చెయ్యడంలో పేరుపొందిన డాక్టర్‌ను శాస్త్రి మెదడును వెలికితీసి, సురక్షితంగా మనదేశం తీసుకుపోయేందుకు ఏర్పాట్లు చేసి వుంచాం. నువ్వు చెయ్యవలసిందల్లా శాస్త్రిని నమ్మించి, అతని మనిషిగా కొద్ది దినాలు లోపలుండటం. ఆ ఆపరేషన్‌కు అవసరమైన మెడికల్ కిట్‌ను ఒక్కొక్కటి లోనికి చేరవెయ్యడం. ఆ తర్వాత ఆపరేషను జరగవలసిన రోజున ఇద్దరు డాక్ట

ర్లను లోనికి ప్రవేశపెట్టడానికి తగిన ఏర్పాట్లు చేసి వుంచడం. అంతే! మిగిలిందంతా సవ్యంగా జరిగిపోయేట్లు చూసే పూచీ నాది" అన్నాడు. అగంతకుడు.

"వింటుంటే విచిత్రంగా వుంది. ఏదో కథలో చదువు తున్నట్లుంది. ఈ గందరగోళంకన్నా ఆయన్ని అపహ రించుకు పోవడం సులభంకాదూ!" అడిగింది సుసనా.

"లాభంలేదు. మనిషి లేకపోవడంతో ప్రభుత్వం తమ యంత్రాంగాన్ని మనపైన వదులుతుంది. మనం ఈ దేశం సరిహద్దుల్ని కూడా దాటిపోలేం" అన్నాడతను మళ్ళీ.

"ఆల్ రైట్ ఇలాంటి విషయాల్లో నాకు అనుభవం తక్కువ. మీరేం చెయ్యమంటే అది చేస్తాను" అంది సుసనా.

"ఆపరేషన్ జరిగేప్పుడు అనస్తీషియా నువ్వే ఇవ్వాలి. అందులో నువ్వు ఎక్స్‌పర్ట్‌వి. అందుకే నిన్ను వినియోగించ మని కోరాను."

"ఓ. కే. అలాగే!"

ఆ తర్వాత సినిమా చూడటంలో నిమగ్నమయినారు. ఇంటర్వెల్ అయింది. లైట్లు వెలిగాయి. ఇద్దరూ వెలుపలికి వొచ్చారు.

కాఫీ బార్ ముందు నిలబడి ఐస్ క్రీమ్ కాఫీ త్రాగుతూ నిలుచున్నారు.

మంజుల కూడా వచ్చి, బార్‌లో డబ్బిచ్చి కాఫీ తీసు కుని, వాళ్ళకు కొద్ది దూరంలో నిలుచుని కాఫీ త్రాగడం మొదలెట్టింది.

ఢిల్లీనుండి వచ్చాక నాలుగు గంటలసేపు మద్రాసు మహానగరంలో వున్న సెవన్ స్టార్ హోటల్స్ మొత్తం టాక్సీలో తిరిగింది. సుసనా ఫోటో చూపించి ఆమెను

గురించి వాకబు చెయ్యసాగింది. అడిగినవాళ్ళకు తన్ను ఫలానా హోటల్‌లో కలుసుకోమని చెప్పిందనీ, తీరా అక్కడికి వెళ్ళి అడిగితే వాళ్ళు ఆ హోటల్‌లో దిగలేదని చెప్పారనీ, అందువల్లే వెదుక్కుంటూ తిరుగుతున్నాననీ, అందంగా అబద్ధం చెప్పి, వాళ్ళకు ఏ విధమైన అనుమానం కలుగకుండా జాగ్రత్తపడింది.

చివరకు ఎమరాల్డ్ హోటల్‌లో ఆమె ప్రయత్నం ఫలించింది. సుసనాకోసం అంతకు రెండు దినాలముందే రూం రిజర్వు చేసి వుంచారనీ, అందువల్ల ఆమె దిగి తిన్నగా గదికి వెళ్ళిపోయిందనీ, తను చూసే అవకాశం అసలు లేకనే వుండేదని అంటూ వాపోయినట్లు మాట్లాడాడు రిసెప్షనిస్టు.

"ఈమెను చూడకుండానే ఈ హోటల్లో వుందని ఎలా చెప్పావు?" అడిగింది మంజుల.

"ఆ రూం బాయ్‌వచ్చి మాటల్లో చాలా అందంగా వుంటుందని చెప్పాడు. నాకు ఫారినర్స్ అంటే కాస్త పిచ్చి. చెప్పగానే వెళ్ళి చూశాను. అన్ని ఏర్పాట్లు బాగున్నాయా అంటూ ఆమెను మాట్లాడించి చూశాను" అన్నాడు.

బ్రతుకు జీవుడా అనుకుంటూ, సుసనాకోసం వెయిట్ చేస్తూ ఎమరాల్డ్ హోటల్ కెదురుగా వున్న బ్యూటీ హెయిర్ డ్రెస్సింగ్ సెలూన్‌లో కూర్చుంది. అన్ని కుర్చీల్లో జనం వుండడంతో ఆమెకు తీరిగ్గా కూచునే అవకాశం లేదు. అది ఆడవాళ్ళకు హెయిర్ డ్రెస్ చేసే సెలూను.

అరగంట తర్వాత టాక్సీలో వెళ్తూ కనుపించింది.

తక్కున వెలుపలికొచ్చి ఆటో తీసుకొని టాక్సీని అనుసరించమని పురమాయించింది. ఓడియన్‌కు దూరంగాదిగి

నడచి వచ్చింది. వాళ్ళను లోనికి పోనిచ్చి, తనుకూడా వెళ్ళింది మంజుల. ముందు వాళ్ళకు దగ్గరలోనే వెళ్ళి కూర్చుందామనుకుంది. కానీ వాళ్ళ దృష్టిని అనవసరంగా తనవేపు ఆకర్షించుకోవడం అవివేకమైన చర్యనుకొని దూరంగా కూర్చుంది.

కాఫీ గ్లాసులు బార్ కౌంటర్ పైన వుంచి లోనికి నడిచారు ఇద్దరూ.

మంజుల వాళ్ళ వెంటే వెళ్ళింది.

ఆమెకు సుసనా ప్రక్కనున్న మగమనిషి ఎవరో, ఎక్కడుంటున్నాడో, అతనికీ, సుసనాకు సంబంధం ఏమిటో తెలుసుకోవడం చాలా అవసరంగా తోచింది. షో వదిలాక అతన్ని అనుసరించిపోవడం మంచిదని నిర్ణయించుకొంది.

గంట తర్వాత హాల్లో లైట్లు వెలిగాయి.

అందరూ లేచి వెలుపలకొచ్చారు.

ఈమారు సుసనా అతనితో సంబంధం లేనట్లుగా వడివడిగా వెళ్ళి, టాక్సీ ఎక్కి వెళ్ళిపోయింది. అతను కారు పార్కింగ్ లోకి వెళ్ళి నల్ల అంబాసిడర్ కారెక్కి స్టార్టు చేశాడు.

లైటు వెలుగులో ఆ కారు నెంబరు నోట్ చేసుకుంది.

కారును అనుసరించి పోనిమ్మంది తనెక్కిన టాక్సీని. మద్రాసు నగరాన్ని దాటిపోసాగింది కారు మహాబలిపురం వేపు.

డ్రైవరు అనుమానంగా ఆమెకేసి చూశాడు.

"పోనీ!" అంది చెక్కు చెదరని ధైర్యంతో.

మెయిన్ రోడ్ పైనుండి చీలిపోయే సన్న రోడ్ పైకి మళ్ళింది కారు. టాక్సీకూడా దాన్ని అనుసరించింది.

అరమైలు పోయాక సముద్రపు ఒడ్డున మెర్క్యూరీ లైట్ల కాంతిలో చిన్న చిన్న గుడిసెలు కనుపించాయి. సింహద్వారం మీద నియోన్ సైన్స్ వెలుగుతున్నాయి. "గోల్డన్ కేజెస్" అని వున్న ఇంగ్లీషు అక్షరాలు చదువుకొంది.

కారు తిన్నగా లోనికి వెళ్ళిపోయింది.

టాక్సీ రిసెప్షన్ వద్ద ఆగింది.

మంజుల దిగి లోనికి వెళ్ళింది. డెకొలమ్ టేబుల్ కావల కునికిపాట్లు పడుతున్న సూట్‌వాలను నిద్ర లేపేందుకన్నట్లు హాండ్‌బ్యాగ్‌ను బలంగా కొట్టింది టేబుల్ పైన. అతను కళ్ళు తెరచి మంజులను చూసి "యస్. మేడమ్!" అన్నాడు.

"ఖాళీ వుందా?" అడిగింది.

"సారీ! అన్నీ బుక్ అయినాయి" అన్నాడు అతను.

"నిద్రమత్తులో వున్నట్లున్నావు. ఓ మారు మళ్ళీ రిజిస్టరు నింపాదిగా చూసి చెప్పు. పాతిక రూపాయలు ఖర్చుపెట్టుకొని టాక్సీలో వచ్చాను" అంది మంజుల.

"రియలీ సారీ! ఇంతదాకా రాకుండా ఫోన్ చేసి వుంటే విషయం చెప్పేవాణ్ణి. మీకు పాతిక రూపాయలు మిగిలేవి" అన్నాడతను.

అంతలోనే సినిమా హాలునుండి మంజుల వెంటాడుకుంటూ వచ్చిన వ్యక్తి లోనికొచ్చి "కార్ కీస్!" అంటూ తాళాల రింగును గిరవాటు వేశాడు.

"అయితే లాభం లేదంటావా?" అడిగింది మంజుల.

"మీకు అకామిడేషన్ లేదంటున్నాడా?" అడిగాడు కల్పించుకొని ముందుకొచ్చి మంజులతో మాటలు కలుపుతూ.

"అవునండీ!" అంది మంజుల.

"మీ రొక్కరేనా?" అడిగాడు అతను.

ఏం చెప్పాలా అని ఆలోచించిందొక్షణం. అతనికి తను ఒంటరి దాన్నని తెలుపటం ఇష్టం లేకపోయింది.

"ప్రస్తుతం వొంటరిగానే వచ్చాను. కేజ్ దొరికితే ఫోన్ చెయ్యమన్నాడు నా బాయ్ ఫ్రెండ్. ఆ అదృష్టం వున్నట్లు లేదు" అంది మంజుల.

"సారీ! ఒక్కరయితే నాతో వుండొచ్చు. నేను రాత్రిళ్ళు సముద్రపు ఒడ్డున ఇసుకలో పడుకుంటూ వుంటాను మామూలుగా?" అన్నాడతను.

"అలాంటప్పుడు నా ఫ్రెండ్‌ను రమ్మంటే మాత్రం మీకేం అభ్యంతరం" అడిగింది మంజుల.

"ఐదింటికల్లా నేను స్నానం చేస్తాను. మీరు ఆ టైముకు ఖాళీ చెయ్యలేరుగా?" అన్నాడు నవ్వుతూ.

"అంతకు ముందుగానే ఖాళీచేసి వెళ్ళిపోతాం" అంది మంజుల.

"అయితే నాకేం అభ్యంతరం లేదు. మీ ఫ్రెండ్‌కు ఫోన్ చేసి ఆరో నెంబరుకు రండి" అంటూ అతను వెళ్ళిపోయాడు.

మంజుల టాక్సీకి డబ్బిచ్చి పంపేసింది.

టెలిఫోన్ తీసుకొని ఒక నెంబరుకు డయల్ చేసి చెప్పింది రమ్మని. ఆ తర్వాత ఫోన్ పెట్టేసి ఆరో నెంబరు కజ్ వైపు వెళ్ళింది.

పేము కుర్చీలో కూర్చుని తాపీగా విస్కీ త్రాగుతున్నాడు అతను.

"రండి! కూర్చోండి!" అంటూ ఆహ్వానించాడు.

అతని కెదురుగా కూర్చుంది మంజుల.

"ఈ దేశంలో ప్రేమించుకున్న జంటలు ఇలా దొంగ తనంగా ఎందుకు కలుసుకుంటూ వుంటారో నాకు అర్థం కావడం లేదు. మీరు చేసేది తప్పనిపిస్తుంటుందా?" అడిగా డతను సిగరెట్ కాలుస్తూ.

"కాదు! పెద్దవాళ్ళంటే గౌరవం. మీ దేశంలో విచ్చలవిడిగా తిరుగుతారా?"

"ఆc! ఒక విధంగా."

"మేమింకా అంత ముందుకు పోలేదు!" అంది మంజుల కళ్ళతో గదినంతా పరిశీలించి చూస్తూ.

"మీ ఫ్రెండ్‌కు ఫోన్ చేశారా?"

"ఆc! ఇంతకూ మీ దే దేశం.ఇక్కడేం చేస్తుంటారు."

"నాది ఏ దేశమయినా దానికి గుడ్ బై కొట్టేశాను. కృష్ణ భక్తుణ్ణి. ఇక్కడే వుందామని వచ్చేశాను."

"ఇలా ఆడంబరంగా జీవించేందుకు డబ్బు ఎలా వస్తుంది?"

"మా ఫాదర్‌కు కావలసినంత వుంది. వద్దన్నా పంపు తుంటాడు" అన్నాడతను.

"లక్కీ పీపుల్!" అంది మంజుల.

"ఆతనొచ్చే దాకా కూర్చుంటాను. ఆ తర్వాత వెళ్ళి పోతాను" అన్నాడు అతను.

"అలాగే! మీ పేరు చెప్పారు కాదు?" గుర్తుచేసింది.

"క్రిష్ణ సేవక్ అనండి చాలు" అన్నాడు.

"వండర్ ఫుల్!" అతని పేరును మెచ్చుకుంది.

ఆరడుగుల ఆజానుబాహు విగ్రహాన్ని గుమ్మంలో నిలుపు కొని "లోనికి రావచ్చా!" అడిగాడు శేఖర్. మద్రాసులో ఆర్నీ ఇంటలిజెన్సుకు అధిపతి అతను.

"మీ కోసం చూస్తున్నాను" అంటూ ఎదురు వెళ్ళి

ఆహ్వానించు కొచ్చింది మంజుల అతన్ని. ఒకర్నొకరు పరిచయం చేసుకున్నారు.

"నేను వెళ్తాను" అంటూ లేచాడు కృష్ణ సేవక్.

"మిమ్మల్ని ఇబ్బంది పెడుతున్నట్లున్నాం!" అన్నాడు శేఖర్.

"అలాంటిదేమీ లేదు" అన్నాడు సేవక్ లేచి వెళ్తూ.

అతను దూరంగా వెళ్ళిపోయాడని తీర్మానించుకొన్నాక ఇద్దరూ తలుపులు దగ్గరగా మూసి కూర్చున్నారు.

"ఇప్పుడేం చెయ్యాలి!" అడిగాడు శేఖర్.

"నిజంగానే బాయ్ ఫ్రెండ్ ననుకొని మాత్రం నాపైన పడకు" అంది నవ్వుతూ మంజుల.

పకాపకా నవ్వాడు శేఖర్.

ఆ గదిలో సామానులన్నీ క్షుణ్ణంగా పరిశోధించారు. ఏవైనా వాళ్ళ రహస్యాలు పట్టిచ్చే పత్రాలు దొరకుతాయేమోనని చూశారు. కానీ లాభంలేక పోయింది. మెడికల్ సర్జరీ గురించిన పెద్ద పెద్ద పుస్తకాలు మాత్రం వున్నాయి.

"ఇతను డాక్టరులాగున్నాడు" అంది మంజుల.

"అవును" అన్నాడు శేఖర్.

"అంతా అయోమయంగావుంది. ప్రొఫెసర్ శాస్త్రిని వల్లో వేసుకోను ప్రయత్నించిన సుసనా, ఈ కృష్ణ సేవక్ బహుశా ఒక దేశానికే సంబంధించిన వాళ్ళయివుండాలి. లేదా ఒకే గాంగుకు చెందిన మనుషులయి వుంటారు" అంటూ అంతకుముందు ఓడియన్‌లో వాళ్లు సినిమా చూసిన వైనం, తను వెంబడించడం వివరంగా చెప్పింది మంజుల.

"ఇప్పుడేంచేద్దాం!" అడిగాడు శేఖర్.

"ఎలక్ట్రానిక్ వైర్ లెస్ ట్రాన్స్‌మీటర్ తెచ్చాను.

అతనికి కనుపించకుండా వుండేచోట పెడదాం. దాని రిసీవరు మీ ఆఫీసులో పెట్టు. ఇతని రహస్యాలన్నీ సులభంగా తెలుసుకోగలుగుతాం.''

''అలాగే!'' అన్నాడు శేఖర్.

మంజుల హాండ్ బ్యాగ్ తెరచింది. అందులోంచి చిన్న ఇన్స్ట్రుమెంట్ తీసి స్విచ్ ఆన్ చేసింది. లోపలంతా వెతికి, చివరకు ప్రక్కప్పులో పెట్టడం క్షేమమని తీర్మానించుకున్నారు. స్టూలు సాయంతో శేఖర్ దాన్ని పైనున్న కొబ్బరి ఆకుల్లో దూర్చాడు.

ఆ చిన్న యంత్రానికి కరెంటు అవసరం లేదు. రీచార్జింగ్ బాటరీ సెల్స్ వున్నాయి. వాటంతటవే చార్జ్ అవుతుంటాయి. ఎన్ని దినాలయినా అంతరాయంలేకుండా పనిచేస్తుంది.

''మనం వచ్చిన పని అయినట్లే!'' అన్నాడు శేఖర్ వాచీ చూసుకుంటూ. గంట మూడయింది. ఇంకో రెండు గంటలు గడిస్తేగానీ కృష్ణసేవక్ గదిలోకి రాడు. పిచ్చాపాటి మాట్లాడుకుంటూ గడిపారు.

ఐదు ప్రాంతాల్లో తలుపుతట్టిన శబ్దమైంది. శేఖర్ వెళ్ళి తలుపు తెరిచాడు.

''నిద్రపోలేదా?'' అడిగాడు కృష్ణసేవక్ బెడ్ రోల్ తెచ్చి లోన పడేస్తూ.

సమాధానంగా నవ్వి ''థాంక్స్! మేము వెళ్ళొస్తాం! మీ సాయానికి ఎంతో కృతజ్ఞులం!'' అన్నాడు.

''నో మెన్షన్! నాకు గరల్ ఫ్రెండొకతె వుండేది. ఇలాగే నేను ఇబ్బందిపడ్డ సంఘటనలు వున్నాయి. అందుకే మీ బాధ అర్థంచేసుకున్నాను'' అన్నాడు కృష్ణసేవక్

ఆ తర్వాత శేఖర్ కార్లో ఎక్కింది మంజుల. కారు మద్రాసునగరంవేపు పరుగు అందుకుంది.

## 4

కారు వెళ్ళాక లోనికొచ్చాడు కృష్ణసేవక్. అతనికి నవ్వొచ్చింది. మంజులను హాల్లోనే గమనించాడు. ఆమె మాటిమాటికీ తమాకేసి చూడటం, ఆ తర్వాత తన్ను కార్లో వెంబడించడంకూడా కనిపెట్టాడు.

గోల్డన్ కేజ్ దగ్గర ఆమె నాటకమాడుతూండటం కూడా పసిగట్టాడు. తనపైన ఆమెకున్న అనుమానాన్ని పోగొట్టుదామనే ఉద్దేశ్యంతో, గది ఖాళీచేసి ఇచ్చాడు.

గదంతా పరిశీలించి చూశాడు. పుస్తకాలన్నీ ఎగుడు దిగుడుగా వున్నాయి. కుర్చీలు జరిపి వున్నాయి. సూట్ కేస్ స్థలం మారివుంది. అంటే వాళ్ళు రాత్రంతా తన వస్తువులు క్షుణ్ణంగా వెతికివుంటారనుకున్నాడు.

బెడ్ రోల్ విప్పి, అందులోంచి తలగడ వెలుపలకు లాగాడు. కవరుకూ, దిండుకూ మధ్య దాచిన మీటర్ను తీసి, దాని వైర్లను ప్లగ్ లో పెట్టి స్విచ్ ఆన్ చేశాడు. మీటర్ పైకి ముల్లు జుఁయ్‌మని ప్రక్కకు వాలింది. చూచి నవ్వుకున్నాడు. గదిలో ఎలక్ట్రానిక్ బగ్ లాంటిదో పెట్టి వెళ్ళినట్లు ఋజువయింది. దానికోసం గాలించాడు. కనుపించలేదు. మళ్ళీ మీటర్ తో చెక్ చేశాడు. అంతకుముందు లాగే రీడింగ్ చూపించిందది. ఇంకోమారు నిదానంగా వెతికాడు. ప్రయోజనం లేకపోయింది.

అంతదాకా తను క్రిందే వెతుకుతున్నానని తెలుసుకొన్నాడు. పైకప్పు కొబ్బరి ఆకులతో వేసింది. అందులో పెట్టే అవకాశంవుంది. స్టూలు వేసుకొని పైనంతా వెతికాడు. అతని ప్రయత్నం ఫలించింది. ఆ చిన్నయంత్రం దొరికింది. దాని స్విచ్ ఆఫ్ చేశాడు.

ఇండియన్ ఇంటలిజెన్స్ శాఖవారికి, సుసనా ఇండి

యాలో అడుగుబెట్టిన పన్నెండు గంటలలో తమపైన అనుమానం వేసిందన్న నగ్నసత్యం గుర్తొచ్చాక; కృష్ణసేవక్ లో కొంత కంగారు పుట్టింది. తమ రహస్యాల్నీ, పథకాల్నీ, పట్టివ్వనంతవరకూ, కార్యసాధనలో కష్టాలు రావన్న నమ్మకంకూడా ఓ మూల మెదలుతూనే వుంది.

ఎమరాల్డ్ హోటల్ కు ఫోన్ చేసి సుసనాను అర్జంటుగా ఇలియట్స్ బీచ్ లోవచ్చి కలుసుకోమని చెప్పాడు, కృష్ణసేవక్. ఆ తర్వాత రిసెప్షనులో కారుతాళాలు తీసుకుని బయలుదేరాడు.

ఇలియట్స్ బీచ్ కు పోయే త్రోవలో చిన్న సారా దుకాణం కనుపించింది. కారాపి, దిగి, వెళ్ళి అందులో దూరి రెండుగ్లాసులు పట్టించాడు. ఎవ్వరూ చూడకుండా దగ్గరున్న ఎలక్ట్రానిక్ ట్రాన్స్‌మిటర్ను చూరులో దోపి, చల్లగా వెలుపలకు జారుకొన్నాడు. కారెక్కి బీచ్ కు పోనిచ్చాడు.

అరగంట తర్వాత ఆటో దిగివచ్చింది సుసనా.

"నీకు ఫోన్ చేద్దామనుకుంటూ ఉండగా, నువ్వే ఫోన్ చేశావ్! ఏమిటీ హడావుడి?"

అడిగింది అతని కెదురుగా ఇసుకలో కూర్చుంటూ.

జరిగిందంతా చెప్పాడు వివరంగా. తదేకంగా వినింది సుసనా. ఆ తర్వాత తనూ చెప్పింది, అంతకు ముందు రోజు ఎవరో స్త్రీ ఎమరాల్డ్ హోటల్ కు వచ్చి తన ఫోటో చూపించి అడిగిన వైనం గురించి.

"ఆమే ఈమె!" అన్నాడు కృష్ణసేవక్.

"నా ఫోటో ఎలా దొరికిందామెకు?"

"ప్రొఫెసర్ శాస్త్రిని ప్రభుత్వం అ స్తమానం కాపలా కాస్తూవున్నట్లుంది. అతనితో మాట్లాడిన ప్రతీ మనిషిని

ఫోటోలు తీయిస్తున్నారేమో. నీమీద అంత తొందరగా అనుమానం ఎలా కలిగింది?'' అడిగాడు కృష్ణ సేవక్.

''అదే అర్థంకావడంలేదు!'' అంది సుసనా.

''మన హెడ్ క్వార్టర్సును కాంటాక్టు చేశాను. వివరాలు చెప్పాను. వాళ్లేమీ భయపడవద్దనీ, ప్లాను ప్రకారం పనులు కానివ్వమని సలహా ఇచ్చారు'' అన్నాడు కృష్ణ సేవక్.

''ఒకవేళ శాస్త్రికి మనగురించి చెప్పి, అతన్ని తగిన జాగ్రత్తలో ఉండమని ప్రభుత్వం సలహా ఇస్తే!''తన అనుమానం వ్యక్తపరిచింది సుసనా.

''అలా జరగదు. అటువంటి విషయాలు చెప్తే ఆయన మెదడు పరిశోధనల పైనుండి మరలి ప్రాణ రక్షణ విధానాలన్ని వెతుక్కోవడంలో మునిగిపోతుంది. అందువల్ల ఆయన్ను రక్షించే బాధ్యత తమ నెత్తినే పెట్టుకొంటారు.''

''అయితే ఇప్పుడు మనం చెయ్యావలసిందేమిటి?''

''త్వరగా పని ముగించుకోవడం. మేమంతా రెండు దినాల్లోఢిల్లీ చేరుకుంటాం. నువ్వుకూడా చారిత్రాత్మకమైన ప్రదేశాలుకొన్ని చూచుకొని ఆదివారం సాయంత్రం ఆగ్రా నుండి తాజ్ ఎక్స్‌ప్రెస్‌లో బయలుదేరేట్లు రా. క్రొత్త ఢిల్లీకి శాస్త్రిని వచ్చి కలుసుకోమని వైర్ చెయ్యి. నువ్వెళ్ళి అతని బంగళాలో సెటిల్ అయ్యాక మేము నిన్ను కలుసుకుంటాం. పని ప్రారంభించేద్దాం. అక్కడ పరిస్థితులు నీకు ప్రతికూలంగా ఉంటే మాకు తెలియజెయ్యి. పథకం మారుస్తాం!'' అన్నాడు కృష్ణ సేవక్.

''అలాగే! కానీ ఎక్కడ కలుసుకోవాలి.''

''కన్నాట్ సర్కస్‌లో ఇండియా కాఫీ హౌస్ వుంది.

నేనూ రోజూ సాయంత్రం ఐదునుండి ఏడుదాకా అక్కడే ఉంటాను. ఫోన్లు మాత్రం ఉపయోగించవద్దు. సరేనా!" అడిగాడు కృష్ణసేవక్.

"సరే!" అంది సుసనా.

"మంజులను, శేఖర్ను నా కెమరాతో ఫోటోలు తీశాను. ఫిల్మ్ ఇందులోవుంది. డెవలప్ చేయించి, ప్రింట్లు తీయించి చూసుకో. వాళ్ళిద్దరిలో ఎవరో ఒకరు నిన్ను వెంబడించే అవకాశంవుంది. జాగ్రత్తగావుండు" అన్నాడు చిన్న మినీకెమెరా అందిస్తూ.

"అలాగే!" అంది సుసనా.

ఆ తర్వాత ఇద్దరూ ఎవరిదోవన వాళ్ళు వెళ్ళిపోయారు.

సుసనా హోటల్ రూంలోకి వెళ్ళింది. తలుపు తెరచి చూసింది. గదంతా చిందరవందరగావుంది. ఎవరో సామాన్లన్నీ వెతికినట్లు అనుమానం వేసింది. ఫ్లోర్ సూపర్ వైజర్ను పిలిపించింది బాయ్ద్వారా. అతను వచ్చి నిలుచున్నాడు ఎదురుగా.

"నేను లేనప్పుడు ఎవరైనా వచ్చారా నాకోసం" అడిగింది.

"రాలేదండీ!" చెప్పాడు.

"నా గదికి తాళంవేసి వెళ్ళాను. కానీ ఎవరో తెరచి గదిలో జొరబడ్డారు" అంది కోపంగా సుసనా.

"సారీ! అలా జరిగేందుకు వీలులేదు మేడమ్. అయినా వాకబుచేసి చెప్తాను" అంటూ వెళ్ళిపోయాడు.

ఈ పని మంజులదే అయివుండాలనిపించింది. ఆమె గుండెలుతీసిన బంటులాగుందనుకొంది. తన సామాన్లన్నీ చెక్ చేసుకొంది. అన్నీ ఉన్నాయి.

తన రహస్యాల్ని తెలుసుకొనేందుకు గదిలో ఏదైనా

యంత్రం అమర్చిందేమోనన్న అనుమానం కలిగింది. ఆ గది ఖాళీచేసి వెంటనే మరో హోటల్‌కు వెళ్ళడం మంచిదన్న నిర్ణయానికొచ్చింది సుసనా. అంతలోనే ఫ్లోర్ సూపర్‌వైజర్ వచ్చాడు.

"మీ గదిలోకి ఎవరూ వెళ్తూండడం చూడలేదంటున్నారు మా సర్వెంట్స్" అన్నాడు.

"వాళ్ళు చూడనంతమాత్రాన, నేను చెప్పింది నిజం కాకుండా పోతుందా?" అడిగింది కోపంగా.

మౌనంగా నిలుచున్నాడు.

"నేను రూం ఖాళీ చేస్తున్నాను. బిల్ పంపండి. పే చేస్తాను" అంది.

ఆమెతో అనవసరమైన చర్చకు దిగేందుకు ఇష్టంలేక "అలాగే!" అంటూ వెళ్ళిపోయాడు.

ఆ తర్వాత అరగంటలో గది ఖాళీచేసి వెళ్ళిపోయింది సుసనా.

## 5

ప్రొఫెసర్ శాస్త్రి బంగళాలో జరుగుతున్న రిపేర్లు చూసి విస్తుపోయాడు. కాంపౌండ్ వాల్ పైన బార్బ్‌డ్ వైర్ బిగించడం, బిల్డింగు గోడలు పగులగొట్టడం, సెక్యూరిటీకోసం అంతకుముందునుండి ఉంటూ వచ్చిన నలుగురు సిపాయిలకు తోడు మరో నలుగురు మనుషులు క్రొత్తగా రావడం కాస్త వింతగా కనుపించింది.

ఇన్‌ఛార్జి ఆఫీసర్ను పిలిచి అడిగాడు.

అతను "నాకేం తెలీదు సార్. హెడ్ క్వార్టర్సు ఆదేశాలను బట్టే పనులు జరుగుతున్నాయ్" అన్నాడు.

శాస్త్రికి అతని సమాధానం అంతగా తృప్తినివ్వలేదు.

ఫోన్ చేశాడు మేజర్ మోహన్‌కు. అతను లైన్లోకి

రాగానే "ఏమిటి నా బంగళాలో హడావుడిగా వుంది!" అడిగాడు.

"ఏం లేదు సార్! అదంతా రొటీన్ గా జరిగేదే! దాన్ని గురించి పట్టించుకోనవసరం లేదు" అన్నాడు మోహన్.

"ఉన్నట్టుండి ఇవన్నీ చెయ్యవలసిన అవసరం ఎందుకొచ్చిందో నీకు తెలీదా?"

"తెలుసు సార్. నేనే మొన్న వచ్చి చూశాను. కొన్ని సూచనలిచ్చాను. మీరు దేశానికి విలువైన విషయాల్ని గురించి పరిశోధన సాగిస్తున్నారు. ఏవిధమైన అంతరాయం లేకుండా, ఆపద రాకుండా, చూడవలసిన అవసరం నాకుంది" అన్నాడు మోహన్.

"ఆల్ రైట్! మీ వాళ్ళకు నాకోసం వచ్చే విజిటర్స్‌ను ఇబ్బంది పెట్టవద్దని చెప్పు. నా వ్యక్తిగత జీవితానికీ, ఆనందానికీ అడ్డురాకుండా ఉండేట్లుగా చూడటం అవసరం" అన్నాడు శాస్త్రి.

"అలాగే సార్! అందుకు విరుద్ధంగా ఎవరైనా ప్రవర్తిస్తే నాకు చెప్పండి. వాళ్లను అతి కఠినంగా శిక్షిస్తాను" అన్నాడు మేజర్ మోహన్.

"థాంక్స్!" అంటూ ఫోన్ కట్ చేశాడు శాస్త్రి.

మేజర్ మోహన్‌తో మాట్లాడాక కూడా, శాస్త్రి గారికి ఆకస్మికంగా ఇంత బందోబస్తు ఎందుకు చేస్తున్నారో సరిగ్గా అర్థంకాలేదు. తన్నెవరైనా అనుమానిస్తున్నారా? తన దేశభక్తి, చిత్తవృత్తీ తెలియనివాళ్ళెవరూ లేరు. అయినా ఎందుకిలా ప్రవర్తిస్తున్నట్లు? ఆలోచిస్తూ కూర్చున్నాడు.

బాయ్ వచ్చి ఉత్తరాల దొంతర టీపాయ్ పైన పెట్టి వెళ్ళాడు.

ఒక్కొక్క ఉత్తరమే తీసుకొని చదువసాగాడు. అన్నీ మామూలే. నీలంరంగు కవరు కనుపించింది. ఫ్రమ్ అడ్రసు చదువుకొని ఉత్సాహంగా కుర్చీలో సర్దుకుని కూర్చున్నాడు. చింపి చదువబోయి, మళ్ళీ ఆ ప్రయత్నం మానుకొని, ఉత్తరంతోసహా మెట్లెక్కి పైనున్న బెడ్ రూంకి వెళ్ళి, తలుపులు మూసుకుని చదువుకున్నాడు.

ఆ ఉత్తరం సుసనా రాసింది. తను ఆదివారం రాత్రి తాజ్ ఎక్స్‌ప్రెస్‌కు వస్తున్నట్లు, వీలైతే వచ్చి స్టేషనులో కలుసుకుంటే, కొద్దిరోజులు శాస్త్రిగారి అతిథ్యం స్వీకరించి, తనదేశం వెళ్ళిపోదలచుకున్నట్టుగా తెలియపరచింది.

ఉత్తరంలోవున్న అక్షరాలు మాయమై, వాటి స్థానంలో సుసనా అందమైన మొహం, సుందరమైన రూపం, కనుపించసాగాయ్.

అందమైన ఆమె పొందులో జీవితం విందు చేసుకోవాలన్న ఆతృత అధికమైంది. ఆరోజు శుక్రవారం. రాబోయే అతిథి స్త్రీ కావడంతో ఆమెకు అవసరమయ్యే వస్తువుల జాబితా తయారుచేశాడు. మిగిలిన రెండు దినాలు షాపింగు చెయ్యడంలో గడిపాడు.

ఆదివారం లాబ్‌లోకి వెళ్ళకుండానే గడిపాడు.

తొమ్మిదింటికల్లా పూలరంగడిలా తయారయి, ఇంపోర్టెడ్ ఇంపాలాలో స్టేషనుకు చేరుకున్నాడు.

తాజ్ ఎక్స్‌ప్రెస్ వచ్చి ఆగింది.

ఏర్ కండిషన్డ్ కంపార్టుమెంటులోంచి రెండు పెద్ద సూట్‌కేసులతో దిగింది సుసనా. ఎర్రటి పాంటు, అదే రంగు స్వెట్టరు తొడుక్కుంది. జుట్టుకు మెడమీద ఎర్ర స్కార్ఫ్ అందంగా బిగించి గులాబిలా ముడివేసుకొంది. పెదాలకు ఎర్రటి లిప్‌స్టిక్ రాసుకుంది.

స్వెటర్ లోంచి పైకుబుకుతున్న ఎత్తైన గుండ్రటి బొమ్మలకేసి నింపాదిగా చూడసాగాడు శాస్త్రి.

"మిస్టర్ శాస్త్రి!" పిలిచింది సుసనా.

శాస్త్రి ఆమె ముందుకు వెళ్ళి "నిన్ను చూశాక నోట మాట రాలేదు!" అన్నాడు.

"ఏం? భయంకరంగా ఉన్నానా?" అంటూ నవ్వింది.

"కాదు! మనోహరంగా ఉన్నావు."

"మీ వెంట తీసుకెళ్తారా? లేక ఏదైన హోటల్ చూసుకోమంటారా?" అడిగింది సుసనా హాండ్ బ్యాగ్ లోంచి టికెట్ తీస్తూ.

"నీకోసం నా బంగళాలో అన్ని ఏర్పాట్లు చేశాను. ఇక్కడున్నన్ని రోజులు నాతోనే ఉండాలి!" అన్నాడు శాస్త్రి.

"థాంక్స్!" అంది.

పోర్టరు సూట్ కేసులు అందుకుని ముందుకు నడిచాడు. అతని వెంట ఇద్దరూ నడిచారు.

ఇంపాలా కదిలింది.

"మార్వెలెస్ కారు చాలా బాగుంది" అంది సుసనా.

"నాకున్న ఆస్తి మొత్తం ఇదే!"

"మీకు అందమైన వస్తువులంటే చాలా ఇష్టంలా గుంది."

"కరెక్ట్! అందువల్లే నువ్వన్నా నాకు విపరీతమైన ఇష్టం!" అన్నాడు శాస్త్రి తన మనస్సులో ఆమెగురించి ఏర్పడ్డ అభిప్రాయాన్ని అణచుకోను సాధ్యంగాక.

ఇండియాకి వచ్చాక, తను చూచిన ప్రదేశాలు, వింతలు, వివరంగా చెప్తూ వసపిట్టలా మాట్లాడసాగింది. శాస్త్రి డ్రైవ్ చేస్తూనే ఆమె మాటలు వినసాగాడు. మొదటి

సారిగా శరీరంలోని రక్తం వేడిగా ప్రవహిస్తున్నట్లు, ఆ వేడి కళ్ళకు ప్రాకినట్లు ఫీలయినాడు.

కారు బంగళాముందుకు వచ్చింది.

పూర్తి యూనిఫాంలోవున్న జవానువచ్చి గేటు తెరచాడు. శాస్త్రి కారును లోనికి పోనిచ్చాడు. పోర్టికోలో ఆగగానే, మరో జవాను వచ్చి తలుపు తెరచాడు. శాస్త్రి దిగాడు. తనవేపు తలుపు తెరచి పట్టుకున్నా, సుసనా అటుకేసి దిగకుండా, స్టీరింగుకేసుముందుగుండా శాస్త్రితో పాటే దిగింది కారు.

హాలులోని కదుగెట్టింది సుసనా. అక్కడ మరో ఇద్దరు జవాన్లు కనుపించారు. ఆమె గుండెల్లో బండ పడింది. కాస్త ఇబ్బందిగా మొహంపెట్టుకొని శాస్త్రి వెంట మేడమెట్లెక్కింది. బెడ్ రూంలోనికి వెళ్ళారిద్దరూ.

"ఇది నా రూం! ఇందులో నువ్వుండు. ప్రక్కగది నేను సర్దుకున్నాను" అన్నాడు శాస్త్రి.

"సారీ! మీకు చాలా శ్రమ ఇస్తున్నట్లున్నాను" అంది సుసనా.

"నథింగ్! అలా అనుకోవద్దు!" అన్నాడు శాస్త్రి.

సుసనా వెళ్ళి కిటికీ తలుపులు తెరచి, వంగి చూసింది. అందమైన తోట కనుపించింది. లైటు వెలుగులో పహరా కాస్తూ వెళ్ళిన జవాను కనుపించాడు. తక్కున వెనక్కు తిరిగివచ్చి కుర్చీలో జేరబడింది.

"ఏం తీసుకుంటావ్?"అడిగాడు శాస్త్రి ఆప్యాయంగా.

"నేను రైల్లోనే భోజనం ముగించాను. మీరు మీ పనులు చూసుకోండి. కాస్త స్నానంచేసి బట్టలు మార్చుకుంటాను" అంది సుసనా.

"అలాగే! ప్రయాణంలో అలసిపోయి వుంటావ్.

విశ్రాంతి తీసుకో! ప్రొద్దున్నే కలుసుకుందాం!" అన్నాడు శాస్త్రి.

"ప్రయాణాలు చెయ్యటం నాకు అలవాటే. స్నానం చేసి వస్తాను. కూర్చోనుండండి" అంటూ బాత్ రూంకు వెళ్ళిపోయింది.

ఇరవై నిమషాల తర్వాత వెలుపలి కొచ్చింది. వొంటి పైన సన్నటి సిల్కు నైట్ గౌన్ వేసుకుంది. లోపల ఏవిధమైన బట్టలులేవు. అంగాంగాల వొంపులు, సొంపులు, స్పష్టంగా కనుపించసాగాయి లైటు వెలుగులో.

తల తుడుచుకుంటూవచ్చి కూర్చుంది శాస్త్రి కెదురుగా.

"ఎలాగుంది నా బంగళా?" అడిగాడు శాస్త్రి గర్వంగా.

"ఇది బంగళా అనుకోలేను!" అంది సుసనా.

"మరి...?"

"జైలనుకున్నాను."

"ఎందుకని?"

"అడుగడుగునా సిపాయిలు కనుపిస్తున్నారు. ఇక్కడ మనిషికి అవసరమైన కనీసపు శాంతికూడా ఉంటుందాని నా అనుమానం."

"నా వృత్తిరీత్యా ఈ హడావుడి తప్పటంలేదు. నాకూ ఇబ్బందిగానే వుంటుంది" అన్నాడు శాస్త్రి.

"మీకు పెళ్ళయ్యాక మీ భార్యను తీసుకొస్తే, ఆమె మొదటరోజే దండంపెట్టి విడాకులు పుచ్చుకుని వెళ్ళి పోతుంది" నవ్వుతూనే చెప్పింది.

"అవును. రేపే మాట్లాడి వీళ్ళందర్నీ పంపించివేస్తాను" అన్నాడు శాస్త్రి.

"అది జరిగిందాకా నా మనస్సుకు సంతోషంగా ఉండదు. నా ఆశలన్నీ నిరాశలయినాయి. ఎన్నో ఊహలతో వచ్చాను" అంది మత్తుగా చూస్తూ.

శాస్త్రికి ఆ చూపు తగలవలసినచోట తగిలింది. ఆమె చెప్పకుండానే తను ఇంటినుండి ఈ మందినీ, మాన్యాలన్నీ తరలించి ఉండవలసిందనిపించింది.

"సారీ! తెల్లవారగానే ఈ విషయం సెటిల్ చేస్తాను. ఈ రాత్రికి ఎలాగో నిద్రపో!" అని చెప్పి లేచి వెళ్ళి పోయాడు శాస్త్రి.

అతను వెళ్ళాక తలుపులుమూసి లైటార్పి పడుకుంది మంచంపైన.

కృష్ణసేవక్ వేసిన ప్లాను ఏ అవాంతరం లేకుండా అమలు జరపడం పెద్ద సమస్య కాదనుకుంది ముందు. తీరా వచ్చి చూశాక అది అసాధ్యమన్న అభిప్రాయం బలపడింది. శాస్త్రి చెప్పినా అతనిపై అధికారులు సిపాయిల్ని ఇంటి నుండి విరమింపజేసేందుకు ఒప్పుకొంటారో, లేదో?

అంతమంది కళ్ళుగప్పి శాస్త్రి మెదడును ట్రాన్స్ ప్లాంట్ చెయ్యడం వీలుకాదు. భారం భగవంతుడిపైన వేసి పడుకొంది.

అర్ధరాత్రి కావస్తూండగా నిద్రపట్టిందామెకు. ఆ నిద్రలోకూడా చెవులు పనిచేస్తున్నాయి. ఎవరో గదిలో పిల్లిలా మెల్లగా అడుగులువేస్తూ కదులుతున్న శబ్దమయింది. ఠక్కున లేచి వెళ్ళి లైట్ వెలిగించింది. హాలుమధ్య శాస్త్రి కనుపించాడు.

"మీరా?" అడిగింది.

"నేనే మంచినీళ్ళు తెచ్చాను" అన్నాడు గాజుకూజా చూపిస్తూ.

"తలుపులు వేశాను, లోనికెలా రాగలిగారు?"

"నా రూంకూ, దీనికి మధ్య అదిగో తలుపు వుంది" అంటూ బోల్టా తెరచి వున్న డోర్ చూపించాడు, హుషారుగా.

"బాగుంది" అంది సుసనా.

"లైట్లార్పెక్కో. వెళ్తున్నాను" అంటూ వెళ్ళిపోయాడు శా

# 6

పదింటికల్లా శాస్త్రి వెలుపలికి వెళ్ళిపోయాడు. ఆ తర్వాత అరగంటకు సుసనా బయులుదేరింది. ఆ కాలనీ వెలుపలిదాకా కాలినడకన వెళ్ళింది. ఆ తర్వాత టాక్సీ ఎక్కి కన్నాట్ సర్కస్ పోనిమ్మని చెప్పింది.

ఇండియా కాఫీ హౌస్ ప్రక్కగా ఆపించింది టాక్సీ. దిగి లోనికెళ్ళి, స్పెషల్ కాఫీ టోకన్ కొనుక్కుంది. సర్వింగ్ వేపు వెళ్ళి దగ్గరున్న కూపన్ ఇచ్చి, కాఫీ కప్పు తీసుకొంది. ఖాళీగా వున్న టేబుల్ను వెతుక్కుంటూ వెళ్ళింది.

కూర్చుని కాఫీ సిప్ చేస్తూండగా కృష్ణసేవక్, తెల్లటి పాంటు, షర్టుతో వున్న మరొక మనిషిని వెంట బెట్టుకొని వచ్చి కూర్చున్నాడు.

ఆ ఇద్దరి దగ్గరా కాఫీ కప్పు లున్నాయి.

"ఏమిటి విశేషాలు?" అడిగాడు.

తను చూసిందంతా వివరంగా చెప్పి "అసలు బంగళాలో లాభం లేదు. మరేదైనా ప్రదేశం చూడండి. తీసుకొచ్చేందుకు ప్రయత్నిస్తాను" అంది సుసనా.

"అంత టైట్ సెక్యూరిటీ వుంటుందనుకోలేదు. ఆ ప్రయత్నం మానుకుందాం. వేరే ఏర్పాట్లు చేస్తాను. కానీ

వారం రోజులు టైం కావాలి. మళ్ళా సోమవారంనాడు ఇదే టయిమ్‌కు ఇక్కడకు రా. ప్లాను చెపుతాను" అన్నాడు కృష్ణ సేవక్.

"ఓ. కే." అంటూ ఖాళీ కప్పు ప్రక్కకు నెట్టి లేచింది సుసనా. మిగిలిన ఇద్దరూ అక్కడే కూర్చున్నారు.

సుసనా జనం మధ్యనుండి తప్పుకుని వెలుపలికొచ్చింది. రోడ్ దాటి పార్కువైపు నడుస్తుండగా, వెనుకనుండి వచ్చిన మంజుల గమనించింది. మద్రాసులోనే మధ్యలో మాయమయిపోయిన సుసనా కనుపించగానే, హుషారుగా తనూ పార్కులో జొరపడింది.

పార్కు దాటింది సుసనా.

ఆమె వెంట మంజుల కూడా దాటింది.

ఖాళీగా వెళ్తున్న టాక్సీ ఎక్కింది సుసనా.

వెనకాలే వస్తున్న ఆటో ఆపి ఎక్కింది మంజుల.

రెండూ ఒకదాని వెంట ఒకటి రోడ్లను చీల్చుకుంటూ వెళ్ళసాగాయి.

డిఫెన్సు కాలనీలోకి టాక్సీ వెళ్ళిపోగానే, ఆటోను, తనకు అవసరమైన అడ్రసు చెప్పి పోనిమ్మంది.

ఆర్మీ హెడ్ క్వార్టర్సు ముందు దిగి, ఆటోకు డబ్బిచ్చి పంపేసింది. ఇంటలిజెన్సు డిపార్టుమెంటు వేపు కారిడార్‌లో నడుస్తుండగా, ప్రొఫెసర్ శాస్త్రి, ఎదురుగా రావడం చూచి ఆశ్చర్యపోయింది.

మేజర్ మోహన్ గది తలుపులు తెరచుకొని వెళ్ళింది.

"ఆమెను చూశాను" అంది కూర్చుంటూ.

"సుసనా నేనా? ఆమె నిన్ననే వచ్చింది. ప్రొఫెసర్ గారింట్లోనే మకాం వేసింది" అన్నాడు మోహన్ తనూ కూర్చుంటూ.

"అలాగా! శాస్త్రిగారు ఇక్కడ కనుపించారా?"

"నా దగ్గర కొచ్చాడు. గంట సేపట్నుంచి ఇక్కడే వున్నాడు."

"ఎందుకు?"

"ఇంకెందుకు తన ఇంటి చుట్టూ సిపాయిలు తిరగడం బాగులేదనీ, వెంటనే విరమించమని చెప్పాడు" అన్నాడు మోహన్.

"మీరేమన్నారు?"

"ఏమన్నా వినిపించుకునే స్థితిలో లేడా ప్రొఫెసర్. ఆయనకు ఎవ్వరివల్లా ఆపదరాకుండా వుండాలనే నేను ఇన్ని ఏర్పాట్లు చేశానని చెప్పాను. ఆ సుసనా మత్తులో పడి కొట్టుకుంటున్నందువల్లనే చెప్పేది తలకెక్క లేదు. తిక్క తిక్కగా మాట్లాడాడు" అన్నాడు మోహన్.

"చివరకేమయింది?"

"ఈ సాయంత్రంలోగా సిపాయిల్ని విరమించకుంటే, తను ఉద్యోగానికి రాజీనామా గీకిపారేసి, ఇష్టమొచ్చిన దేశం వెళ్ళిపోతానని వార్నింగ్ ఇచ్చి వెళ్ళాడు."

"అరే! అయితే ఏం చేయదలచుకున్నావ్?"

"నాపై అధికారులకు చెప్పాను. వాళ్ళు రక్షణ మంత్రితో మాట్లాడి ఏం చెయ్యవలసిందీ చేస్తామన్నారు."

"ఆడగాలి మహత్తు అగ్రమయిందా?"

"అఁ! అఁ! పూర్వం రాజ్యాలు పోగొట్టుకొన్న వాళ్ళూ, ప్రాణాలు తీసుకున్న వాళ్ళూ వున్నారంటే వాళ్ళ చరిత్ర చదివి నవ్వుకొన్నాను. శాస్త్రిగార్ని చూశాక, వాళ్ళే నయమనిపిస్తున్నారు" అన్నాడు మోహన్.

ఫోన్ మ్రోగింది.

మోహన్ రిసీవరు అందుకొని, అవతలి వేపునుండి విన

వస్తున్న మాటల్ని వింటూ, మధ్య మధ్య, యస్, యస్ అంటూ వుండిపోయాడు చాలాసేపు. ఆ తర్వాత ఫోన్ క్రేడిల్ చేసి "పైనుంచి ఉత్తర్వులొచ్చాయి" అన్నాడు.

"ఏమని?"

"తెగిందాకా దారం లాగడం మంచిదికాదన్నారు. వెంటనే సిపాయిల్ని విరమించమన్నారు. ఆయన రక్షణ మన ఇద్దరి నెత్తిన వేశారు" అన్నాడు మోహన్.

"మనం మాత్రం ఏంచేస్తాం?" అడిగింది మంజుల నిరుత్సాహంగా.

"ఆయనకు అనుమానం రాకుండా, వెంటాడుతూ, ఏ విధమైన అపాయం రాకుండా చూడమంటున్నారు" అన్నాడు మోహన్.

"బాగుంది. చెప్పేవాళ్ళకు చేసేవాళ్ళు లోకువన్నట్టుంది."

"మనం పనిచేసేది ఆర్మీలో. ఆజ్ఞలు తలవొంచుకొని స్వీకరించి, అమలు జరుపడం తప్ప, వాటి యుక్తాయుక్త వివేచనాలు చేయగూడదు" అంటూ లేచాడు మోహన్.

"ఎక్కడికి?"

"శాస్త్రిగారింటికి వెళ్ళి, ఆయన్ను కలుసుకొని ప్రభుత్వం నిర్ణయం తెలియజెప్పి అక్కడి మనుషుల్ని పంపేసి వస్తాను" అన్నాడు.

"నేను గూడా వస్తాను."

"వద్దు. నువ్విక్కడే వెయిట్ చేస్తూ వుండు. నేను గంటలో వస్తాను. వచ్చాక మనం ఏంచెయ్యాలో కూర్చుని ఆలోచిద్దాం!" అన్నాడు మోహన్.

"అలాగే!" అంటూ కూలబడింది మంజుల.

మోహన్ కారెక్కి శాస్త్రిగారింటివేపు రివ్వుమని

పోనిచ్చాడు. పది నిముషాలకు తక్కువ వ్యవధిలోనే జేరుకున్నాడు.

హాల్లోనే ఎదురయిన శాస్త్రిగార్కి శుభవార్త చెప్పాడు.

"థాంక్ యూ మేజర్! నా క్షేమం గురించి బెంగపడకండి. నన్ను నేను రక్షించుకోగలను. నా రహస్యాలు నాలోనే వున్నంతవరకూ ఎవ్వరూ నన్ను చంపరు. అలోగా మీరు రానే వస్తారు రక్షించేందుకు" అన్నాడు శాస్త్రి.

"అలాంటి దేమీ జరగదు లెండి. ఏదో మా విధికాబట్టి కాపలా వుంచాం" అన్నాడు మోహన్.

మళ్ళా థాంక్స్ చెప్పాడు. మోహన్ శెలవు తీసుకుని వెలుపలికొచ్చి ఒక్క సెక్యూరిటీ ఆఫీసర్ను మాత్రం వుండమన్నాడు. మిగిలిన జవాను లందర్నీ వెళ్ళిపొమ్మని ఉత్తరువు ఇచ్చాడు. అంతా మూటా ముల్లె సర్దుకున్నారు.

# 7

బంగళాలోని కాపలా జనం నిష్క్రమించాక సుసనాకు హుషారు ఎక్కువైంది. మత్తు చూపుల్తో, మైకం కమ్మిన మాటల్తో, అంగ ప్రదర్శనంతో ప్రొఫెసర్ శాస్త్రికి పిచ్చెక్కించింది.

శాస్త్రిలో ఉద్రేకం ఎక్కువయింది. తట్టుకోలేక పోయాడు. కోరిక వెల్లడించలేక, మనసులో దాచుకోలేక కొట్టు మిట్టాడాడు.

ఆయన వాలకం కనిపెట్టి సుసనా తనే చొరవ తీసుకుని ముందంజ వేసింది. ఆరాత్రి మొదలూ, తుదీ వాళ్ళకు తెలీదు. ఆనంద సామ్రాజ్యంలో తేలియాడారు.

నాలుగు రోజులు శాస్త్రీ, సుసనా వెలుపలకే రాలేదు. వేళకు తిండి తినడం, ప్రణయ కలాపాలాడడం తప్ప

మరో వ్యాసకం లేకుండా గడిపారు.

"నేను జీవితంలో అనుభవించింది, ఆనందించింది నీతోనే. ఇంత సుఖం నీవు అందించగలవని, అసలు ప్రణయంలో మజావుందని గానీ నాకు నిన్ను చూచిందాకా తెలీనేలేదు!" అన్నాడు శాస్త్రి.

"నేను అంతే! కాకుంటే మా దేశంలో సెక్సు విషయాలు ఎక్కువ చదువుతాం. మిమ్మల్ని చూసింది మొదలు మీతో గడపాలన్న కోరిక కలిగింది. చివరి కలాగయితే కోరిక కల్గింది. మన ఈ కలయిక కలకాలం జ్ఞప్తి వుంచుకుంటాను" అంది సుసనా.

"నాన్సెన్స్! మన బంధం శాశ్వతం కావాలి. నిన్ను నేను పెళ్ళాడుతాను" అన్నాడు శాస్త్రి.

"నా దీదేశం కాదు!"

"కాకుంటే పెళ్ళాడకూడదా?"

"మావాళ్ళను వదలి ఇక్కడ వుండేదెలా?"

"నేనే మీ దేశం వస్తాను."

"మిమ్మల్ని ప్రభుత్వం రానిస్తుందా?"

"ఇది నా వ్యక్తిగత విషయం. వాళ్ళ పర్మిషను నాకు అవసరం లేదు!"

"మీరు నన్ను పెళ్ళాడి రాగలిగితే అంతకన్నా కోరుకొనేదిలేదు. మీకా లోటు లేకుండా చూచే పూచీనాది" అంది సుసనా.

"థాంక్స్! నేను అన్ని వివరాలు కనుక్కుంటాను ఇవాళే!" అంటూ లేచాడు శాస్త్రి.

బట్టలు మార్చుకుని వెళ్ళిపోయాడు శాస్త్రి.

ఆయన వెనుకే సుసనా కూడా వెళ్ళిపోయింది.

సుసనాను అనుసరించి బాగ్లో పోసాగాడు మేజర్

మోహన్. ఆ నాలుగు రోజులు మారువేషంలో శాస్త్రి బంగళా ప్రాంతాల్లో తిరిగాడు. ఎవ్వరూ వెలుపలకి రాలేదు. లోపల ఏంజరుగుతూ వుంటుందో ఊహించాడు మోహన్.

సుసనా ఇండియా కాఫీ హౌస్ వద్ద దిగి లోనికి వెళ్ళింది. మేజర్ మోహన్ కూడా ఆమెను అనుసరించి లోనికి వెళ్ళాడు.

కృష్ణ సేవక్, అతని వెంట మరో వ్యక్తి వున్నారు. వాళ్ళిద్దరూ సుసనాను చూడగానే వడివడిగా ఎదురు వచ్చారు.

ముగ్గురూ కాఫీలు త్రాగి వెలుపలికొచ్చి కారెక్కారు. కారు కుడిచేతి రోడ్ వైపు సాగిపోయింది. దాన్ని అనుసరిస్తూ మేజర్ మోహన్ కారుకూడా వెళ్ళింది.

"ఏమిటి విశేషాలు?" అడిగాడు కృష్ణ సేవక్.

"అతన్ని లోబరుచుకొన్నాను. నేను ఆడించనట్లా ఆడుతున్నాడు శాస్త్రి. నన్ను పెళ్ళాడి నాతో మనదేశం వస్తానంటున్నాడు."

"అది జరిగేదికాదు. అతను అలాంటి అభిప్రాయంలో వున్నాడని తెలిస్తే ప్రభుత్వం అరెస్టుచేసి జైల్లో తోస్తుంది. ఏ పరిస్థితుల్లోనూ అతన్ని వదలుకోరు." అన్నాడు కృష్ణ సేవక్ వెంటవున్న వ్యక్తి.

"ఆ విషయం నాకు తెలుసు."

"ఆ గొడవ వదిలేద్దాం! మేము మరో ప్లానును తయారుచేశాం" అన్నాడు కృష్ణ సేవక్.

"ఏమిటది చెప్పండి." అడిగింది సుసనా.

"బ్రెయిన్ ట్రాన్స్ప్లాంటేషన్ చేసేందుకు అవసర మైన సామగ్రి అంతా చేర్చి వుంచాం. అంతా రెండు

గంటల్లో జరిగిపోతుంది. ఆ డాక్టర్ కూడా వచ్చివున్నాడు. ఢిల్లీకి దూరంగా ఉన్న ఒక పాడుబడ్డ పాత బంగళా ఎన్నుకున్నాం మన పనికి. శాస్త్రి బ్రెయిన్ నాకూ, నా బ్రెయిన్ శాస్త్రికీ మారిపోతాయి. ఆరాత్రికే నేను విమానంలో వెళ్ళిపోతాను. మీరు మెల్లగా ఇక్కడనుండి జారుకోండి.'' అన్నాడు కృష్ణసేవక్.

''తర్వాత!''

''ఈలోగా నువ్వు అతని లాబ్‌లో దాచుకున్న ఫైల్సు తస్కరించాలి. వాట్ని నీ వెంట తీసుకురావాలి. అవిలేందే పనిజరగదు.'' అన్నాడు కృష్ణసేవక్.

''నీకు బ్రెయిన్ మారాక శాస్త్రిలాగే ప్రవర్తిస్తావనుకుంటాను. నీకై నువ్వు ఈ దేశం వదలిపోను ఇష్టపడకపోవచ్చు. లేదా నీవే శాస్త్రి నంటూ గోలచెయ్యవచ్చు. అది అందరికీ తెలిస్తే మన ప్లాను చెడుతుంది. అవునా?''

''నువ్వు చెప్పింది కూడా నిజమే. అందుకే అపరేషన్ అయ్యాక నాకు స్పృహ రాకుండా వుంచుతారు. నన్ను సిక్ పేషంటుగా మన ఎంబెసీ వాళ్లు గుర్తించి, మనిషిని తోడిచ్చి విమానంలో పంపుతారు. నాకు మనదేశం చేరాకే స్పృహ వస్తుంది'' అన్నాడు కృష్ణసేవక్.

''మరి శాస్త్రి!''

''అతన్ని అక్కడే రెండు దినాలుంచాలి. ఆ తర్వాత వదిలెయ్యాలి.''

''దానికన్నా అతన్ని చంపితే మంచిదనుకుంటాను'' అంది సుసనా.

''వద్దు! అతని మానాన అతన్ని వదిలేద్దాం. బ్రెయిన్‌ను పాడుచేసి పెడదాం. పిచ్చివాణ్ణి చేస్తే తిరిగి తిరిగి ఛస్తాడు.'' అన్నాడు కృష్ణసేవక్.

కారు ఇంకా పోతూనే వుంది.

వెనుక వస్తున్న మోహన్ కారుకూడా అనుసరిస్తూనే వుంది.

కుతుబ్ మినార్ ముందు ఆగింది.

"మన వెనుక వస్తున్న కార్ను చూశావా?" అడిగింది సుసనా.

"ఆఁ!" అన్నాడు కృష్ణసేవక్.

"అందులో వస్తున్నది మేజర్ మోహన్. ఆర్మీ ఇంటలిజెన్స్ శాఖ మనిషి. బహుశా నన్ను వెంబడించి వచ్చి వుంటాడు." అంది సుసనా.

"ఫరవాలేదు. మనం కాసేపు చుట్టూ తిరిగి వెళ్ళిపోదాం."

"మరి నాకా బంగళా ఎప్పుడు చూపిస్తావ్."

"ఇప్పుడొద్దు. నీకు దాని గుర్తులు చెప్తాను. ఎలా రావలసిందీ ప్లాను వేసి చెపుతాను." అన్నాడు కృష్ణసేవక్.

"ఓ. కే." అంది సుసనా.

ముగ్గురూ కుతుబ్ మినార్ పైకెక్కారు. అక్కడ్నుంచి చుట్టూ కనుపించిన అందమైన దృశ్యాల్ని చూచి ఆనందించారు. అరగంటసేపు పిచ్చాపాటీ మాట్లాడుకుని దిగి క్రింది కొచ్చారు.

సిగరెట్ త్రాగుతూ కారు నానుకుని నిలుచున్న మేజర్ మోహన్‌ను చూశారు. అతని ఉనికి గమనించనట్లుగానే వెళ్ళి కారెక్కారు. కారు బయలుదేరింది. మళ్ళీ మోహన్ కారు వాళ్ళను అనుసరించింది.

ఇండియా కాఫీ హౌస్ దగ్గర మళ్ళా విడిపోయారు. సుసనా ఒంటరిగా వెళ్ళిపోయింది. మోహన్ ఆమెను వదలి వాళ్ళ వెంటబడ్డాడు.

# 8

ఇంటలిజెన్స్ శాఖ డైరక్టరు ఓబ్రాయ్ పైపు కాలుస్తూ కూర్చున్నాడు. అతనికెదురుగా మేజర్ మోహన్ కూర్చున్నాడు. అతని ప్రక్కన మంజులుంది.

"సార్! శాస్త్రిగారు మీతో తన్తో ఫారిన్ నేషనల్ను పెళ్ళాడదలచుకొన్నాననీ, ఆమెతో వెళ్ళిపోయేందుకు అనుమతించాలనీ, ఉద్యోగానికి రాజీనామా ఇస్తానని చెప్పాడు. అతని ఇంట్లో సుసనా అనే అమ్మాయి వుంది. ఆమె శాస్త్రితోటే హేగ్ నుంచి ఇండియాకు వచ్చింది. ఆమె దేశం మనుషులు గత వారం దినాల్లో దాదాపు ముప్ఫయిమందిదాకా ఇక్కడికి వచ్చారు. వీళ్లు తరచూ కలుసుకుంటూ, కార్లలో ప్రయాణం చేస్తూనే చర్చలు చేసుకుంటూ తిరుగుతున్నారు. శాస్త్రి వాళ్ళ మైకంలో పడి మన సెక్యూరిటీ పద్ధతుల్ని పీకి పారేశాడు. ఆయన పెద్ద ప్రమాదంలో వున్నట్లు నాకు అనుమానంగా వుంది" అన్నాడు మోహన్.

"ఎలాంటి ప్రమాదం?"

"వాళ్ళకు కావలసింది ఆయన రిసెర్చి చేసి కనుక్కున్న ఆటమిక్ సైన్స్ రహస్యాలు ఆయన్ను బెదరించి తెలుసుకో వచ్చు. లేదా ఆయన్ని అపహరించవచ్చు. కానీ ఈ రెండూ సాధ్యపడేవి కావు."

"ఎందుకని?"

"బెదరిస్తే రహస్యాలు చెప్పకపోవచ్చు. అందువల్ల వాళ్ళ ప్రయత్నం పదిమందికీ తెలియడం తప్ప వేరే ప్రయోజనం వుండదు. అపహరించడం అవివేకమైన చర్య. అతన్ని ఎలా మనం కాపలా కాస్తున్నదీ ఈపాటికే ఊహించే వుంటారు. మంజులను గుర్తు పట్టారు. నన్నూ

గుర్తుపట్టి వుంటారు. కాబట్టి వేరే పథకం వేసుకొని వుండాలనిపిస్తుంది బాస్!'' అన్నాడు.

పైపు విదిలిస్తూ "ఆ పథకం ఏమిటని ఊహిస్తున్నావ్?'' అడిగాడు ఓబ్రాయి. అతనికి మేజర్ మోహన్ శక్తి సామర్థ్యాలపైన అకుంఠిత విశ్వాసం వుంది.

"ప్రపంచ ప్రఖ్యాతి పొందిన బ్రెయిన్ ట్రాన్స్‌ప్లాంటేషన్ ఎక్స్‌పర్టు డాక్టర్ కోబాల్ట్ నిన్న సాయంత్రం హేగ్ నగరాన్నుండి ఇండియాకు వచ్చాడు. ఆయన రాకకు కారణం కేవలం చూచివెళ్ళడం. ఎయిర్‌పోర్టులో సుసనా మురావాళ్ళ మనిషి ఒకతను కలుసుకోనటం మంజుల చూసింది. ప్రస్తుతం మద్రాసు వెళ్ళాడు. ఎల్లుండి సాయంత్రం ఢిల్లీ యూనివర్సిటీలో ఆయన లెక్చరుంది. ఆ మరుసటి దినం వెళ్ళిపోతాడు'' చెప్పాడు.

"దానికీ దీనికీ సంబంధం వుందా?''

"కలిపి ఆలోచిస్తుంటే అనుమానం కలుగుతూంది. అతని సాయంతో శాస్త్రి బ్రెయిన్‌ను దొంగిలించుకొని పోదామనుకుంటున్నట్లు వుంది.''

ఓబ్రాయ్ సీట్లో ఎగిరిపడ్డాడు.

"ఇంపాజిబుల్!'' అన్నాడు.

"ప్రపంచంలో ప్రతి క్షణం ఆధిక్యతకోసం పోరాడే ప్రభుత్వాల పద్ధతులు వింతగా వుంటాయి. ఏదీ అసాధ్యం కాదు. నేను తెలుసుకొన్నదాన్ని బట్టి, బ్రెయిన్‌లు మార్చే ఆపరేషను చేసేందుకు ఆయనకు రెండు గంటలు చాలట. శాస్త్రిగార్ని రెండు గంటలు కాదు అంతకన్నా ఎక్కువ కాలం ఇష్టమొచ్చినచోటుకి తీసుకెళ్ళగల శక్తి సుసనాకు వుంది. ఆమె వల్లో పడిపోయాడు ఆయన'' అన్నాడు మోహన్.

"అయితే మనం ఏం చెయ్యాలి."

"శాస్త్రిగార్ని కాపాడాలి?"

"ఎలా చేద్దాం? ఆయన్ను అరెస్టు చేద్దాము?"

"అది తాత్కాలికంగా వాళ్ళను ప్రయత్న విముఖుల్ని చేస్తుంది. మరోమారు మళ్ళీ ఇంకా పకడ్బందీగా ప్రయత్నం చేస్తారు. వాళ్ళ ఆట కట్టించాలి. వాళ్ళ చేతులు వాళ్ళ కన్నే పొడవాలి!" అన్నాడు మోహన్ సీరియస్‌గా.

"నీ మీద నాకు నమ్మకం వుంది. నువ్వేం చేద్దామన్నా సరే. అవసరమయిన అన్ని అధికారాలు ఇస్తాను. ఏర్పాట్లు చేస్తాను. శాస్త్రిని మనం కాపాడాలి. కాదు శాస్త్రి బ్రెయిన్‌ను కాపాడాలి!" అన్నాడు ఓబ్రాయ్.

"ఈ విషయం పైవాళ్ళకు కూడా తెలుపడం మంచిది. నేను పథకం ఆలోచిస్తాను. ఈలోగా వాళ్ళు ఆపరేషను కండక్టు చేసేందుకు ఏర్పాట్లు ఎక్కడ చేసుకుందీ తెలుసు కుంటాను" అన్నాడు మోహన్ లేస్తూ.

"అలాగే! నేను ఇప్పుడే వెళ్ళి విషయాలు వివరించి చెపుతాను మంత్రిగారికి" అంటూ లేచాడు ఓబ్రాయ్.

మోహన్, మంజుల వెలుపలికొచ్చారు. కారెక్కారు. కారు తిన్నగా మెడికల్ వింగ్ వేపు వెళ్ళింది. కారాపి దిగి లోనికి వెళ్ళారు.

అరగంటసేపు సర్జన్ జనరల్ అరోరాతో మాట్లాడాడు మోహన్. శాస్త్రిగారి ఫోటో చూపించాడు.

"అదంత కష్టమైన పని కాదు. ఆయన ఎత్తూ, లావు వున్న మనిషిని తీసుకు రండి. ప్లాస్టిక్ సర్జరీతో అతన్ని ఫోటోలో వున్న శాస్త్రిలా తయారు చెయ్యగలను. కానీ ఒక్కరోజు టైం కావాలి" అన్నాడు అరోరా.

"మీకు రేపుదయం మనిషిని అప్పగిస్తాను. రేపు రాత్రికి

అతన్ని నాకు తిరిగి అప్పగించండి” అన్నాడు మోహన్.

“అలాగే!” అన్నాడు అరోరా.

అక్కడ్నుంచి వెలుపలికొచ్చాడు.

“మంజులా! నువ్వు మారువేషంలో వెళ్ళాలి. ఆ కృష్ణ సేవక్‌ను వెంటాడు. ఆపరేషన్‌కు అవసరమైన సామగ్రి కొంటారు. దాన్ని వాళ్లు తాము ఏర్పాటు చేసుకున్న ప్రదేశానికి చేర్చే ప్రయత్నం చేస్తారు. నువ్వు ఎలాగైనా ఆ ప్రదేశాన్ని కనుక్కోవాలి. అది చాలా ఇంపార్టెంటు” అన్నాడు మోహన్.

“అలాగే బాస్!” అంది మంజుల.

“నాకు వేరే పనులున్నాయి. అవన్నీ చూస్తాను.” అన్నాడు మోహన్.

ఇద్దరూ అక్కడే విడిపోయారు.

# 9

రాత్రి పన్నెండయింది.

ఆటవిడుపులో హాయిగా గుర్రుపెట్టి నిద్ర పోతున్నాడు శాస్త్రి. ప్రక్కనే పడుకున్న సుసనా మెల్లిగా లేచి కూర్చుంది. శాస్త్రిని చేత్తో కదలించి చూసింది. అతనికి మెలకువ రాలేదు. తను పాలల్లో కలిపి ఇచ్చిన మత్తుమందు పనిచేసినందుకు సంతోషంగా నవ్వుకుంటూ లేచింది.

మెల్లగా మెట్లు దిగి క్రిందకు వచ్చింది.

సెక్యూరిటీ జనాల్లు ఎవ్వరూ రాత్రిళ్లు బంగాళాలోపల వుండడం లేదు. నేల మాళిగలో వున్న లాబొరేటరీకి పోయే తలుపు తెరుచుకొని మెట్లు దిగి క్రిందికి దిగింది. లైటు వెలిగించింది. చాలా విశాలంగా వుంది. రకరకాల మెషిన్లు, సీసాలు కనుపించాయి.

పైనుంచి తెచ్చిన తాళాల సాయంతో బీరువాలన్నీ

తెరచి వెతికింది. తనకు కావలసిన ఫైలు కనుపించలేదు. మళ్ళీ నిదానంగా వెతికింది. ఎనిమిది మిల్లీమీటర్ల ఫిలిం కాన్ కనుపించింది. దాని పైనున్న లేబిల్ కేసి చూసింది. దానిమీద రాసివున్న వివరాల్ని చదివి ఆనందంతో గెంతు లేసింది.

శాస్త్రిగారి పరిశోధనా ఫలితంగా కనిపెట్టిన ఫార్ములాలు ఫిలిం తీసివుంచారు. పైమూత తెరచి, ఫిలింలో చూసింది. పాజిటివ్ ఫిలిమ్ అది. దాని నెగటివ్ మరేదో లాబ్‌లో దాచివుంటారనుకుంది. అయినా నెగటివ్‌తో తనకు పనిలేదు. బీరువాలన్నీ యథాప్రకారం మూసేసి తాళాలువేసి, పైకొచ్చింది.

శాస్త్రి గుర్రుపెట్టి నిద్రపోతునే వున్నాడు.

ఫిలిమ్ కాన్ తీసుకొని వెలుపలకొచ్చింది. బంగాళా వెనుకవేపుకు వెళ్ళి కొబ్బరిచెట్టు మొదట్లో నేలను త్రవ్వింది చేతులతోనే. అందులో దాన్ని పెట్టి పైన మట్టి కప్పింది. గబగబ బంగాళాలోకి వచ్చింది.

చేతులు వాష్‌బేసిన్‌లో కడుక్కుంది.

వచ్చి యథాప్రకారం పడుకుంది.

తెల్లవారింది.

శాస్త్రి కాఫీ త్రాగుతూండగా ఫోన్ మ్రోగింది. రిసీవరు పైకెత్తి మాట్లాడి వచ్చి కూర్చున్నాడు.

"ఎవరండీ ప్రొద్దున్నే!" అడిగింది సుసనా.

"రక్షణ మంత్రిగారితో చిన్న సమావేశం వుందట. పదిగంటలకల్లా రమ్మని ఆయన పి. ఏ. ఫోన్ చేశాడు" అన్నాడు శాస్త్రి.

"మళ్ళీ రావడం ఎప్పుడు?"

"గంటలో వచ్చేస్తాను."

"ఇవాళ సాయంత్రం వేరే ప్రోగ్రాం పెట్టుకోకండి. మా దేశంనుండి వచ్చిన ఫ్రెండ్స్ కొందరు చిన్న పార్టీ చేసుకుంటున్నారు. నన్ను రమ్మన్నారు. మీరు వెంట లేకుండా రావడం కుదరదన్నాను. మిమ్మల్నికూడా పిలుచుకు రమ్మన్నారు" అంది సుసనా.

"స్వీట్ గరల్!" అంటూ బుగ్గ గిల్లాడు.

సుసనా సిగ్గు వొలకబోసింది.

ఆ తర్వాత శాస్త్రి డ్రెస్ చేసుకొని వెళ్ళిపోయాడు.

సుసనాకు ఆనందంగా వుంది. తన దేశం తనకు అప్పగించిన కార్యాన్ని నిర్విఘ్నంగా నిర్వహించ గలుగుతున్నందుకు గర్వం కలిగింది. ఆ సాయంత్రం శాస్త్రిని తీసుకెళ్లి అప్పగిస్తే తన పని పూర్తవుతుంది.

శాస్త్రి పన్నెండు గంటలకల్లా వచ్చాడు.

రాగానే పైకి రాకుండా క్రిందే కూర్చున్నాడు. సుసనా గమనించి క్రిందికొచ్చి "ఏమయింది?" అడిగింది.

"ఏంది?" అన్నాడు.

"అదే మీరు వెళ్ళిన కాన్ఫరెన్సు."

"అదా! అయిపోయింది" అన్నాడు శాస్త్రి. అతని గొంతు కాస్త జీరగా పలికింది. అది గమనించింది సుసనా.

"ఏమిటి గొంతు అలాగుంది?"

"అక్కడ ఐస్‌క్రీమ్ తిన్నాను. జలుబు చేసింది వెంటనే" అన్నాడు శాస్త్రి.

"సాయంత్రం వేరే ప్రోగ్రాం ఏమీ పెట్టుకోలేదు గదా?"

"లేదు!"

తల నొప్పిగా వుందంటూ లేచివెళ్ళి పడుకున్నాడు.

సుసనా తన పనుల్లో మునిగిపోయింది. తన ఉనికిని

తెలిపే వస్తువుల్ని మొత్తం తీసేసి సూట్ కేసుల్లో సర్దింది. బయలుదేరి వెళ్లబోయే ముందు వాటిని పెరట్లో వున్న బావిలో పారెయ్యాలని తీర్మానించుకొంది.

శాస్త్రి మూడింటికి లేచాడు. బాత్ రూంకు వెళ్లాడు. ముహం కడుక్కున్నాడు.

పాంటుకున్న వాచ్ పాకెట్ తడుముకున్నాడు. చిన్న టెలి ట్రాన్స్మిటర్ గట్టిగా తగిలింది. దాని సాయంతో తనకూ, మేజర్ మోహన్ కూ మధ్య లింకు ఏర్పడి వుంది. తనెక్కడుందీ, ఏం చేస్తుందీ ప్రతి క్షణం తెలుస్తూనే వుంటాయి.

# 10

ఆరు గంటలయింది.

శాస్త్రీ, సుసనా తయారయినారు.

క్రిందికి దిగి కారెక్కారు.

కారు ఎటు పోవాల్సిందీ చెప్పసాగింది సుసనా. శాస్త్రి డ్రైవ్ చేస్తున్నాడు. ఢిల్లీ నగరం దాటింది. ఫరీదాబాదు నుండి చీలి రోడ్ను అంటిపెట్టుకుని పోసాగింది. దానికి నాలుగు ఫర్లాంగుల దూరంలో మేజర్ మోహన్ పెద్ద కార్లో అనుసరించి పోసాగాడు; అతనితో పాటు ఆరుగురున్నారు. అందరిదగ్గరా ఆయుధాలున్నాయి.

పాడుబడ్డ పాత బంగళాముందు దాగింది శాస్త్రి కారు. అక్కడ అంతకుముందే రెండుమూడు కార్లు పార్క్ చేసివున్నాయి.

"పార్టీ ఇంతదూరంలో పెట్టుకొన్నారేం?" అడిగాడు శాస్త్రి.

"కాస్త ప్రశాంతంగా వుంటుందని..." అంటూ లోనికి నడచింది.

లోపల మొత్తం పదిమంది వున్నారు.

శాస్త్రి అడుగుపెట్టగానే నలుగురు అతనిపైన బడి పెడరెక్కలు విరిచి పట్టుకొన్నారు.

"ఏమిటిది?" అడిగాడు కోపంగా.

"ఏమీలేదు. నీ మెదడు చాల గొప్పదని తెలిసింది. దాంతో మాకు అవసరం వుంది. దాన్ని తీసుకెళ్ళేందుకు వచ్చాం." అన్నాడు కృష్ణసేవక్.

"సుసనా?" అరచాడు శాస్త్రి.

"ఇందుకోసమే నేను నీకు నా శరీరం అప్పగించింది." అంది సుసనా తాపీగా.

"రాక్షసీ! నన్ను ప్రేమించావనుకున్నాను."

"నా దేశాన్ని తప్ప మరి దేన్నీ ప్రేమించడం నేను ఇంకా నేర్చుకోలేదు."

"ఇది అన్యాయం."

"మాకు న్యాయంగానే తోస్తూంది" అంటూ మిగిలిన వాళ్ళవైపు తిరిగి "కానివ్వండి ఆపరేషను థియేటరుకు చేర్చండతన్ని!" అరచాడు కృష్ణసేవక్.

మేజర్ మోహన్ గుమ్మంలో ప్రత్యక్షమైనాడు. పకపక నవ్వాడు.

"నువ్వా?" ఆశ్చర్యంగా అడిగాడు.

"నేనే! ఏం విచిత్రంగా వుందా? తెలివి మీ సొత్తు మాత్రమే కాదు" అన్నాడు చేతిలోవున్న మెషిన్‌గన్ పైకెత్తి.

"మా పనికి నువ్వు అడ్డం రాలేవు. నిన్నుకూడా చంపేస్తాం."

"చంపండి. కానీ నన్ను చంపబోయే ముందు ఒక విషయం మాత్రం చెప్పనివ్వండి. అది తెలుసుకోవడం

మీ కే మంచిది.''

''ఏమిటా విషయం?'' అడిగింది సుసనా.

''అతని మెదడులో మట్టి తప్ప మరేం లేదు. మా ఆఫీసులో తుపాకీలు తుడిచే మామూలు సిపాయి అతను. మీరు అనుకొనే ప్రొఫెసర్ శాస్త్రి కాదు. శాస్త్రిగార్ని పదిగంటలకే మేము ఆర్మీ హెడ్ క్వార్టర్సులో దాచి వేశాం'' అన్నాడు.

అందరూ అవాక్కయి నిలుచున్నారు.

''అతని మాటలు నమ్మవద్దు. మనల్ని బోల్తా కొట్టించేందుకు అబద్ధం చెపుతున్నాడు. ఇతనితో పదిరాత్రులు గడిపాను నేను. అతనే శాస్త్రి. పని కానివ్వండి'' అంది సుసనా.

''అన్ని రాత్రులు గడిపినా అతన్ని ఎలా గుర్తు పట్టలేకపోయావో నాకు అర్థం కావడంలేదు. ఆయనకన్నా ఉద్రేకం నీకే ఎక్కువగా వున్నట్టుంది. అందువల్లే అతన్ని గుర్తు పట్టలేకపోయి వుంటావ్. ప్రొయిన్లు మార్చే సర్జన్లు, అతనికి ప్లాస్టిక్ సర్జరీ చేసి శాస్త్రిలా తయారు చేసి వుండవచ్చని ఎందుకూహించలేక పోయారో విచిత్రంగా వుంది'' అన్నాడు మోహన్.

వెనుకనుండి మంజుల మరో ఇరువురు మిలిటరీ ఆఫీసర్లు ఆయుధాలతో లోనికి కొచ్చారు. వాళ్ల మధ్యనున్న శాస్త్రిని చూసింది సుసనా.

''అనుకో శాస్త్రీ!'' అరచింది సుసనా.

''నేనే శాస్త్రిని. మావాళ్ళు ముందున్నుంచి హెచ్చరిస్తూనే వుండిపోయారు. కానీ నేనే ఆమె మత్తులో పడి నమ్మలేదు. ఇప్పుడు నమ్మక తప్పటం లేదు'' అన్నాడు శాస్త్రి.

"మర్యాదగా మీరంతా లొంగిపోండి. ఈ యింటికి రాత్రి టైం బాంబ్ పెట్టించాను. నాకు లొంగి, నాతో రాకుంటే తిన్నగా స్వర్గానికి పోతారు" అన్నాడు మోహన్.

కృష్ణ సేవక్ ఆలోచనలో పడ్డాడు. తమ దగ్గర రివాల్వర్లున్నాయి. కానీ ఎదురుగా వున్నవాళ్ళదగ్గర మెషిన్ గన్స్ కనుపిస్తున్నాయి. వాటితో ఎక్కువసేపు పోరాడటం కష్టం.

అందరూ ఆయుధాలు పారేశారు.

మేజర్ మోహన్ గుంపునంతా బంధించాడు.

కార్లలో కెక్కించి ఆర్మీ హెడ్ క్వార్టర్స్ కు పంపాడు. మేజర్ మోహన్, మంజుల కారెక్కారు.

"ఈ స్థలం కనుక్కోవడంలో నువ్వు చాల శ్రమ పడ్డావ్. నీవల్లే ఈ గొడవ ఏ విధమైన రక్తపాతం లేకుండా సమసిపోయింది" అన్నాడు మోహన్.

"ఆ కృష్ణ సేవక్ ఆక్సిజన్ సిలెండరు కొన్నాడు. నేను మగవాడి వేషం వేసుకొని అక్కడే తారట్లాడుతూ నిలుచున్నాను. దాన్ని డిక్కీలో ఎక్కించగానే అతను వెళ్ళి కారెక్కాడు. నేను గుట్టుగా డిక్కీలో కెక్కాను. ఆ స్థలం అలా తెలుసుకోగలిగాను" అంది మంజుల.

కారు ఆర్మీ హెడ్ క్వార్టర్స్ చేరుకుంది.

ఓబ్రాయ్ లేచి ఎదురొచ్చి "వెల్ డన్ మై బాయ్!" అంటూ మేజర్ మోహన్ను కౌగలించుకున్నాడు. ఆయన కళ్లలోనుంచి ఆనందాశ్రువులు రాలాయి.

—: ఐపోయింది :—

# భూగర్భ సాహసయాత్ర!

**'రాజా'**

"యస్ మిస్టర్ ప్రొఫెసర్! నా ద్వారా మీకు కావలసిన సహాయమేమిటో నిస్సంకోచంగా చెప్పండి" అంటూ రివాల్వింగ్ ఛెయిర్‌లో వెనక్కి వాలాడు. యస్. బి. డైరెక్టర్ రమేష్ మిశ్రా.

చిన్నగా దగ్గారు ప్రొఫెసర్ ఆంథోనీగారు. మిశ్రా బొటనవేలు రికార్డర్ బటన్ నొక్కింది.

"మిస్టర్ రమేష్ మిశ్రా! నేను భూగర్భ పరిశోధనా కేంద్రంలో ప్రొఫెసర్‌గా ఉంటున్న సంగతి మీకు తెల్సు. మా పరిశోధనా కేంద్రం ముఖ్యోద్దేశం, భూగర్భంలోవున్న ఖనిజనిక్షేపాలు, వింతలు విశేషాలు తెల్సుకోవడం.

మా పరిశోధనల ఫలితంగా కొన్ని వందల సంవత్స

రాల క్రితం భూగర్భంలో కల్సిపోయిన కొన్ని పట్టణాలు ప్రాచీన నాగరికతా బయటపడ్డాయి.

ఇలా చెప్పుకుపోతే చాలా వస్తుంది. ఇక అసలు విష యానికి వద్దాం.మనమున్న భూమికి ఎక్కడో ఒకచోట కేంద్రం ఉంటుందని మీకు తెల్సు. దానినే భూగర్భ కేంద్రం అంటారనికూడా తెల్సు.

ఈ భూగర్భ కేంద్రం చేరుకోవాలని చాలా దేశాలు ప్రయత్నించాయి. కాని వారి ప్రయత్నాలు ఫలించలేదు. కొందరు కొన్ని మార్గాలద్వారా భూగర్భంలోకి ప్రవేసించ గలిగారు గాని తిరిగి రాలేదు. చివరకు పిసుగెత్తి ప్రపంచ దేశాలన్నీ ఈ ప్రయత్నాన్ని వదిలేశాయి. అక్కడక్కడ కొన్ని దేశాలు ప్రయత్నిస్తున్నప్పటికీ సఫలీకృతులుకాలేక పోయాయి,'' అగారు ప్రొఫెసర్ గారు.

కోటు జేబులోంచి పైప్ తీసి వెల్గించుకొని గట్టిగా దమ్ములాగి తిరిగి చెప్పసాగాడు.

''ఈ మధ్య మావాళ్ళు ఒరిస్సాలోని ఒక జిల్లాలో భూగర్భంలో ఉన్న నిధులకోసం జరిపిన త్రవ్వకాలలో ఒక పెట్టె దొరికింది. దానిలో దొరికిన కొన్ని కరపత్రాల ద్వారా చాలా ఆశ్చర్యకరమైన విషయాలు బయటపడ్డాయి. ఆ కరపత్రాలలో ఉన్న విషయాలు క్లుప్తంగా చెప్పా లంటే, సుమారు ఎనిమిదివందల సంవత్సరాలక్రితం ఒక బ్రిటిష్ పరిశోధకుడు ఐస్‌లాండ్‌లో ఉన్న స్నోఫెల్ అగ్నిపర్వతంద్వారా భూగర్భకేంద్రాన్ని చేరుకోడానికి వెళ్ళి జయప్రదంగా తిరిగొచ్చాడు.

కాని అతను భూగర్భకేంద్రం సమీపానికి వెళ్ళికూడా కొన్ని అనివార్య కారణాల వలన తిరిగి వచ్చేయవల్సి వచ్చింది. ఆ పరిశోధకుడిపేరు ఫిలిప్స్ జె. అడ్వర్ట్. బ్రిటీష్ విల్స్‌లోని ఐర్లండ్ నివాసి.

కొన్ని సంవత్సరాలు కష్టపడి తెల్సుకొన్న విషయాల ద్వారా అతడు ఐస్‌లాండ్‌లోని స్నోఫెల్ అగ్నిపర్వతం లోపలికి ఉన్న బిలంద్వారా ప్రయాణమయ్యాడు. అప్పటికే ఆ అగ్నిపర్వతం ప్రేలి రెండువేల సంవత్సరాలయింది.

అది ప్రేలినప్పుడు లావా మూడు దారులుగా బయటకు వచ్చింది. కొన్ని సంవత్సరాలకు ఆ అగ్నిపర్వతం చల్లారిపోయి లావా బయటకు వచ్చిన దారులు మూడూ, బిలాలుగా ఆరిపోయాయి. అందులో మధ్య బిలంద్వారా ప్రయాణమయ్యాడతను.

కాని అతను తిరిగొచ్చాక దురదృష్టవశాత్తు అతని మాటల నెవరూ నమ్మలేదు, సరికదా విమర్శించి తిట్టారు. ఏమి చెయ్యాలో తోచని ఆ పరిశోధకుడు తాను తెల్సుకొన్న విషయాలను క్లుప్తంగా కరపత్రాలపై కెక్కించి వాటిని కొన్ని పెట్టెలలో పెట్టి ప్రపంచయాత్ర సాగిస్తూ, ప్రతీ దేశంలో ఒకోటి చొప్పున వదిలాడు. అప్పటి కింకా ప్రపంచం నాగరికత పొందలేకపోయినా భవిష్యత్తులోనైనా తన పరిశోధన వలన ప్రపంచానికి మంచి చేకూరుతుందనే నమ్మకాన్ని వెలిబుచ్చుతూ ఆ పని చేశానని తెలియపర్చాడా భూగర్భ పరిశోధకుడు'' ఆగి పైపు నోట్లో పెట్టుకొన్నారు ప్రొఫెసర్ గారు. పొగ వెచ్చగా గుండెలను తాకింది.

ఆశ్చర్యంగా వింటున్న రమేష్ మిశ్రా, ప్రొఫెసర్ గారి వైపు సందేహంగా చూశాడు. చిన్నగా నవ్వాడు ఆయన. నోట్లోని పైపు చేతిలోకి మారింది.

''మిస్టర్ మిశ్రా ఈ విషయం తెల్సిన అనంతరం జరిగిన తర్జన భర్జనలలో భూగర్భ కేంద్రానికి బయలుదేరే బాధ్యత నాపైబడింది. నేనూ సంతోషంగా ఒప్పుకొన్నాను.

సో, ఈ భూగర్భకేంద్ర ప్రయాణంలో ఎన్నో ప్రమా

దాలు ఎదురవ్వవచ్చు. అనుక్షణం ప్రమాదాలతో నిండిన ఈ సాహసయాత్రలో నాకు సహాయంగా ఒక వ్యక్తి కావాలి. సమర్థుడూ, సాహసవంతుడూ ఎలాంటి ప్రమాదాన్నైనా సమయస్ఫూర్తితో ఎదుర్కొగల ధైర్యవంతుడూ ఇత్యాది లక్షణాలుగల వ్యక్తులు ఒక్క స్పెషల్ బ్రాంచ్ వాళ్ళేనని నాకు తెల్సు. అందుకే మీ సహాయంకోసం వచ్చాను" పూర్తిచేసి తిరిగి పైప్ నోట్లో పెట్టుకొన్నారు ప్రొఫెసర్ గారు.

ఐదు నిముషాలు తీవ్రంగా ఆలోచించిన రమేష్ మిశ్రా ప్రక్కనేవున్న బెల్ నొక్కారు.

*　　*　　*

'బాస్' నుంచి కబురు రాగానే చూస్తూన్న ఫైల్ టేబిల్ పై పడేసి బయటకు కదిలాను. నా మనసంతా ఆనందంగావుంది. బాస్ పిలుపు అనగానే ఏదో మంచి కేసే తగిలిందన్నమాట అనుకొన్నాను. బాస్ రూంముందు నిల్చి మునివేళ్ళతో స్ప్రింగ్ డోర్ పై చిన్నగా శబ్దం చేయగానే 'కమిన్' అన్న బాస్ కంఠం ఇంపుగా నన్ను తాకింది.

తలుపు తోసుకొని లోనికి నడిచి బాస్ ఎదురుగా నిల్చాను.

"టేక్ యువర్ సీట్ మిస్టర్ విజయ్."

"థాంక్యూ బాస్" అంటూ కూర్చున్నాను.

"ఈయన ప్రొఫెసర్ ఆంథోనీ. భూగర్భ పరిశోధనా కేంద్రంలో ప్రొఫెసర్" అంటూ నన్ను ఆయనకు పరిచయం చేసారు బాస్.

"గ్లాడ్ టూ మీట్ యూ" అన్నారు ప్రొఫెసర్ గారు చేయందిస్తూ.

"సేమ్ టూ యూ."

బాస్ నావైపు తిరిగారు.

"విజయ్, ఈయన ప్రభుత్వ కోరికమీద భూగర్భ కేంద్రానికి ప్రయాణమాతున్నారు. ఆయన కోరికపై నిన్నూ ఆయన వెంట పంపించడానికి నిశ్చయించుకొన్నాను. రేపే మీ ప్రయాణం. అన్నీ సిద్ధంగా ఉంచుకో" అంటూ చిన్నసైజు టేప్ రికార్డర్ నా కందించారు బాస్.

"థాంక్యూ బాస్. కాని వివరాలు?"

"ఈ టేప్ రికార్డర్‌లో ఉన్నాయి. నీ రూమ్‌కు పోయి తీరిగ్గా విను."

"ఓ. కె. సర్."

"విష్ యూ బెస్ట్ ఆఫ్ లక్."

ప్రొఫెసర్ గారితో కరచాలనం చేసి బయటకు నడిచాను. మరో అయిదు నిముషాల్లో నా రూంలో తీరిగ్గా కూర్చొని టేప్ రికార్డర్ ఆన్ జేసి అందులోంచి వినబడుతున్న ప్రతి మాటనూ శ్రద్ధగా వినసాగాను.

## 2

ఎదురుగా స్నో ఫెల్ అగ్నిపర్వతం గంభీరంగా నిలబడి ఉంది. సుమారు పదెనిమిది వందల అడుగుల ఎత్తుంటుంది.

"ఓ. కె. ఇక బయలుదేరండి" అన్నారు ప్రొఫెసరుగారు ఎదురుగా ఉన్న నలుగురు ఐస్ లాండర్స్‌తో. క్రింద పడిఉన్న మూటలను ఎత్తుకొని చకచకా ముందుకు కదిలారు నలుగురూ. పర్వతాలలో నడవటంలో బాగా అలవాటున్న ఆ నలుగురూ అంత బరువైన మూటలను ఎత్తుకొని కూడా వేగంగా నడవసాగారు. నెమ్మదిగా అడుగులేస్తూ చుట్టూ పరిశీలించి చూశాను. దూరంగా ఫౌంటెన్‌లా పర్వతం అడుగుభాగం నుంచి పైకి చిమ్ముతున్న

నీటి ఊట నన్నాకర్షించింది.

"ఏమిటదిి?" వేలుతో చూపిస్తూ ఇంగ్లీషులో అడిగాను మాతో వస్తున్న గైడ్‌ని. నల్లగా బలంగా పొడుగ్గా ఉన్నాడతను. మాతో కల్సి భూగర్భంలోకి రావటానికి వారానికి 50 డాలర్లకు కుదుర్చుకొన్నారాతనిని ప్రొఫెసర్ గారు.

"వేడినీరు! అగ్నిపర్వతం అంతర్భాగంలో ఉన్న చల్లని నీరు బైటకొచ్చేటప్పుడు పర్వతంలోని వేడికి మరిగి ఫౌంటెన్‌లా పైకి చిమ్ముతుంది" అన్నాడు కావా. అది అతని పేరు.

"మరో విశేషం కూడా ఉంది దానిలో" అన్నారు ప్రొఫెసర్ గారు.

"ఈ నీరు ఇలా ఫౌంటెన్‌లా పైకి చిమ్ముతున్నంత సేపూ ఈ అగ్నిపర్వతం ప్రేలదన్న మాట. ఎప్పుడైనా అగ్నిపర్వతం ప్రేలేటట్లయితే ఒక గంటముందే బైటకొచ్చు చున్న నీరు ఆగిపోయి పొగలు బైటకొస్తాయి. అది చూడ గానే ఈ చుట్టుపట్ల నివశించే ప్రజలు ఈ ప్రదేశాన్ని వదిలి సాధ్యమైనంత దూరంగా వెళ్ళిపోతారు" చెప్పారు ప్రొఫెసర్.

సాయంత్రం ఏడింటికి స్నేఫెల్ పర్వతశిఖరాన్ని చేరు కొన్నాము మేము.

సామానులు మోసుకొచ్చిన కూలీలకు డబ్బిచ్చి పంపే సారు ప్రొఫెసర్ గారు.

దూరంగా కన్పిస్తున్న మూడు బిలాలవైపూ పరిశీలనగా చూశాను. చీకటి పడేలోగా చుట్టుపట్ల పరిశీలించి ఆ రాత్రికి అక్కడే విశ్రాంతి తీసుకొన్నాము.

# 3

తెల్లవారగానే కాలకృత్యాలు తీర్చుకొని ఒక బిలం

అంచుకు వెళ్ళి లోనికి చూశాను. సూర్యకిరణాలు పడుతున్నంత మేరా రాతి నేల మెరుస్తోంది. తరవాత అంతా కటిక చీకటి ఆక్రమించి ఉంది.

కొన్ని వేల ఏళ్ళ క్రితం యీ అగ్నిపర్వతం బ్రద్దలై ఈ బిలంలోనించి లావా బయటకు వచ్చిందన్న విషయం స్ఫురణకు రాగానే ఒళ్ళు జలదరించింది.

మరో అరగంటలో ముగ్గురం రెడీ అయ్యాము. క్రింద పడేసి ఉన్న మూటలు విప్పాడు కావా. దిక్సూచీ, థర్మామీటర్, క్రోమో మీటర్ (లోతులు కొల్చు యంత్రము), కెమెరా మొదలైనవి ప్రొఫెసర్ గారు తన బాగ్ లో సర్దుకొన్నారు.

సుమారు ఆరు నెలలకు సరిపోయే ఆహారం, పదిరోజులకు సరిపోయే నీరు, ఫస్ట్ ఎయిడ్ బాక్స్, కొన్ని డైనమేట్స్ మొదలైన సామానులు నా బాగ్ లో సర్దాను.

మిగిలిన సామానులు కొన్ని రకాల పనిముట్లు సంచిలో చుట్టి కావా భుజానికి తగిలించుకొన్నాడు. మోయడానికి వీలుకానివి, క్రిందపడినా విరిగిపోనివి ముందుగానే బిలంలోకి విసిరేశాను.

ముగ్గురి దగ్గరా రివాల్వర్స్, తగినంత అమ్యూనిషన్ రడీగా ఉంది. ముగ్గురి చేతుల్లో పవర్ ఫుల్ టార్చ్ లైట్స్ చీకటిని పారద్రోలటానికి రెడీగా ఉన్నాయి.

నా సంచిలోంచి పొడుగైన త్రాడుతీసి ఒక కొసను బలంగా ఉన్న రాయికి ముడిపెట్టి రెండో కొసను లోనికి జారవిడిచాను. లోనికి దిగాక చేదుకొంటే వచ్చేలాగ జారుముడి వేశాను. ముందుగా కావా త్రాడు సహాయంతో లోనికి జారాడు.

* * *

మధ్యాహ్నం ఒకన్నెండయింది అఖరున లోనికి దిగిన నేను నేలపై అడుగుపెట్టేసరికి. మేము దిగిన బలం సుమారు నూరడుగుల చుట్టుకొలత కల్గి ఉండటంతో చాలా విశాలంగా ఉంది. ముందుగా పారేసిన సామానులు తీసుకొని ముందుకు నడిచాం.

మా చేతుల్లో వెలుగుతున్న టార్చిలైట్స్ కాంతి పరిసరాలను పట్టపగలు చేస్తోంది. నిలువుగా గోడలా ఉన్న రాతిని పట్టుకొని చూశాను. పట్టు చిక్కలేదు. గ్రాఫైట్ రాయి కావడంవలన తళతళా మెరుస్తోంది.

ప్రొఫెసర్ గారు టార్చిలైట్ను నాలుగు వైపులా త్రిప్పి చూశారు.

ఎదురుగా కన్పిస్తున్న సొరంగం లోనికి నడిచాము. ముందు నడుస్తున్న నా చేతిలోని టార్చి దారిని ప్రకాశవంతం చేస్తోంటే రెండో చేతిలోని రివాల్వర్ ఆకలిగా చూస్తోంది.

కావా ఐస్లాండ్స్లో వేటకాడు కావడం వలన రైఫిల్ షూటింగ్లో ఎక్స్పర్ట్. ఇక నేను సరేసరి. పోతే ఎప్పుడో చిన్నప్పుడు సర్దాగా నేర్చుకొన్న షూటింగ్ ప్రొఫెసర్ గారికి ఇప్పుడు బాగా అక్కరకొచ్చింది. ఆ సొరంగంలో మా ప్రయాణం కొనసాగించాము.

వారం రోజులు గడిచాయి.

# 4

భూగర్భంలో తొమ్మిది మైళ్ళ లోతున ఈశాన్యంగా బ్రిటన్ వైపు 60 మైళ్ళు వెళ్ళాము. అంటే ఐస్లాండ్ దాటి ఆర్కిటిక్ మహాసముద్రం క్రింద 9 మైళ్ళ లోతులో ప్రయాణం చేస్తున్నామన్నమాట.

ఆ విషయం నాకెందుకో మహాద్భుతంగా అన్పించింది.

అదే చెప్పాను ప్రొఫెసర్ గారితో. వెంటనే నవ్వి, "ఇంతకంటే విచిత్రమైన విషయాలను ముందు ముందు చూస్తావు నువ్వు!" అన్నారు.

ముందుకు నడుస్తున్నామన్నమాటేగాని నా ఊహాలన్నీ సముద్రంమీదే ఉన్నాయి.

సముద్రంపైన ఎలా ఉందో? ఏదైనా తుఫాన్ వచ్చి సముద్రం అల్లకల్లోలమైపోతూ ఓడలన్నీ మునిగిపోతున్నా ఏమో?

అసలు సముద్రంలో తిరిగే పెద్ద పెద్ద చేపలు, తిమింగలాలు తమ తోకలతో సముద్ర గర్భంలో అడుగున నేలను బలంగా కొడుతూంటే మా తలపైన ఉన్న రాతి నేల కూలిపోదూ?

మరుక్షణంలోనే నా అర్థంలేని ఆలోచనకు నవ్వొచ్చింది "అయినా మా తలపై ఉన్న నేల అట్టముక్కలా కొద్ది మందమా? దాదాపు తొమ్మిదిమైళ్ళ ఎత్తుంది. ఓ వెయ్యి తిమింగలాలు కల్సి సముద్రం అడుగున కలిసికట్టుగా బాదినా ఏమీ ప్రమాదం లేదే?

ఆలోచనలతో తల మున్కలౌతున్న నన్ను ప్రొఫెసర్ గారి పిలుపు వాస్తవానికి లాక్కొచ్చింది.

"ఇంకా నీరెంతుంది విజయ్?" వాటర్ బాటిల్స్ చూసి ఉలిక్కిపడ్డాను. ఎందుకంటే వాటర్ ఇంకో రోజు కంటే ఎక్కువ రాదు. ఆ విషయమే చెప్పాను ప్రొఫెసర్ గారిక్కి.

ఆయన ఆలోచనలో పడ్డాడు. పైకి కన్పించకపోయినా ఆయనలోనూ కలవరపాటు కలడం నేను గమనించాను. అసలు ఆయన ఐడియా మొదట్లోనే తప్పిందేమో?

భూగర్భంలో దారిలో ఎక్కడో వకచోట మాకు నీటి ఊటలు తగలొచ్చని ఆయన ఎక్స్‌పెక్ట్ చేశారు. ఆ ధైర్యంతోనే పది రోజులకు సరిపడే నీరు తెచ్చుకొన్నాం. కాని ఇప్పటివరకూ ఎక్కడా నీటిఊటలు తగల్లేదు. ఇక ముందు తగులుతాయనే ఆశ సన్నగిల్లుతోంది. పోనీ వెనక్కు తిరిగి పోదామంటే మళ్ళీ ఎనభై మైళ్ళు పోవాలి. ఒక్కరోజులో ఎలా వెళ్ళగలం?

ఆలోచిస్తున్న ప్రొఫెసర్ గారు ఒక నిశ్చయానికొచ్చి నట్లు తల పంకించి,

"సరే పదండి! ముందుకే వెళ్దాం. కాకపోతే వెనక్కి వెళ్ళడం అసంభవం. నీరులేక మాడి చస్తాం. ముందు కెళితే నా ఊహ ప్రకారం ఎక్కడన్నా నీటి ఊటలు తగలొచ్చు" అంటూ కదిలారు.

ఆ రోజు దాదాపు పదిహేను మైళ్ళు నడిచాం. ఆ సాయంత్రంతో మా వద్దనున్న నీరు కాస్తా అయిపోయింది. ఆ మర్నాటి మాటేమిటి. తిండి కావలసినంతుంది. కాని నీరు? నీరు దొరక్క ఈ భూగర్భంలో మలమలా మాడి చచ్చిపోతామేమో అన్న ఆలోచన రాగానే నా ఒళ్ళంతా అవ్యక్తమైన భయంతో జలదరించింది.

నాకా క్షణంలో ఉన్న ఫళంగా పైనున్న గ్రాఫైట్ రాతిని చీల్చుకొని ఎగిరి ఆర్కిటిక్ సముద్రంలో పడా లన్పించింది. ఆ రాత్రికి ఆలోచనలతో నిద్ర పట్టలేదు సరిగా.

ఆ మర్నాడు ఉదయమే నీటిధారల కోసం ఆశగా బయలుదేరిన మాకు సమయం గడిచేకొద్దీ నిరాశే ఎదురవ సాగింది. సాయంత్ర మయ్యేటప్పటికి నీర్సంతో వడిలిన తోటకూర కాడల్లా తయారయ్యాము. మరికొంత దూరం నడిచి ఓచోట కూలబడిపోయాం.

నీరసంతో కాళ్ళు లాగుతోంటే, దాహంతో నోరెండి పోయి కళ్ళు బయటకు వస్తున్నాయి. ఫుడ్ పేకట్స్ తెరిచి బిస్కట్లు తీసాడు కావా. ఎండిపోయిన పెదాలను నాలుకతో తడుపుకొంటూ మెల్లిగా నమలసాగాను.

కాని ఎక్కువగా తినలేక పోయాను. మరి కాస్సేపట్లో అలసటతో నా కళ్ళు మూతలు పడ్డాయి.

## 5

ఏదో శబ్దమైతే మెలకువ వచ్చి కళ్ళు తెరిచాను. నన్ను దాటి ముందుకు వెళ్తున్న ఆకారాన్ని చూసి ఉలిక్కిపడి మరుక్షణమే టార్చిలైట్ వెలుగులో ఆ ఆకారం కావాది అని తెల్సుకొన్నాను. టార్చిలైట్ పట్టుకొని భుజాలపై దుప్పటి కప్పుకొంటూ వడివడిగా నడిచి పోతున్నాడు కావా.

అయినా ఈ అర్థరాత్రి మమ్మల్నెవరినీ లేపకుండా ఎక్కడికి పోతున్నాడు. ఒకవేళ పారిపోతున్నాడా? అయినా పారిపోయేవాడు వెనక్కి వెళ్ళకుండా ముందు కెందు కెళ్తాడు.

ఇక ఆలోచించే ఓపిక లేక మళ్ళీ కళ్ళు మూసు కొన్నాను.

కాని ఓ అరగంట గడవకముందే తిరిగి పరుగెత్తు కొచ్చాడు కావా. ప్రొఫెసర్ గారిని కుదుపుతూ అరిచాడు "మాస్టర్ ... మాస్టర్" అంటూ.

"వాట్? ఏం జరిగింది?" లేచి కూర్చొంటూ అడిగారు ప్రొఫెసర్ గారు.

"వాటర్ మాస్టర్ వాటర్" అరిచాడు. కళ్ళు మూసు కొని వింటున్న నాకు వెయ్యి ఏనుగుల శక్తి వచ్చినట్లైంది.

"వాటరా? ఎక్కడ?" అడిగాను.

"దగ్గరలోనే. కమాన్ హారియప్" అంటూ నా భుజం పట్టుకొని పైకి లేపాడు.

కొద్ది క్షణాలలో ముగ్గురం ముందుకు కదిలాము. అర మైలు దాటకముందే హోరుమంటూ పెద్దగా నీటిశబ్దం విన్పించింది. రెట్టించిన ఉత్సాహంతో ఇంకా వేగంగా నడిచాము.

కొంచెం దూరం వెళ్ళేసరికి ప్రక్కనే జలప్రవాహం ఉన్నంత గట్టిగా శబ్దం విన్పించసాగింది. ఆగాడు కావా.

"ఇంకా ముందుకెళ్దాం" అన్నారు ప్రొఫెసర్.

"అక్కరలేదు. ముందు కెళ్ళినంతమాత్రాన నీటిధార కన్పించదు సరికదా దూరమైపోయి శబ్దం కూడా విన్పించదు" అంటూ సంచిలోంచి ఒక పొడుగాటి ఇనప ఊచ తీశాడు. దాని చివర సూదిలా కూచిగా ఉంది.

ముందుకు నడిచి రాతిగోడను పరీక్ష చూశాడు. దానికి చెవి ఆన్చి కాస్సేపు విని మావైపు తిరిగి, "ఎంతో దూరం లేదు. బహుశా రెండడుగులు ఉండొచ్చు" అంటూ ఆ ఊచతో రాతిని బలంగా కొట్టాడు. ఠంగుమంది రాయి.

ఓ, అరగంట గడిచీ గడవకముందే హోరు పెద్దదయింది. దాదాపు అప్పటికి అడుగున్నర లోతు త్రవ్వాడు.

నా నోట్లో తడారిపోతోంది. కళ్ళలో ప్రాణాలు నిల్పుకొని చూస్తున్నాను. చివరి సారిగా రాతిగోడని చేయెత్తి ఇనప ఊచతో బలంగా కొట్టాడు.

మరుక్షణమే విసురుగా కావా ముఖాన్ని తాకింది మరుగుతున్న వేడినీరు. భయంకరంగా అర్చాడతను. చటుక్కున అతని భుజం పట్టుకొని ప్రక్కకు లాగేశాను.

ఖాళీగాఉన్న వాటర్ బాటిల్ వకటి తీసి దానినిండా

నీరు పట్టారు ప్రొఫెసర్ గారు. ఆ నీరు చల్లారేటప్పటికి కావాకు మందు వెయ్యడం అయిపోయింది.

చల్లారిన నీటిని ఆత్రంగా తాగాము ముగ్గురమూ. అద్భుతంగా ఉన్నా క్రొద్దిగా ఐరన్ స్మెల్ కొట్టాయి నీరు.

"ఐరన్, కాల్షియం ఎక్కువగా ఉన్నాయి ఇందులో. చాలా ఆరోగ్యం" అన్నారు ప్రొఫెసర్ గారు నీరు తాగుతూ.

రాతి గోడలోంచి బయటకు ఉరుకుతున్న వేడినీరు నెమ్మదిగా పిల్లకాలవలాగ ముందుకు సాగుతోంది.

"వెల్! మనకు దారిలో నీరయిపోయినప్పుడల్లా ఇందులో నీరు పట్టుకోవచ్చు. మరో విషయం ఈ నీటి ఊటను కనుక్కొన్నది కావా గాబట్టి అతని పేరున దీనికి కావాకెనాల్ అని పేరెడుతున్నాను" అంటూ బాగ్ లోంచి మిగిలివున్న ఒక జిన్ బాటిల్ పైకితీశారు ప్రొఫెసర్ గారు.

ఆ రాత్రికి అక్కడ్నుంచి కదల్లేదు మేము.

# 6

"నేటికి మనం బయలుదేర సరిగా రెండు నెలల పదిహేను రోజులు" అన్నాను నేను ఖాళీ అయిన వాటర్ బాటిల్స్ ప్రక్కనే పారుతున్న కావాకెనాల్ లో ముంచుతూ.

"ఇప్పు డెక్కడున్నట్లు మనం?" అడిగాడు కావా నోట్లోని బ్రెడ్ నములుతూ.

క్రోనోమీటర్, దిక్సూచీలను పరిశీలిస్తున్న ప్రొఫెసర్ ఆంథోనీ గారు తలపైకెత్తారు. ఖంగుమంది ఆయన కంఠం.

"ఐస్‌లాండ్ కు ఈశాన్యంగా ఆర్కిటిక్ మహాసముద్రం దాటి 200 మైళ్ళలోతులో బ్రిటిష్ ఐల్స్ దాటుతున్నాం."

"ఇప్పటికి ఎంతదూరం వచ్చామంటారు?" అడిగాను.

"సుమారు పదహారువందల మైళ్ళు వచ్చుండొచ్చు" ముందుకు కదులుతూ అన్నారు. వారిననుసరిస్తూ కొద్దిదూరంలో నడుస్తున్నాను. ప్రక్కనే ప్రవహిస్తున్న కావాకెనాల్ వింతవింత శబ్దాలు కలిస్తూ మనస్సు నెంతో ఆహ్లాద పరుస్తోంది. కళ్ళముందు బాస్ మెదిలారు. ఆయనకు మనసులోనే కృతజ్ఞతలు తెల్పుకొన్నాను నాకిలాంటి అడ్వెంచర్ కల్పించినందుకు. ఎప్పుడు మారు వేషాలలో దేశాలు తిరుగుతూ ఒకరినొకరు కాల్చుకుంటూ, దేశంకోసం ప్రాణాలు సైతం త్యాగంచేసే గూఢచారులంటే నాకు చాలా ఇష్టం. అందుకే ఇంట్లో వప్పుకోకపోయినా పట్టుపట్టి మరీ 'యస్ బి' లో చేరాను.

చేరిన కొన్నాళ్ళకే మంచి పేరు తెచ్చుకొని సమర్థవంతుడిగా బాస్ దృష్టిలో గుర్తింపబడ్డాను. అసలు నాకీ అవకాశం రాకపోతే ఇప్పుడేం చేస్తుండేవాడినో? బహుశా ఏ పాకిస్తానేనా వెళ్ళేవాడినేమో!

ఆలోచనలనుంచి తేరుకొంటూ "ప్రొఫెసర్ సాబ్" అంటూ పిలిచాను. కాని సమాధానం లేకపోవడంతో ఉలిక్కిపడి చుట్టూ పరిశీలించి చూశాను.

ఎక్కడా ప్రొఫెసర్, కావాల జాడలేదు. ఒకవేళ నేను ఆలోచనలోపడి దారితప్పానేమో అన్న ఆలోచన రాగానే కంగారుగా క్రిందకు చూశాను.

గలగలా ప్రక్కనే క్రిందుగా ప్రవహిస్తూండే కావా కెనాల్ కన్పించలేదు. జరిగిందర్థమయ్యేసరికి నావంటి నిండా చమటలు పట్టాయి. వెనక్కి పరిగెత్తాను. టార్చ్ లైట్ వెలుగులో గ్రాఫైట్ గోడలు మెరుస్తున్నాయి.

నాలుగైదు గంటలసేపు పిచ్చిగా వెదికాను. వాళ్ళ జాడ లేదు సరికదా కావా కెనాలైనా కన్పించలేదు. నా

మతి పోతోంది.ఏం చెయ్యాలో తోచటం లేదు.తలపైనున్నది 150 మైళ్ళ ఎత్తు రాయి. నేనెక్కడున్నానో నాకే తెలీదు. తిరిగి ప్రొఫెసర్ గార్ని చూస్తానో లేదో? నా కా క్షణంలో భూగర్భంలో ఆకలిదప్పులతో అలమటిస్తూ దిక్కు లేని చావు చస్తానేమో అన్పించింది.

తిరిగి వెతుకుతూ బయలుదేరాను.

## 7

రెండురోజులు గడిచాయి.

ప్రొఫెసర్ గారి జాడ దొరకలేదు. నా దగ్గరున్న వాటర్ బాటిల్ లో మిగిలివున్న కొద్దినీరు త్రాగాను. బాటిల్ దూరంగా విసిరేశాను.

ఆహారం కావలసినంతున్నా నీరు లేకుండా ఎలా బ్రత కాలో అర్థంకావటంలేదు. గమ్యంలేకుండా ముందుకు నడు స్తున్నాను. నా కాళ్ళక్రింద కంకర్రాళ్ళు కరకరలాడు తున్నాయి.

"విజయ్" అస్పష్టంగా కేక వినగానే ఉలిక్కిపడి ఆగిపోయాను. భ్రమో, నిజమో అర్థంకాలేదు. చెవులు రిక్కించి గోడకు ఆనించి నిలబడ్డాను. అయిదు నిముషా లనంతరం మళ్ళీ విన్పించింది అదే కేక. ఈసారి స్పష్టంగా పెద్దగా విన్పించింది.

ఎగిరి గంతేశాను.

"ప్రొఫెసర్ సాబ్" గట్టిగా అరిచాను. రెండు నిము షాల తర్వాత ప్రొఫెసర్ గారి గొంతు ఆత్రంగా విన్పిం చింది.

"విజయ్...నువ్వేనా?"

"ఆ! నేనే సార్ విజయ్‌ని!"

"విజయ్...నువ్వు...నువ్వు...ఎక్కడున్నావ్?"

"ఇక్కడే ఉన్నాను సార్."

"ఆ! అక్కడేవుండు మళ్ళీ పిలుస్తాను."

"అలాగే సర్! అలాగే" అరిచాను. నా చేతిలోని టార్చ్ ప్రకాశిస్తోంది. ముందుకు నడిచాను. కొంచెం దూరం నడిచేప్పటికి ఎడమచేతివైపు దారి కన్పించింది. ముందంతా చీకటిగా అగమ్యగోచరంగా ఉంది.

"విజయ్ ఏంచేస్తున్నావ్?" ఈసారి మరింత స్పష్టంగా విన్పించింది ప్రొఫెసర్ గారి గొంతుక ఎదురుగావున్న చీకటి లోంచి.

"ఏం చెయ్యటంలేదు! మీరేం చెయ్యమంటారు?" అంటూ అరిచాను.

"విజయ్ ముందు మనిద్దరి మధ్య దూరమెంతో తెల్సుకోవాలి. అందుకే ఓ పని చేద్దాం. ఓ నిముషం తర్వాత నిన్ను పిలుస్తాను. నా పిలుపు వినగానే వెంటనే సమాధానం పలుకు. మాటలబట్టి శబ్దగ్రహణ యంత్రంద్వారా మనమధ్య దూరాన్ని లెక్కకడతాను."

"ఓ. కె. సార్" అరిచాను.

చకచకా పది నిముషాలు గడిచాయి.

మా ప్రయత్నం ఫలించిందని తెల్పుతూ ప్రొఫెసర్ గారి గొంతు చీకటిలో ప్రతిధ్వనించింది.

"వెల్ విజయ్, మన మధ్యదూరం తెల్సుకొన్నాను. ఎంతో తెల్సా, నువ్వూహించలేవు. ఇరవైమైళ్ళు..."

నివ్వెరబోయాను.

"ఇంపాజిబుల్. నేనమ్మలేను. లేకపోతే 20 మైళ్ళ దూరంలోని మన మాటలు ఎలా విన్పిస్తున్నాయ్?"

"విజయ్ నమ్మకేం చేస్తావోయ్! తప్పదు. ఇకపోతే మాటల విషయమా? ఇరవై మైళ్ళేమిటి ఖర్మ నలభైమైళ్లైనా

స్పష్టంగా విన్పిస్తాయి. ఎలాగో తెల్సా, మనచుట్టూ వున్న గ్రాఫైట్ రాతిపొరలద్వారా మన మాటలనుంచి వెలువడిన ధ్వనితరంగాలు గాలికంటే వేగంగా ప్రయాణించి ఇంకొకరిని చేరుకొంటాయి."

ప్రొఫెసర్ గారి గొంతు చీకటిలో గంభీరంగా ప్రతిధ్వనించింది.

రాతిగోడవైపు కృతజ్ఞతగా చూశాను.

"ఇంతకూ మిమ్మల్ని చేరుకోవడమెలా?"

"అదే ఆలోచించాలి... ఆ... అన్నట్లు నీదగ్గర ఎలక్ట్రిక్ టార్చ్ ఉందిగా."

"ఉన్నది."

"ఎలా వర్క్ చేస్తోంది?"

"ఫైన్."

"అయితే ఓ పనిచెయ్యి. నీ ఎదురుగా ఏదారివుంటే ఆ దారిన బయలుదేరు. మధ్యలో పావుగంటకోసారి ఆగి నన్ను పిలువ్. దూరం లెక్కచూసి నీ రూట్ కరక్టో కాదో తెల్పుతుంటాను. వెంటనే బయలుదేరితే ఐదారు గంటలలో మమ్మల్ని చేరుకోగలవు" అన్నారు ప్రొఫెసర్ గారు.

"ఓ. కె. సార్. నేను బయలుదేరుతున్నాను" అంటూ గట్టిగా ఒకసారి అరిచి చీకటిగావున్నా ముందుకు నడిచాను.

నా చేతిలోని టార్చి పరిసరాలను ప్రకాశవంతం చేస్తోంది. బాగా పల్లంగా ఉండటం వలన జారడం కష్టంగావున్నా గమ్యం తొందరగా చేరుకోవాలనే ఉత్సాహం ముందుకు నడిపిస్తోంది. అలా ఎంతసేపు నడిచానో, కాళ్ళు లాగుతున్నాయి. తల తిరుగుతోంది. మొత్తానికి ప్రొఫెసర్ గారి

సమయస్ఫూర్తివల్ల వారిని కలుసుకోగలిగాను. కాని ఒంట్లో శక్తిలేకపోవటంవల్ల మగతగా కళ్ళు మూతబడ్డాయి.

# 8

భారంగా కళ్ళు తెరిచాను. ఎదురుగా ప్రొఫెసర్ గారి ముఖం అస్పష్టంగా కన్పించింది. మరి కాస్సేపట్లో ఆదరంగా నవ్వుతున్న ఆయనను సంతోషంగా స్పష్టంగా చూడగలిగాను.

"ప్రొఫెసర్ సాబ్."

"యస్ మై బాయ్ యు ఆర్ సేఫ్" అన్నారు.

"థాంక్యూ సర్."

దగ్గరలోనే సముద్రపు హోరులా పెద్ద శబ్దం విన్పిస్తోంది.

"ఏమిటి సార్ ఆ హోరు?"

"సీ."

"సీ? అంటే మనం భూగర్భం నుంచి పైకొచ్చేశామా?"

"ఊహూ! లోనే ఉన్నాము."

"భూగర్భంలోనా! అంటే భూగర్భంలో సముద్రమా?" నమ్మలేకపోతూ అడిగాను.

"అవునోయ్ విజయ్ భూగర్భంలోనే! ఈ సముద్రం పేరేమిటో తెల్సా 'ఆంగ్లోనీ మహాసముద్రం.' దీనిని కనిపెట్టిన మొదటి వ్యక్తిని నేనే కాబట్టి నాపేరే పెట్టుకొన్నాను. ఆ...అన్నట్లు మరో విచిత్రం. మనమిప్పుడెక్కడున్నామో తెల్సా? ఆఫ్రికాలోని సహారా ఎడారికి క్రింద 230 మైళ్ళ లోతులో ఉన్నాము!" అన్నారు ప్రొఫెసర్ గారు.

ఆయన మాటలు వింటూ ఆశ్చర్యంతో 'ఫెంటాస్టిక్' అంటూ గొణుక్కున్నాను. లేకపోతే పైన ఎడారి క్రింద మహాసముద్రమా?

"కావా ఎక్కడ?"

ఇంజక్షన్ నీడిల్ని డిస్టిల్ వాటర్‌తో కడుగుతున్న ప్రొఫెసర్ గారు తలెత్తి చూశారు.

"బయట పడవ తయారుచేస్తున్నాడు."

"అయితే బయట కెళ్ళి ఓసారి చూసొద్దాం" అన్నాను కొంచెం దూరంలో ఉన్న గుహ ద్వారంగుండా లోపలి కొస్తున్న మసక వెలుతురును చూస్తూ.

"నో...ఇప్పుడొద్దు. నీ ఆరోగ్యం అంత బాగోలేదు. ప్రస్తుతానికి విశ్రాంతి తీసుకో! సాయంత్రం వెళదాం" అంటూ ఇంజక్షన్ చేసి గుహ బయటకు వెళ్ళిపోయారు ప్రొఫెసర్ గారు. నెమ్మదిగా కళ్ళు మూసుకొని నిద్రలోకి జారాను.

ఆ సాయంత్రమే ప్రొఫెసర్ గారి సాయంతో బయటకు కదిలాను. ఒక్కసారి కళ్ళు జిగేలు మన్నాయి. మూడు నెలలుగా చీకటిలో చూడటానికి అలవాటుపడిన నాకళ్ళు ఆ మసక వెలుతురును తట్టుకోనేప్పటికి అరగంట పట్టింది.

అప్పుడు చూసాను ఆంధ్రోనీ మహాసముద్రాన్ని. కను చూపు మేరా నిశ్చలంగా ఉంది. తీరాన్ని మాత్రం కెర టాలు హోరుపెడుతూ బలంగా ఒడ్డును తాకుతున్నాయి. ఐదు నిముషాలు పరీక్షగా చూసాను. అంతా తెల్లగా మసక కాంతిలో ఉంది.

సూర్యుడు, సూర్యకాంతి లేకపోయినా ఏదో కాంతి ఫ్లోరోసెంట్ దీపం వెలుగులాగ తెల్లగా ప్రకాశిస్తూ ఆకాశ మంతా ప్రకాశిస్తోంది. బహుశా ఐదారు మైళ్ళ ఎత్తుంటుంది ఆకాశం. అక్కడక్కడా చిన్నచిన్న మబ్బులు పరిగెడు తున్నాయి.

చిన్నగా నిట్టూర్చి ప్రొఫెసర్ గారితో కల్సి దూరంగా

కన్పిస్తున్న చెట్లవైపు నడిచాను. బహుశా వాటి కొమ్మలే కాబోలు విరిచి తీసుకొచ్చి పడవ తయారుచేస్తున్నాడు కావా.

ఒక్కొక్క చెట్టూ నలభై, ఏభై అడుగుల ఎత్తుంది. ఒక చెట్టును పరీక్షగా చూసి ఉలిక్కిపడ్డాను. నలభై అడుగుల ఎత్తున్న ఆ చెట్టు భూమిమీద సాధారణంగా ఎక్కడబడితే అక్కడ పెరిగే అత్యల్పమైన ఫెర్న్ మొక్క అని గ్రహించటానికి ఎక్కువసేపు పట్టలేదు నాకు. అంటే ఆ చెట్లన్నీ ఫెర్న్ చెట్లన్నమాట. ఆలోచిస్తూ వెనుతిరిగి పది నిముషాలలో ప్రొఫెసర్ గారితో కల్సి గుహను చేరుకొన్నాను.

# 9

"వారంరోజులైంది మనం సముద్రం మీద బయలుదేరి" అంటూ జేబులోంచి డైరీ తీసాను.

టైమ్ అయిదయింది. పైన ఆకాశంలో రాత్రి పగలు లేకపోవటంతో అది ఉదయమో సాయంత్రమో తెలీలేదు. పడవ 'అంథోనీ మహాసముద్రం'లో ఉయ్యాలలా ఊగుతూ వేగంగా పోతోంది.

చల్లగా వీస్తున్న గాలికి పడవ తెరచాప రెపరెపలాడుతోంటే డైరీ రాయటం మొదలెట్టాను. కాని రెండు రోజుల క్రితం జరిగిన సంఘటన గుర్తుకు రాగానే నా గుండెలు జలదరించాయి.

ఆరోజు ఉదయమే (వాచీలో డేట్ మారటం చూసి ఉదయమని గ్రహించాను) బ్రేక్‌ఫాస్ట్ పూర్తి చేసుకొని బైనాక్యులర్స్‌తో చుట్టూ సముద్రాన్ని పరీక్షగా చూస్తున్నాను. ప్రొఫెసర్ గారు తీరిగ్గా కూర్చొని అప్పటివరకూ జరిగిన సంఘటనలూ, ఎదురైన ప్రమాణాలూ నెమరు వేసు

కొంటూంటే కావా గాలం వేసి సముద్రంలోని చిన్న చిన్న చేపలను పడుతున్నాడు.

మా దగ్గరున్న ఆహారం ఇంకా రెండు నెలల కొస్తుంది. నీటి సంగతి ఇంకో పదిహేను రోజులుదాకా చూసుకో నక్కరలేదు. కాని దారి తెన్నూ లేకుండా పడి ఈ సము ద్రంలో ఎన్నాళ్ళకు ఇంకో తీరం చేరుకొంటామో? అసలు భూగర్భ కేంద్రం చేరుకోగలమో లేదో? అనే అనుమా నాలు నా మనసుని ఇంకా పీకుతున్నాయి.

ఆలోచిస్తూ బైనాక్యులర్స్ లోంచి చూస్తున్నాను. ఉన్నట్టుండి నా కళ్ళు మెరిశాయి బాగా దూరంగా చిన్న చిన్న దీవులు కొన్ని అస్పష్టంగా కన్పించగానే-ప్రొఫెసర్ గారికి చెప్పగానే ఆత్రంగా నా చేతిలోని బైనాక్యులర్స్ లాక్కుని చూశారాయన.

చూస్తూండగానే మా పడవ మరి కాస్సేపట్లో ఒక దీవిని చేరుకొంది. పడవను లంగరేసి, దీవి మీదకు నడి చాము ముగ్గురమూ. మా చేతిలోని రివాల్వర్సు ఏక్షణంలో నైనా నిప్పులు క్రక్కడానికి సిద్ధంగా ఉన్నాయి.

దీవిమీద మనోహరంగా ఉంది. గలగల పారుతున్న సెలయేళ్ళు, రకరకాల చెట్లూ వాటి నిండా విరగ కాచి ఉన్న పళ్ళూ చూస్తూంటే హృదయం పరవళ్ళు త్రొక్కు తోంది. హుషారుగా ముందుకు అడుగు వేయబోతూ ఏదో శబ్దం విని ఆగిపోయి చుట్టూ పరిశీలించి చూసాను. ఓ మైలు దూరంనుంచి పెద్ద పెద్ద అంగలు వేస్తూ మా వైపు దూసుకు వస్తోంది ఏదో జంతువు. సుమారు నలభై అడుగులు ఎత్తుండి చాలా భయంకరంగా డైనోసారస్‌లా ఉంది. కంగారుగా వెనక్కి తిరిగి తీరం వైపు పరిగెత్తాము. క్షణాలలో పడవను చేరుకొని లంగరెత్తి, సముద్రంలోకి పోనిచ్చాము.

అదేసమయంలో, తీరానికి చేరుకొన్న డైనోసారస్ వంటి జంతువు పారిపోతున్న మమ్మల్ని చూసి భీకరంగా అరిచింది. నా చేతిలోని రివాల్వర్ 'ధన్' మంది. బులెట్ దూసుకెళ్ళి దాని శరీరాన్ని తాకి క్రింద పడిపోయింది. మరోసారి భీకరంగా అరిచిందా జంతువు.

మరి కాస్సేపట్లో ఆ దీవి కనుచూపు మేర దాటిపోయింది మా పడవ.

# 10

జరిగిన సంఘటన నా కళ్ళకు కట్టినట్లు కన్పించగానే చిన్నగా నిట్టూర్చాను. కావా పడుతున్న చేపలను పరిశీలించి ఖాళీ సీసాలలో వేస్తున్నారు ప్రొఫెసర్ గారు. వాటిని పరిశీలించిన ప్రొఫెసర్ గారు మాకో అద్భుతమైన విషయాన్ని తెల్పారు.

ఈ అంధోసి మహాసముద్రంలోని చేపలకు భూమిమీద రెండు లక్షల సంవత్సరాల క్రితం జీవించిన చేపల లక్షణాలు చాలా ఉన్నాయట. వాటిని పరిశీలించి చూడగా ప్రొఫెసర్ గారు చెప్పింది కరక్టే నన్పించింది.

పడవలో ఒక మూలగా పడేసి ఉన్న త్రాడును తీసి చుట్ట విప్పాను. సుమారు వెయ్యి అడుగుల పొడుగు త్రాడు అది. ఒక కొస బరువైన ఇనప ఊచకు కట్టి నెమ్మదిగా త్రాడును సముద్రంలోకి దించాను.

"ఏం చేస్తున్నావ్?" అంటూ రాస్తున్న బుక్ మూసారు ప్రొఫెసర్ గారు.

"లోతు చూస్తున్నాను" అన్నాను. అప్పటికే సగం త్రాడు సముద్రంలోకి వదిలాను. ఎక్కడా అడుగుభాగం తగలేదు సరికదా మొత్తం త్రాడు పూర్తిగా సముద్ర గర్భంలోకి వదిలినా లోతెంతో తెలీలేదు.

ప్రొఫెసర్ గారు నవ్వారు.

"మైడియర్ విజయ్. నువ్వనుకొన్నంత ఎక్కువ లోతు లేదీ అంథోనీ మహాసముద్రం. నా ఉద్దేశ్యంలో ఏ నాలుగైదు వేల అడుగులో ఉంటుంది" అన్నారు.

నేను మాట్లాడకుండా త్రాడు పైకి లాగాను. పావు గంటలో ఇనప ఊచ సముద్ర ఉపరితలానికి వచ్చింది. దానిని చేతిలోకి తీసుకొంటూ దానిపై ఉన్న పళ్ళ గుర్తులను చూసి ఉలిక్కిపడి కళ్ళు పెద్దవి చేశాను.

ప్రొఫెసర్ గారు కళ్ళజోడు తడుముకొంటూ దానికేసే పరీక్షగా చూస్తూ,

"విజయ్, మనమో పెద్ద ప్రమాదంలో చిక్కుకొన్నామోయ్!" అన్నారు.

"ప్రమాదమా?"

"అవునోయ్... నా ఉద్దేశ్యంలో ప్రమాదమే. ఈ ఇనప ఊచపై పళ్ళ గుర్తులను పరీక్షగా చూశావుగా. ఏదో సముద్ర జంతువు ఇనుప ఊచను చూసి ఏమిటో అనుకొని కరిచి ఉంటుంది. అవునా?...అయితే అది ఎలాంటి జంతువు అంటావ్?"

"బహుశా ఏ రాక్షసి మొసలో అయి ఉండొచ్చు" అన్నాను.

"కరెక్ట్. అంతటి పెద్ద జంతువు అయితే తప్ప ఇలాంటి ఇనప ఊచను అవలీలగా కరవలేవు. అంటే ఇందులో చిన్న జీవులే కాకుండా పెద్ద పెద్ద సముద్ర జంతువులు కూడా ఉన్నాయన్నమాట" ప్రొఫెసర్ గారి మాట పూర్తి కాకుండానే కావా పెద్దగా అరిచాడు. అతను చూస్తున్న వైపు చూడగానే ప్రొఫెసర్ గారి ఊహ నిజమనిపించింది.

దూరంగా సముద్ర గర్భంలోంచి చాలా భయంకరమైన

జంతువొకటి సుమారు ఎనభై అడుగుల ఎత్తున్నది పైకి లేస్తోంది. దాని మెడనుంచి పైభాగమంతా సర్పం ఆకారం పోలివుంటే క్రింది భాగమంతా పదీ, పదిహేను ఏనుగుల ప్రమాణంలో ఉంది.

కొండ చిలువలా తల త్రిప్పుతూ భయంకరంగా అరిచింది ఆ జంతువు. అరుస్తున్నప్పుడు నోటి వెంట పొగలు బయటకు చిమ్మాయి. ఆ అరుపుకు సముద్ర కెరటాలు ఉవ్వెత్తున లేచి మా పడవను దూరంగా నెట్టుకుపోయాయి.

అదే సమయంలో మరో విచిత్రం జరిగింది. ఆ రాక్షసి జంతువు రెండోసారి అరుస్తుండగా మరో రకమైన గర్జన వినిపించింది. మేము ఆశ్చర్యపోతూ నోరెళ్ళబెట్టి చూస్తుండగానే మరో వైపునుంచి నీటిలో ఈదుకొచ్చిన మరో జంతువు మొదటిదానితో కలబడింది.

దీని ఆకారం ముళ్ళపందిని పోలి వుందిగాని సైజు మాత్రం మొదటిదానికి ఏమాత్రం తీసిపోకుండా వుంది. మొదటి జంతువు మరోసారి అరిచి రెండోదానితో కలబడింది.

ప్రొఫెసర్ గారు తేరుకొని బాగ్ లోంచి కెమెరా తీసి చకచక ఫొటోలు తీయసాగారు.

సముద్రంలో భయంకరంగా రెండూ కొట్టుకొంటుంటే విసురుగా లేస్తున్న కెరటాలకు చిన్న చెక్కముక్కలా మా పడవ దూరంగా దూసుకుపోతూంది.

బద్ధశత్రువుల్లా కొట్టుకొంటున్నాయి రెండూ. మొదటిది విషం క్రక్కుతూ బుసలుకొడుతూంటే, రెండో జంతువు మొదటిదాని మెడకొరికి వేయడానికి ప్రయత్నిస్తోంది. ఒకదానినొకటి కరుచుకొంటూ కాళ్ళతో తన్నుకొంటూ, నీళ్ళను అల్లకల్లోలం చేస్తున్నాయి.

చూస్తూండగానే రెండో జంతువు గాయపడి సముద్రంలో మునిగిపోయింది. మొదటి జంతువు మోర పైకెత్తి విజయ సూచనగా భయంకరంగా ఓ అరుపు అరిచి వెను తిరిగి నీటిలో ఈదుకొంటూ దూరంగా కన్పించకుండా పోయింది.

మరి కాస్సేపట్లో గాయపడి సముద్రంలో మునిగి పోయిన రెండో జంతువు కళేబరం నీటిపైకి నిర్జీవంగా తేలిపోయింది.

# 11

సుమారు రెండు మైళ్ళు చుట్టుకొలత కలిగుందా దీవి. మధ్యలో చిన్న సెలయేరు, అక్కడక్కడా కొన్ని చెట్లతో నిర్జనంగా వుంది.

బైనాక్యులర్స్‌లో దీవంతా మరోసారి స్పష్టంగా పరిశీలించి పడవను ఆపి దీవిమీదకు దూకాను. ఓ గంటసేపు దీవంతా ముగ్గురం కలిసి తిరిగాము. చెట్లనున్న పళ్ళు కోసుకొని తిన్నాము. తియ్యగా వున్నాయి. సెలయేరులో నీరు త్రాగాము. రుచిగా తాగేకొద్దీ తాగాలన్పిస్తోన్నాయి.

"వళ్ళంతా చిరాగ్గా వుంది" అన్నాడు కావా బట్టలిప్పుకొంటూ. స్నానంచేసి ఎన్నాళ్ళయిందోకాని గనుల్లో పనిచేసే కార్మికుల్లా వున్నాము.

ఎగిరి నీటిలోకి దూకాడు కావా. చుట్టూ పరిశీలించి చూడసాగాను.

"విజయ్" పిల్చారు ప్రొఫెసర్ గారు.

ఆయనవైపు తిరిగాను.

క్రింద ఇసుకను పరిశీలిస్తున్నారు ఆయన. తళతళ మెరుస్తోంది ఇసుక.

"విజయ్..." ఏదో అనబోతుండగా కావా అరుపు వినిపించింది. కంగారుగా పరిగెత్తాము ఇద్దరం. నీటిలో మునిగిపోయి గింజుకొంటున్నాడతను. నోటమ్మట వెలువడుతున్న గాలి, బుడగల రూపంలో పైకొస్తూంది.

ప్రొఫెసర్ గారి దృష్టి అతని కాలిపై పడింది. అతని కాలిని నల్లటి పొడవాటి జంతువేదో చుట్టుకొని క్రిందకు లాగుతోంది. దానినుంచి తప్పించుకోడానికి గింజుకొంటున్నాడతను.

"ముర్రేఈల్" అన్నారు ప్రొఫెసర్ గారు అస్పష్టంగా. ఆయన ముఖం వివర్ణమైంది. ఎప్పుడో నేవీ క్లాసులో సముద్ర జంతువులపై చెప్పిన పాఠం గుర్తొచ్చింది నాకు.

'ఈ ముర్రేఈల్స్ చాలా భయంకరమైన సముద్ర జంతువులు. సన్నగా పొడుగ్గా పురుకోసలా వున్నా నీటిలో దీని బలంముందు ఎంత పెద్ద జంతువైనా ఆగలేదు. సాధారణంగా ఈ ముర్రేఈల్స్ బంగాళాఖాతంలో అండమాన్స్ దగ్గరగా వున్న పగడపు కొండలలో ఎక్కువగా వుంటాయి. రాతిలో బిలాలు ఏర్పాటు చేసుకొని అందులో పొంచి వుండి ఏ జంతువన్నా సమీపంలోకి రాగానే దాన్ని పట్టుకొని రక్తం పీల్చేస్తాయి.'

జేబులోంచి బటన్ నైఫ్ లాగాను. బటన్ నొక్కగానే 'చక్' మంటూ బ్లేడ్ పైకి వచ్చింది. ఎగిరి నీటిలోకి దూకాను. మసక కాంతి వెన్నెలలా నీటిలో ప్రతిఫలిస్తోంది. కావాలో ప్రతి ఘటన తగ్గిపోతోంది. ఏ క్షణాన్నైనా ప్రాణం పోయేటట్లున్నది. దగ్గరగా వెళ్ళి ముర్రే ఈల్ ను నైఫ్ తో బలంగా పొడిచాను. బ్లేడ్ 'ఈల్' శరీరంలో దిగబడింది. పచ్చటిద్రవం బయటకు చిమ్మింది. నైఫ్

వెనక్కిలాగి మరోసారి పొడవబోయాను.

ఈలోగా కావా కాలుని వదిలి నాపైకి విజృంభించింది 'ఈల్'. జాగ్రత్తగా కాచుకొంటూ మరో రెండు పోట్లు పొడిచాను. 'ఈల్' గిలగిలలాడుతూ వెనక్కి తిరిగి బిలం లోకి పారిపోయింది. ఈదుకొంటూ పైకొచ్చాను.

అప్పటికే కావా కాలు కట్టుకట్టిన ప్రొఫెసర్ గారు ఇసకలో అలసటగా కూలబడ్డ నన్ను మెచ్చుకోలుగా చూశారు. కావా నా వైపు కృతజ్ఞతగా చూస్తున్నాడు.

అదే సమయంలో ఆ దీవంతా ఒక్కసారి కంపించింది. అదిరిపడి లేచి నిలబడ్డాను. ప్రొఫెసర్ గారి కళ్ళు అను మానంతో చిన్నవైనాయ్! ఆయన చేతిలోంచి బైనాక్యు లర్స్ లాక్కొని చుట్టూ చూశాను. ఏమీ కన్పించలేదు.

అంతలో దీవి మళ్ళీ కంపించింది. ఈసారి మరింత తీవ్రంగా కంపించింది.

ప్రొఫెసర్ గారు కంగారుగా అరిచారు. "విజయ్! తొందరగా మనం పడవను చేరుకోవాలి. మరి కాస్సేపట్లో దీవి సముద్రంలో మునిగిపోబోతుంది."

కావాను భుజంపై వేసుకొని పరిగెత్తాను. నన్ననుసరిం చారు ప్రొఫెసర్ గారు. బరువైన కావాను మోయడం కష్టంగా వుంది. భారంగా పడుతున్నాయి నా అడుగులు.

"దీవి మునిగిపోతుందని ఎలా చెప్పగలరు" పరిగెడుతూ అడిగాను.

"సింపిల్. సాధారణంగా సముద్రంలోని ఇలాంటి చిన్న దీవులు ఒకచోట స్థిరంగా వుండవు. ఒకచోట మునిగి సముద్రగర్భంలో ప్రయాణించి ఇంకోచోట తేలు తుంటాయ్. అంతేకాదు సముద్రంలో దీవులు తగిన కారణం లేనిదే ఎప్పుడూ కంపించవు. ఇలా రెండు మూడుసార్లు

కంపించిందంటే, అది త్వరలో మునిగిపోతుంది'' అన్నారు ప్రొఫెసర్ గారు.

రెండు నిముషాలలో పడవను చేరుకొన్నాము. మరుక్షణంలో దీవి మరోసారి తీవ్రంగా కంపించి నీటిలో మునిగిపోయింది. పడవను ముందుకు పోనిచ్చాను.

## 12

ఎవరో బలంగా కుదుపుతోంటే బద్ధకంగా కళ్ళు తెరిచాను. చుట్టూ వున్న వాతావరణం చూసేప్పటికి బద్ధకం ఎగిరిపోయింది. కంగారుగా లేచి కూర్చొన్నాను.

ఎప్పుడూ తెల్లకాంతితో పాలిపోయినట్లుండే ఆకాశం నిండా నల్లటి మబ్బులు ముసురుకొన్నాయి. ఏ క్షణంలో నన్నా కుంభవృష్టి కురవ్వచ్చనిపిస్తోంది. చల్లగా గాలి వీస్తూంటే సముద్ర తరంగాలు ఎగిరెగిరి పడుతున్నాయి. పడవ కెరటాల వరవడికి తట్టుకోలేక ఊగిసలాడుతోంది.

చూస్తూండగానే ఉరుములూ, మెరుపులతో తుఫాన్ మొదలైంది. ఒక్కసారిగా మెరసిన మెరుపుతో మా కళ్ళు బైర్లుకమ్మాయి. చకచకా సామానులు సర్దుకొని వీపులకు కట్టుకొన్నాము. హావా చుక్కాని వద్ద కూర్చొని వరిగిపోతున్న పడవను అదుపులో పెట్టటానికి ప్రయత్నిస్తున్నాడు.

అప్పుడప్పుడూ మెరుస్తోన్న మెరుపులు తప్ప కన్ను పొడుచుకున్నా కన్పించని కారు చీకటిలో సముద్రం విలయతాండవ మాడుతోంది. ఉరుము శబ్దానికి చెవులు గళ్ళెక్కపోతోంటే, హోరుమంటూ వీస్తున్న చలిగాలి మా శరీరాన్ని కొరికేస్తోంది.

గాలికి తట్టుకోలేక తెరచాప రెపరెపలాడుతూ ఏ క్షణాన్నైనా చిరిగిపోయేటట్లుండటం చూసిన ప్రొఫెసర్

గారు దాన్ని క్రిందకు దింపేయటానికి పరిగెత్తారు.

కొయ్యరాట పట్టుకుని త్రాడు ముడి విప్పబోతున్న ప్రొఫెసర్ గారి దృష్టి అప్పుడే బయలుదేరిన 'విద్యుత్ కాంతి పుంజం' పై నిలిచింది.

విష్ణుచక్రంలా గిరగిరా తిరుగుతూ విద్యుచ్ఛక్తితో తెల్లగా మెరిసిపోతూన్న ఆ 'కాంతి పుంజం' ప్రొఫెసర్ గారి వైపు దూసుకొచ్చింది. చటుక్కున క్రిందకు వంగారు ప్రొఫెసర్ గారు.

మరుక్షణంలో కొయ్యరాటను అడ్డంగా చీల్చివేస్తూ నా తలపైనుంచి దూసుకుపోయిందా 'కాంతి పుంజం.' రెండడుగులు పైకిలేచిన తెరచాప గాల్లో కెగిరిపోయింది.

దూరంగా వెళ్ళిపోయిన 'విద్యుత్ కాంతి పుంజం' గిర గిరా తిరుగుతూ వెనక్కి తిరిగి పడవవైపు తిరిగి రాసాగింది. చుక్కాని వదిలేసి కావా మా దగ్గరకు పరిగెత్తుకొని వచ్చాడు.

'ఇనపసామానులు సముద్రంలో పడేసి బోర్లా పడుకోండి' అరిచారు ప్రొఫెసర్ గారు.

పడవలో వున్న నాలుగైదు ఇనప ఊచలను, కొద్ది ఇనప సామానులను సముద్రంలోకి విసిరేసాము. అయస్కాంత శక్తి కలిగిన ఆ 'విద్యుత్ కాంతి పుంజం' ఇనప సామానులు సముద్రంలోకి మేము విసిరేయగానే గమ్యం మారి మరో వైపు దూసుకుపోయింది.

ప్రొఫెసర్ గారి దగ్గరున్న దిక్సూచి మా చేతినున్న వాచీలు అయస్కాంత శక్తికి ఆకర్షించబడి పాడయ్యాయి. చుక్కానిలేని పడవ సముద్రంలో దిక్కు తెలీకుండా కొట్టుకుపోతూంది.

సముద్ర కెరటాల తాకిడికి పడవ సగభాగం విరిగి

పోయింది. మేమున్న చెక్క దూరంగా కన్పిస్తున్న కొండరాళ్ళవైపు దూసుకు వెళ్తోంది.

అప్పుడు చూసాను దూరంగా నిలువెత్తు లేస్తోన్న కెరటాన్ని. చివరిసారిగా భగవంతుని తల్చుకుంటూ కళ్ళు మూసుకున్నాను.

# 13

ఎవరో పిలుస్తోంటే లేచాను. ఎదురుగా ప్రొఫెసర్ గారూ కావా ఆత్రంగా చూస్తున్నారు. నేను కళ్లు తెరవగానే వారికళ్ళు మెరిశాయి. నెమ్మదిగా లేచి కూర్చున్నాను.

పైన ఆకాశం యథాస్థితిలోనే వుంది. ఫ్లోరోసెంట్ లాంప్‌లా తెల్లగా వెలుగునిస్తోంది. అక్కడక్కడ చిన్న చిన్న మేఘాలు కంగారుగా పరిగెడుతున్నాయి.

సముద్రపు అలలు వేగంగావచ్చి మేం పడివున్న బండరాళ్ళను తాకుతున్నాయి బలంగా. తల త్రిప్పి చుట్టూ చూశాను. కొంచెందూరంలో ఇసకా, మరికొంచెందూరంలో తీరంపొడుగునా కనుచూపుమేరా రాతిగోడా వుంది.

నా శరీరాన్ని అదుపులోకి తెచ్చుకొనేసరికి అరగంట పట్టింది. మరికాస్సేపట్లో కాలకృత్యాలు తీర్చుకొని బ్రేక్‌ఫాస్ట్ కావించాము. కావా తిరిగి చెక్కను రిపేర్ చేయటంలో పడగానే, నేనూ ప్రొఫెసర్‌గారూ తీరంవెంబడి బయలుదేరాము.

కొంచెముందు నడుస్తున్న ప్రొఫెసర్‌గారు ఒకచోట ఆగిపోయారు. వారివైపు ప్రశ్నార్థకంగా చూశాను.

"ఫాసిల్స్" (అవశేషాలు) అన్నారు ఒకవైపు చూపిస్తూ. వెంటనే అక్కడకు నడిచాము. రకరకాల జంతువుల ఫాసిల్స్ చెల్లాచెదురుగా పడివున్నాయి. వాటి రూపురేఖలు చూస్తూంటే ఒకొక్కజంతువూ కొన్ని లక్షల

సంవత్సరాల క్రితందని తెలుస్తూంది. వాటిలో కొన్నింటిని వివరించారు ప్రొఫెసర్ గారు.

"స్టాల్లోపోసు చస్, ప్లెటో సార్స్, థెరోపోడ్స్, అల్లోసార్స్, గేంగీస్, డైనోసార్స్, డిప్లొకోడస్, బ్రోంటో సార్స్, యిగ్వానోడన్, సెరాటోప్సియన్స్, ప్రోట్రోసెరా ట్రోప్స్" అంటూ చెప్తోంటే చాలా ఆశ్చర్యంగా చూశాను. కెమెరా పైకితీసి చకచకా ఫోటోలు తీసారు ప్రొఫెసర్ గారు. తిరిగి బయలుదేరాము. ముందుకు నడుస్తూ అన్నాడు ప్రొఫెసర్ గారు.

"ఒకవిధంగా చెప్పాలంటే ఇవన్నీ డైనోసార్స్ జాతికి సంబంధించినవే! ఇవికూడా కొన్ని లక్షల సంవత్సరాల క్రితం భూమిమీద బ్రతికినవే! భూమిమీద నరుడు పుట్టక ముందే ఏర్పడిన జంతువుల సముదాయంలోనివి ఇవి. భూమ్మీద ప్రతీ జంతువూ దీనికి భయపడేది. అందుకే జంతువులకి రాజు కాగలిగింది ఈ డైనోసార్స్. కాని ఒక విచిత్రం. ఈ డైనో సార్స్, దాని కుటుంబానికి చెందిన ఈ జంతువులూ అన్నీ కేవలం శాఖాహారులు మాత్రమే. మాంసాహారులను చూస్తే వాటికి మంట" చెప్తున్న ప్రొఫె సర్ గారు ఆగారు.

నా కళ్ళముందు ఎనభై అడుగుల ఎత్తున్న డైనోసార్సు లీలగా కన్పిస్తోంది. కొంతదూరం పోయేప్పటికి కొద్దిగా పల్లప్రాంతంలో ఉన్న చెట్లవెపు ఆశ్చర్యంగా చూస్తూ తొందరగా నడిచాము.

నడుస్తున్న ప్రొఫెసర్ గారు చటుక్కున ఆగి నా చెయ్యి పట్టుకున్నారు. వారి చెయ్యెందుకో చిన్నగా ఒణుకుతోంది. వారు చూస్తున్నవైపు చూసాను. నాగుండె ఝల్లుమంది.

అడవిలావున్న చెట్లమధ్య కొంతదూరంలో పెద్ద పెద్ద ఖడ్గమృగాలవంటి జంతువులు నేల మొదళ్ళలో పొడిచి విరగగొడుతున్నాయ్! వాటికి కొంచెందూరంలో ఒక ఆజానుబాహుడు భుజంపై రాతిగదవంటిది పెట్టుకుని వాటిని అదలిస్తున్నాడు.

'ఒళ్ళంతా బొచ్చు, చిన్న తల, ముందుకు పొడుసుకు వచ్చిన నుదురు, పెద్ద దవడ ఎముకలు.' నియాండర్ గల్ (అనాది) మానవుడిలా ఉన్నాడు. ప్రొఫెసర్ గారి చేతిలోని కెమెరా 'క్లిక్' మంది.

చప్పుడు కాకుండా దూరంగా వచ్చేశాక హాయిగా ఊపిరి పీల్చుకొన్నారు ప్రొఫెసర్ గారు. తిరిగి మేము సముద్రం ఒడ్డుకు చేరుకొనేసరికి 'కావా' పడవను బాగు చేశాడు.

# 14

సముద్రపు ఒడ్డునే దూరంగా కన్పిస్తున్న రాతిగోడ వైపు నడిచాము. తీరం పొడుగునా ఉంది రాతిగోడ. గ్రానైట్ రాతిని పరీక్షిస్తూ నడుస్తున్న నేను కాళ్ళకు ఏదో తగిలి బోర్లా పడబోయి నిలదొక్కుకున్నాను. క్రిందకు చూసాను. పిడి బాకు. చటుక్కున వంగి దాన్నందుకొన్నాను. బాకు కిలంతో నల్లబడిపోయినా, పిడి మాత్రం తెల్లగా మెరుస్తోంది. దానిపై 'కింగ్ అయిరన్ వర్క్స్ ఐర్లండ్' అన్న అక్షరాలు తళతళా మెరుస్తోన్నాయి.

దానిని చూడగానే ప్రొఫెసర్ గారి భృకుటి ముడి పడింది. "ఈ బాకు ఇక్కడకు వచ్చిందంటే ఇక్కడకెవరో వచ్చి ఉండాలి. అదీ ఐర్లండు నివాసి" ఆలోచిస్తున్న ఆయన మదిలో ఫిలిఫ్స్ జె అడ్వార్డ్ మెదిలాడు.

'బహుశా, అదే జరిగి ఉండొచ్చు. అంటే ... ఫిలిప్స్

జె అడ్వర్డ్ ఈ ప్రాంతం వచ్చాడన్నమాట. అయితే ఇటు నుంచి ఎటువైపు వెళ్ళి ఉంటాడు' ఆలోచిస్తూ రాతి గోడను పరిశీలిస్తూ ముందుకు నడుస్తున్న ప్రొఫెసర్ గారు ఆగిపోయారు ఒకచోట.

ఆయన నిలచినచోట, లోగడ, ఒక సొరంగ మార్గం ఉండేదని స్పష్టంగా తెలుస్తోంది. కాని కాలక్రమాన ఏ భూకంపం వలన ఆ సొరంగానికు అడ్డుగా పెద్ద బండరాయి పడిఉంటుంది. అందుకే మనిషి దూరటానికి కూడా సందు లేకుండా ఆ బండరాయి అడ్డుగా ఉంది.

ఆయన నావైపు తిరగగానే ప్రశ్నార్థకంగా చూసాను నేను.

"ఈ బండను మనం శక్తితో కదిలించలేం విజయ్" అన్నారు ఆలోచిస్తూ.

నా తలలో ఒక ఆలోచన మెరిసింది.

"ఓ పని చేస్తే?" అన్నాను అకస్మాత్తుగా. ఆసక్తిగా చూసారు ప్రొఫెసర్ గారు.

"మన సంచిల్లో కొన్ని డైనమేట్‌లు ఉన్నట్లు గుర్తు" అన్నాను ఆలోచిస్తూ.

"యస్...వచ్చేటప్పుడు రెండు తీసుకొచ్చాం."

"వెల్ వాటిలో వకదానికి పని కల్పిద్దాం."

రెండునిముషాలు తీవ్రంగా ఆలోచించి,'ఓ.కె'అన్నారు.

ప్రొఫెసర్ గారి బాగ్ అడుగునున్న డైనమేట్లలో ఒకటి అందుకొన్నాను. రాతిబండ దగ్గరగా నడిచి రెండు నిము షాలు పరీక్షగా చూసాను. డైనమేట్‌ను సొరంగంలో పలికి, చేయి ఇరికించి ఉంచి వత్తిని దూరంగా పరుచుకొచ్చి అంటించి సముద్రవడ్డున ఉన్న పడవ వద్దకు పరిగెత్తాను.

ఎగిరి పడవలోకి దూకి మిగిలిన ఇద్దరిలాగే చెవుల్లో

వ్రేళ్ళు బిగించి క్రిందకు వంగాను. 'ఢన్' మంటూ పెద్ద శబ్దంతో ప్రేలింది డైనమేట్. బండరాయి రెండుగా బ్రద్దలయి దొర్లుకొంటూ దూరంగా పోయింది.

మరుక్షణంలోనే మేం ఊహించని ప్రమాదం ఏర్పడింది. డైనమేట్ ప్రేలుడుకు భూమి అదిరి, భూకంపంగా మారింది. భూకంప వత్తిడి సముద్రంపై చూపడంతో సముద్రం పొంగింది. మేము పడవలోంచి దిగబోయేలోపలే నీరు పడవను పైకెత్తేస్తూ క్రొత్తగా ఏర్పడిన సొరంగంలోకి ప్రచండ వేగంతో జొరబడింది.

మేం నిస్సహాయ స్థితిలోంచి తేరుకొనే టప్పటికే పడవలోని బాగ్‌లు, అన్ని వస్తువులు చెల్లాచెదురై క్రిందకు పడిపోయాయి. పడవ నీటి వేగానికి తట్టుకోలేక గిరగిరా తిరుగుతూ ముందుకు దూసుకుపోతున్నదల్లా ఆగి వక్కసారిగా పైకి లేచింది. క్షణాలలో కొన్ని వందల అడుగుల ఎత్తుకు పోయాము.

అప్పటివరకూ క్రింద పరవళ్ళు త్రొక్కిన నీరు వేడెక్కి బురబుర లాడసాగింది. పైకి దూసుకుపోతున్న పడవ, పడవ క్రింద మరుగుతున్న నీరు. అరగంట గడిచింది. రానురానూ వేగం పెరుగుతోంది. వేగానికి తట్టుకోలేక నా కళ్ళు తిరుగుతున్నాయి.

# 15

"ఆహారం ఏమయినా మిగిలిందా?" నీరసంగా అడిగారు ప్రొఫెసర్ గారు.

'ఊహూ' తల అడ్డంగా తిప్పాను.

"ప్రస్తుతం మీ చేతుల్లో ఉన్న కెమెరా, నా చేతుల్లో ఉన్న ఈ వాటర్ బాటిల్ తప్ప ఏదీ మిగల్లేదు"అన్నాను నిస్సహాయంగా.

ప్రొఫెసర్ కొన్ని క్షణాలు మాట్లాడలేదు.

"సుమారు నూటేభై మైళ్ళు వచ్చుంటాము" వేగాన్ని బట్టి లెక్కకడుతూ అన్నారు ప్రొఫెసర్ గారు. పోను పోనూ చుట్టూవున్న గోడలు వేడెక్కుతున్నాయి.

తళతళా మెరిసే గ్రాఫైట్ గోడలు బదులు పచ్చగా మెరుస్తున్న గంధకపు గోడలు ఏర్పడుతున్నాయి. పొగలు రగులుతోంటే ఊపిరి పీల్చటం కష్టమౌతూంది.

"మైగాడ్...అగ్ని పర్వతం" అరిచారు ప్రొఫెసర్ గారు.

అప్పుడర్థమైంది మా పడవక్రింద మరుగుతున్నది నీరు కాదు లావా అని. ఏ క్షణానైనా ఏ గోడనో గుద్దుకుని మా ప్రాణాలు పోవచ్చు లేకపోతే ఉన్న ఫళంగా పడవ వేడికి విడిపోయి మేం లావాలో కల్సిపోవచ్చు. మాకు ప్రాణాలపై ఆశపోయింది. రానురానూ ఆక్సిజన్ తగ్గిపోయి పొగ ఊపిరి తిత్తులలోకి ప్రవేశించడం వలన ఊపిరి తిత్తులు పగిలిపోయేలాగున్నాయ్!

ఏ క్షణంలోనైనా మా వంటిమీద వున్న దళసరికోట్లు, బట్టలు వేడికి తట్టుకోలేక అంటుకుపోవచ్చు. ఆ బట్టల వెనక దాగిన మా శరీరాలు ఉడికిపోతున్నాయ్!

కళ్ళు బయటకు వచ్చే స్థితిలో వుంటే నాలుక పిడుచ కట్టుకుపోయి పగిలిపోయేలాగ వుంది. గంధకపు వేడికి మా తలవెంట్రుకలు నిలబడి ఎవరో పీకుతున్నంత బాధగా వుంది.

ముఖమంతా నల్లగా మాడింది. కళ్ళు మండుతున్నాయ్. వళ్ళంతా చెమటలతో తడిసిపోయింది. లావా వేడికి పడవ అడుగు భాగం అంటుకుంది. శరీరం నలుపు రంగుకు తిరిగింది.

అదే సమయంలో,

చల్లగా, చిన్నగా గాలి వీచింది. వేడి కొద్దిగా తగ్గింది. ఒక్కసారిగా తలపై నక్షత్రాలు ఫక్కుమన్నాయి. మరు క్షణంలో పడవ విసురుగా పైకిలేచి ఆ అగ్ని పర్వతం బిలంనుంచి పైకి దూసుకుపోతూ మమ్మల్ని ప్రక్కకు విసి రేసింది.

పడవ వెనకే బయటకు ధారగా దూకిన లావా మరో దారమ్మట క్రిందకు ప్రవహించింది.

అగ్నిపర్వతం చిన్నగా ఉరుముతోంది. ఉన్నట్లుండి బయటకు వస్తున్నలావా ఆగిపోయింది. తాత్కాలిక ప్రశాం తత ఏర్పడింది.

*　　　*　　　*

లేచి నిలబడ్డాము ముగ్గురం.

చుట్టూ పరిశీలించి చూస్తూ అన్నారు ప్రొఫెసర్ గారు.

"భూగర్భ కేంద్రానికి ఐస్‌లాండ్‌లోని స్నో ఫెల్ అగ్ని పర్వతంలోంచి బయలుదేరిన మనం మధ్యదారినుంచే అగ్నిపర్వతంలోంచి జపాన్ చేరుకొన్నాం."

కావా నేనూ ఆశ్చర్యపడ్డాం.

"వాట్! ఇది జపానా, ఎలా చెప్పగలరు?"

"జపాన్‌లో అగ్నిపర్వతాలెక్కువ విజయ్!"

చుట్టూ పరిశీలించాను. అగ్నిపర్వతాలు అస్పష్టంగా కన్పిస్తున్నాయి. జపానులో అగ్నిపర్వతాలెక్కువ అన్న ప్రొఫెసర్ గారి మాటలు నాలో ప్రతిధ్వనించాయి.

"అయితే ఇండియాకు దగ్గరలోనే వున్నాము" అంటూ పర్వతపు అంచుకుపోయి దిగువకు చూసాను. దూరంగా ఏదో ఊరున్న సంగతి తెల్పుతూ దీపాలు మినుకు మినుకు మంటున్నాయి.

ఆనందంతో గంతులేయాలన్పించింది నాకు. ఇక చూడ ననుకొన్న మనుషుల్ని తిరిగి చూడబోతున్నాను. ప్రాణా లతో నా దేశం చేరుకోలేననుకున్న నేను త్వరలోనే నా దేశం చేరుకోబోతున్నాను.

నా ఆలోచనలకూ అనందానికీ భంగం కలిగిస్తూ అన్నారు ప్రొఫెసర్ గారు:

"వెల్. చివరికి మన భూగర్భ సాహసయాత్ర ఇలా ముగిసిందన్న మాట. అదృష్టం బాగుండి ప్రాణాలతో బయట పడ్డాము. మన భూగర్భ సాహసయాత్రలో జరిగిన ప్రతీ సంఘటనకూ గుర్తు ఈ కెమెరా, ఈ నాలుగురీళ్ళు! ఇక కదలండి. త్వరగా మనం ఈ ప్రదేశం వదిలి వెళ్ళి పోవటం మంచిది. ఈ అగ్నిపర్వతాలు ఒక్కసారిగా ప్రేలవ్. క్రొద్ది క్రొద్దిగా ప్రేలుతుంటాయ్! మరో అర గంటలో మళ్ళీ ప్రేలొచ్చు!"

అంటూ చేతిలోని కెమెరా ఊపుకుంటూ క్రిందకు కది లారు ప్రొఫెసర్.

ఆయనను మౌనంగా అనుసరించాము హావా, నేనూ.

—: ఐపోయింది : —

# కపట మనిషి

## టెంపోరావ్

ఎనిమిది దాటింది. హాల్లో రెండు ఫ్లోరసెంట్ లైట్లు ప్రకాశిస్తున్నాయి. తెరచిన కిటికీల్లోంచి చల్లటి గాలి వీస్తోంది.

గ్లాసులో మళ్ళీ విస్కీ పోసి, కొద్దిగా సోడా కలిపాను. విస్కీ తాగుతూ, సిగరెట్ పీలుస్తూ గుమ్మంకేసి చూశాను. వంటతను కృష్ణయ్య నవ్వుతూ నాకేసి చూస్తున్నాడు.

"పార్వతి ఇంకా రాలేదా!" అన్నాను.

"దేవాలయంలో ఆలస్యమై వుంటుందిసార్. ఈపాటికి వస్తూవుంటారు!" అన్నాడతను.

పక్కింటి సావిత్రమ్మతో స్నేహం అయ్యాక పార్వతికి దేవాలయాల పిచ్చి ఎక్కువైంది. ప్రతి రోజూ ఏదో దేవా

లయానికి వెళ్ళి తిరిగొచ్చి ప్రసాదాన్ని అందర్కీ ఇస్తూ వుంటుంది.

టెలిఫోన్ మ్రోగింది. వెళ్ళి రిసీవర్ని అందుకున్నాను. అటువైపునుంచి ఇన్‌స్పెక్టర్ నాయర్ కంఠం వినపడింది.

"హలో, నాయర్ భాయ్!"

"బ్రదర్, వెంటనే రాగలవా?"

"ఎక్కడికి?"

"అందమైన ఒకమ్మాయి నూతిలోపడి మరణించింది. శవాన్ని బయటకు లాగాం. ఆమె ముఖాన్ని చూడగానే నీకు ఫోన్ చెయ్యాలనిపించింది!"

"ఆత్మహత్యా?"!

"ఇంకా ఏమీ తెలియదు."

"నువ్వెక్కడున్నావు?"

నాయర్ చెప్పాడు. వస్తున్నానని చెప్పి రిసీవర్ని పెట్టేశాను.

గ్లాసులోని విస్కీ తాగేసి మరో సిగరెట్ వెలిగించాను. కోటు తొడుక్కుని గబగబా మెట్లు దిగాను. కిందనున్న క్రిష్ణయ్యకేసి ఓరగా చూశాను.

"పనిమీద వెళ్ళానని పార్వతితో చెప్పు!" అని షెడ్డు వైపు పరుగెత్తాను.

డాడ్జి కారును స్పీడుగా పోనిచ్చాను. పల్లివాకం ప్రాంతంలో గ్రౌలుపట్లాల ప్రక్కనేవుందా నుయ్యి. పోలీస్ జీప్ వెనకనే డాడ్జికారును ఆపాను. కారు దిగి నూతివైపు నడిచాను. ఎలక్ట్రిక్ లైట్లులేవు. టార్చికాంతిలో లోన చూసుకుంటూ వెళ్ళాను. నూతి పక్కన పెట్రోమాక్స్‌లైట్ వెలుతోంది. ఇన్‌స్పెక్టర్ నాయర్ గబగబా వచ్చి నా చెయ్యి పట్టుకున్నాడు.

పెద్ద నుయ్యి. దగ్గరగా వెళ్ళి కిందకి చూశాను. నీళ్ళు కనపడ్డాయి. పెట్రోమాక్సు లైట్ కాంతిలో నూతిపక్క పడున్న శవాన్ని చూశాను. ఆమె వయస్సు ఇరవైలోపు వుంటుంది. కాటన్ చీర, తెల్ల జాకెట్ ధరించింది. చీర కిందున్న పాదం కనిపిస్తోంది. పొట్ట బాగా వుబ్బింది. ముఖం వికృతంగా మారింది.

ట్రెయిన్ కూత వినపడింది. కాస్సేపట్లో మా పక్క నున్న పట్టాలమ్మట ఏదో రైలుబండి దూసుకుపోయింది. టైమ్ చూశాను. ఎనిమిదిన్నరైంది. నీలగిరీ ఎక్స్‌ప్రెస్ అయి వుండాలి!

సిగరెట్ వెలిగించి పీలుస్తూ నలువైపులా చూశాను. దూరంలో ఇళ్ళున్నాయి. రెండు ఫర్లాంగుల దూరంలో విల్లివాకం స్టేషన్ లైట్లు కనిపిస్తున్నాయి. కానిస్టేబుల్సు నూతి దగ్గర నిలబడ్డారు.

"ఈమె యీ ప్రాంతంలో వుంటోందేమో!" అన్నాను.

కొందరు ప్రజలు దూరంలో నిలబడి నూతికేసి భయంతో చూస్తున్నారు.

"బ్రదర్, ఇంకా ఎవ్వరూ ఆమెను పోల్చలేదు," అన్నాడు నాయర్.

సమీపంలో నిలబడిన వాళ్ళవైపు నడిచాను.

"ఆమె ఎవరో మీకు తెలుసా?" అడిగాను.

"తెలియదు, సార్!" అన్నాడొకతను.

"ఈ నుయ్యి ఇక్కడెందుకుంది?"

"మూడేళ్ళ క్రితం నీళ్ళులేని సమయంలో ప్రభుత్వం యీ నూతిని తవ్వించింది. ఇది పబ్లిక్ బావి. ఎవరేనా ఇక్కడకొచ్చి బట్టలు వుతుక్కుంటూ వుంటారు," అన్నాడు మరొకతను.

శవం ఫోటోలు తీస్తున్నారు. ఆలోచిస్తూ పచార్లు చేస్తున్నాను. రోడ్డుమీద కారు ఆగిన చప్పుడైంది. కాని స్టేబుల్ పోలీస్ డాక్టర్‌ని మా దగ్గరకు తీసుకొచ్చాడు. డాక్టర్ ఛార్లెస్ నాతో కరచాలనం చేసి శవ పరీక్షకు ఉపక్రమించాడు.

సిగరెట్ పీలుస్తూ డాక్టర్ ముఖాన్ని గమనిస్తున్నాను. అతను ఆశ్చర్యంగా నా కేసి చూస్తూ లేచి నిలబడ్డాడు.

"మిస్టర్ పరశురామ్, ఈమెను ఎవరో అమానుషంగా రేప్ చేశారు. నూతిలో పడి నీళ్లు తాగి యీమె మరణించింది," అన్నాడు డాక్టర్.

"ఇది హత్య కావచ్చు!" అన్నాను.

"అవును బ్రదర్. రేప్ చేసి నతను యీమెను నూతిలోకి తోసేసి వుండొచ్చు," అన్నాడు నాయర్.

"అలా ఎందుకు చేస్తాడు?" అడిగాను.

"అత నామెకు పరిచయమైన మనిషి కావచ్చు. పరాయివాడైతే రేప్ చేసి పారిపోయేవాడు."

"యూ ఆర్ రైట్," అన్నాను సాలోచనగా.

* * *

పది దాటింది. ఐ. సి. ఎఫ్ కోలనీలోని ఒక ఇంటి ముందు కారాపి దిగాను. కొత్తగా కట్టిన డాబా ఇల్లు. ఇంటి చుట్టూ ప్రహరీ గోడకు బదులు పొడుగాటి మొక్కలున్నాయి. వీధి గేటు తలుపు కొబ్బరాకులతో నిర్మించబడింది. ఆకుల తలుపు వెనక్కి పడివుంది.

లోపలకు వెళ్ళాను. ముందున్న హాల్లో లైట్ వెల్గుతోంది. ఒకతను నావైపు అదోలా చూశాడు.

"మిస్టర్ రాజన్!" అన్నాను.

"నేనే సార్," అన్నాడతను.

ముందు గదిలోకి వెళ్ళాను. మధ్య తరగతి కుటుంబం. పేము కుర్చీ చూపించి అతను నన్ను కూర్చోమన్నాడు.

ఒక స్త్రీ లోపలి గుమ్మంలో నిలబడివుంది.

"మీ అమ్మాయి ఫోటో వుందా?"

"పద్మా, అమ్మాయి ఫోటో పట్రా!" అన్నాడతను.

కాన్సెపట్లో ఫ్రేమ్ కట్టిన ఒక ఫోటోను ఆమె అతని కిచ్చింది. గ్రూప్ ఫోటో. అందులో వున్న కూతురువైపు అతను చూపించాడు. ఆమె ఫోటోను చూసి తృళ్ళిపడ్డాను. నూతి పక్క పడున్న శవం నాకు గుర్తుకొచ్చింది!

"మీరు ఏం చేస్తున్నారు?"

"ఐ. సి. ఎఫ్‌లో పనిచేస్తున్నాను."

"ఈ ఇంట్లో ఎంత కాలంనుంచి వుంటున్నారు?"

"గృహప్రవేశం చేసి ఇంకా సంవత్సరం కాలేదు. ప్రావిడెంట్ ఫండ్ మీద అప్పుచేసి ఇల్లు కట్టించాను."

"మీ అమ్మాయి ఏం చేస్తోంది?"

"కాలేజిలో పీ. యూ. చదువుతోంది. ప్రతి రోజూ ట్రెయిన్‌లో సెంట్రల్‌కి వెళ్ళి అక్కడనుంచి బస్సులో కాలేజికి వెళ్ళివస్తుంది."

అతని కేసి సూటిగా చూశాను.

"మిస్టర్ రాజన్, మీ అమ్మాయి చనిపోయిందని చెప్పడానికి చాలా విచారిస్తున్నాను," అన్నాను.

ఫోటో పట్టుకొచ్చినామె ఏడుస్తూ లోపల కెళ్ళింది. రాజన్ కన్నీళ్ళతో నా వైపు చూశాడు.

"మా అమ్మాయి రేవతి నిజంగా మరణించిందని మీకు తెలుసా?"

"విల్లివాకం స్టేషన్‌కి రెండు ఫర్లాంగుల దూరంలో వున్న నూతి పక్కనే రేవతి శవం పడుంది. మీరు నాతో వస్తే చూపిస్తాను."

అతను లేచాడు. లోపలకు వెళ్ళి చొక్కా తొడుక్కుని వచ్చాడు. అతను కార్లో కూర్చున్నాక తలుపు మూసి కారును పోనిచ్చాను.

పక్క కూర్చున్న అతని కేసి ఓరగా చూశాను.

"ఆమె విల్లివాకంలో దిగి ఇంటికి వస్తూ వుండేదా?"

"అవును, సార్. ఆ స్టేషన్ కి మా ఇల్లు దగ్గరలో వుంది."

విల్లివాకం రోడ్డమ్మట కారు కదుల్తోంది.

"అమ్మాయి ఎవర్నైనా ప్రేమించిందా?"

అతను కోపంగా నాకేసి చూశాడు. కారును ఆపాను. ఇద్దరం దిగాం.

నూతి దగ్గరకు నడిచాం. రేవతి శవం స్ట్రెచర్ మీదుంది.

"యాంబులెన్స్ వచ్చింది. పోస్ట్ మార్టమ్ కి పంపుదాం అనుకుంటున్నాను!" అన్నాడు ఇన్ స్పెక్టర్ నాయర్.

శవాన్ని చూసి రాజన్ పిచ్చిగా అరిచాడు. ఏడుస్తూ నేలమీద కూలిపోయాడు.

"ఆమె తండ్రి మిస్టర్ రాజన్," అన్నాను ఇన్ స్పెక్టర్ నాయర్ తో.

అతడిని నాయర్ కి అప్పగించి కారులో వెళ్ళిపోయాను. రాజన్ ఇంటిముందు మళ్ళా కారాపి దిగాను. ముందు గదిలోకి వెళ్ళాను. రేవతి తల్లి ముందు గదిలో కూర్చుని ఏడుస్తోంది. ముగ్గురు పిల్లలు ఆమె పక్కనే కూర్చుని విలపిస్తున్నారు.

ఎదురుగా నిలబడి ఆమె కేసి సూటిగా చూశాను. "రేవతికి అన్యాయం జరిగింది. ఎవరో ఆమెను రేప్ చేసి నూతిలోకి తోసేశారు!" అన్నాను.

"ఆ దుర్మార్గుడితో తిరగొద్దని చెప్తే వినలేదు!" అందామె.

"ఎవరతను?"

"బాజీరావు."

"అత నెక్కడుంటున్నాడు?"

ఆమె లోపలకు వెళ్ళింది. ఒక బౌండు పుస్తకాన్ని తెచ్చి నాకిచ్చింది. అట్టమీద బాజీరావు అడ్రెస్ రాసి వుంది. అతను మైలాపూరులో వుంటున్నాడు.

"దీన్ని గురించి ఆయనకు చెప్పకండి! నాకు తెలిసినా ఆయనకు తెలియకుండా దాచాను," అందామె.

"ఇది మీ భర్తతో చెప్పకంటే ఆమె కలాంటి దుర్మరణం సంభవించేది కాదేమో!" అన్నాను.

"ఆయన హార్ట్ పేషెంట్, ఇటువంటి దేదేనా వింటే గుండె ఆగిపోతుందని నాభయం."

వెనక్కి తిరిగి బయటకొచ్చాను.

"ఆయన అక్కడే వున్నారా?" అడిగిందామె.

"కాస్సేపట్లో పోలీసు జీప్ లో ఆయనిక్కడి కొస్తారు," అని కారు వైపు నడిచాను.

కారులో కూర్చుని సిగరెట్ వెలిగించాను. నలువైపులా చూశాను. అన్నీ కొత్త ఇళ్ళు. ఐ. సి. ఎఫ్ కోలనీ ఇళ్ళలోని వాళ్ళు లైట్లు ఆర్పేసి సుఖంగా నిద్రపోతున్నారు.

కారును పోనిచ్చాను. పట్టాలమ్మట ఏదో ట్రెయిన్ వెళ్తోన్న ధ్వని వినపడ్తోంది. ఎవరు చచ్చినా రైళ్ళు ఆగవు, కదుల్తూనే వుంటాయి!

మైలాపూర్ వీధుల్ని చూస్తూ కార్ని పోనిస్తున్నాను. ఆర్కుగం వీధి బోర్డు చూసి కార్ని కుడివైపుకు తిప్పాను. నంబర్ 12 ఇంటిముందు కారాపాను.

వీధి దీపాలు వెలుగుతున్నాయి. బాజీరావు కోసం తలుపు తట్టి అందర్నీ లేపాలి! కార్లోంచి దిగాను. నోళ్ళు చప్పుడై ఆగాను. ఎవరో కారువైపు నడిచి వస్తున్నారు.

"మిస్టర్, ఏంకావాలి?" అన్నాడతను.

అతనికేసి సూటిగా చూశాను. పొట్టిగా, లావుగా వున్నాడు. పొడుగాటి సైడ్‌లాక్స్, పెద్ద మీసాలు, వైట్ పాంట్, స్లాక్ ధరించాడు. కాళ్ళకు స్లిప్పర్స్ వున్నాయి. ఎడిచేతికి డేట్ సెట్ వాచ్!

"బాజీరావు నువ్వేనా?"

"నేనే!" అన్నాడతను.

అతని వైపు సీరియస్‌గా చూశాను.

"విల్లివాకం నుంచి రావడానికి ఇంత ఆలస్యమైందా?" అన్నాను చటుక్కున.

"ఏమిటి మీరనేది?" అన్నాడు ఆశ్చర్యంగా.

"ఎక్కడనుంచి వస్తున్నావు?"

"సినిమాకెళ్ళి, బీచ్‌లో కాస్సేపు ఫ్రెండ్‌తో కూర్చుని వస్తున్నాను."

"ఎవరా ఫ్రెండ్?"

"రాఘవన్. రాయపేటలో వుంటున్నాడు."

"రేవతి నిన్న సాయంత్రం మాయమైంది. ఆమెను నిన్న కల్సుకొన్నావా?"

కాస్సేపు అతను మాట్లాడలేదు. బాధలో నా వైపు చూస్తూండి పోయాడు.

"రేవతి దొరికిందా?"

"నా ప్రశ్నకు జవాబియ్యి."

"నిన్న ఆమెను కల్సుకొన్నాను. కాలేజి బయట ఇద్దరం కలుసుకొన్నాం. మెరీనా కేంటీన్‌లో టిఫిన్ తిని

కాస్సేపు బీచ్‌లో కూర్చున్నాం. తర్వాత ఆమెను బస్సెక్కించి నేను ఇంటికి వెళ్ళిపోయాను,'' అన్నాడు బాజీరావు.

''నువ్వు నాతో రావాలి!''

''ఎక్కడకి సార్?''

''కార్లో కూర్చో,'' అన్నాను అధికారంతో.

అతను కార్లో కూర్చుని తలుపు మూశాడు. కారును మెల్లిగా పోనిచ్చి మెయిన్ రోడ్డుకి తిప్పాను.

''మిస్టర్ బాజీరావు, నువ్వు ఏం చేస్తున్నావు?''

''వుద్యోగం కోసం వెతుకుతున్నాను. బి. ఎ. పాస య్యాను. ఇంకా చదవడానికి డబ్బు లేదు.''

''రేవతితో నీకెలా పరిచయమైంది?''

''ఒకరోజు ఆమెను బీచ్‌లో చూశాను. ఆమె నన్ను ఎంతో ఆకర్షించింది. అటుపైన బస్టాప్‌లో ఆమె కోసం నిలబడే వాడ్ని. అలా దగ్గరయ్యాను.''

''ఆమెను పెళ్ళాడాలనుకున్నావా?''

''పెళ్ళాడాలనే నా వుద్దేశం.''

సడన్‌గా కార్ను ఆపాను. అతనికేసి చూశాను.

''రేవతిని ఎవరో రేప్ చేశారు. నూతిలో పడున్న ఆమె శవాన్ని పోలీసులు పైకి లాగారు,'' అన్నాను.

బాజీరావు వెక్కి వెక్కి ఏడ్వసాగాడు. కారును పోనిచ్చాను.

''పువ్వులాంటి ఒక అమాయకపు యువతి జీవితాన్ని ఎవడో దుర్మార్గుడు నలిపి పారేశాడు. వాడెవడో కను క్కుని చిత్రవధ చేస్తాను,'' అర్చాడతను.

అతను నటించడం లేదనిపించింది. అతని చెయ్యి పట్టు కున్నాను.

"నిన్న రాత్రి ఆమె ఏ బస్సెక్కింది?"

"సెంట్రల్ స్టేషన్‌కి వెళ్లే బస్, సార్."

నా మెదడులో ఆలోచనలు తిరుగుతున్నాయి. రేవతి హుషారుగా అతనితో మాట్లాడింది. బస్టాప్‌కి కూడా వెళ్లి అతను బస్సెక్కించాడు. సెంట్రల్లో బస్సు దిగి ఆమె ట్రెయిన్‌లో విల్లివాకం వెళ్ళాలి. సెంట్రల్లో మరెవరేనా ఆమెను కల్సుకున్నారా?

కారు నలభై కిలోమీటర్ల స్పీడులో వెళ్తోంది.

"రేవతి నీకన్నివిధాలా దగ్గరేందా?"

"మనసారా ఆమెను ప్రేమించాను, సార్. ఆమెను నేనెప్పుడూ ముట్టుకోలేదు. మాట్లాడుకునే వాళ్లం."

రేవతిని మరెవరో బలాత్కరించి వుండాలి. ట్రెయిన్ ఎక్కేముందో, ట్రెయిన్‌లోనో ఎవరో ఆమెను కల్సుకుని ఎక్కడకో తీసుకుపోయి వుండాలి!

జనరల్ హాస్పిటల్ ముందు కారు ఆపాను. ఇన్‌స్పెక్టర్ నాయర్ జీప్ గోడ్డు వారగా వుంది. ఒక కానిస్టేబుల్ నా కారువైపు పరుగెత్తు కొచ్చాడు.

"ఇతనికి శవాన్ని చూపించండి," అన్నాను బాజీరావు కేసి చూపిస్తూ.

అతను కార్లోంచి దిగాడు. కారుచుట్టూ తిరిగి నేను కూర్చున్న వైపుకి వచ్చాడు.

"నీకేదేనా తెలిస్తే వెంటనే యీ నెంబర్‌కి ఫోన్ చెయ్యి!" అని అతనికి నా కార్డు ఇచ్చాను.

స్ట్రీట్ లైట్ కాంతిలో అతను చూశాడు. గౌరవ పూర్వకంగా నాకు నమస్కరించాడు.

"పరశురామ్‌గారూ, రేవతి మంచి పిల్ల. ఈ ఘోరం ఎలా జరిగిందో కనుక్కోండి!" అన్నాడతను.

"అదే పనిలో వున్నాను," అని కార్ను పోనిచ్చాను.

* * *

టైమ్ పది దాటింది.

టిఫిన్ తిని, నాలుగు కప్పుల స్ట్రాంగ్ కాఫీ తాగి హాల్లో సిగరెట్ పీలుస్తూ కూర్చున్నాను.

పార్వతి నా పక్కనే కూర్చుని కమ్మగా కబుర్లు చెప్తోంది. టెలిఫోన్ మ్రోగింది. వెళ్లి రిసీవర్ని అందు కున్నాను. అటువైపు కంఠంలో గాభరా ధ్వనిస్తోంది.

"పరశురామ్‌గారూ!"

"యస్ స్పీకింగ్!"

"బాజీరావుని, సార్! నిన్న రేవతి రాసిన వుత్తరం నాకిప్పుడు అందింది."

"ఏం రాసింది?"

"ఆమె చాలా రాసింది సార్!"

"నువ్వెక్కడున్నావు?"

"అజంతా హోటల్ పక్కనున్న టెలిఫోన్ బూత్‌లో."

"అక్కడే వుండు-వస్తున్నా!"

రిసీవర్ని పెట్టేసి కోటు తొడుక్కున్నాను. పార్వతి వైపు చూసి నవ్వుతూ కిందకి పరుగెత్తాను.

అజంతా హోటల్ సమీపంలో వున్న టెలిఫోన్ బూత్ పక్కనే కారాపాను. బాజీరావు కారువైపు వడి వడిగా వచ్చాడు. ఒక కవర్ని నాకిచ్చాడు. కవర్‌లోంచి వుత్తరాన్ని బయటకు లాగాను.

"మైడియర్ బాజీ,

కొన్ని గంటల్లో నా జీవితం ఇలా తారుమారవుతుందని కలలో కూడా అనుకోలేదు. సెంట్రల్ దిగి నడుస్తూంటే

ఒకామె ఎదురైంది. అమ్మ హాస్పిటల్లో వుందని చెప్పి నన్ను అక్కడకు రమ్మంది. ఆమెతో కారెక్కాను. అంతే_తెలియకుండా బోనులో ఇరుక్కున్నాను.

"బాజీ, తర్వాత జరిగిందంతా వివరంగా చిత్రించి నిన్ను బాధించను. వుద్యోగం దొరికాక నిన్ను పెళ్ళాడి సుఖంగా వుండొచ్చు అని అనుకునేదాన్ని. దానికి నేను నోచుకోలేదని రుజువైంది. విధి అలా వుంది.

"బాజీ, సకల రోగాలూ తనలో జీర్ణించుకున్న ఒక కిరాతకుడు నన్ను బలాత్కరించి, నా శీలాన్ని నాశనం చేశాడు. ఆకలి తీరాక నన్ను రోడ్డుమీద వదిలేశాడు. ఏ మొహం బెట్టుకుని ఇంటికెళ్ళను? నిన్ను ఎలా పెళ్ళాడ గలను? ఒక నిర్ణయానికి వచ్చాను. ఆ నుయ్యి నాకు ఎప్పుడూ కనిపిస్తూ వుంటుంది. అదే నాకు శరణం!

మలిన స్థితిలో నీవద్దకు రాలేక మరో లోకానికి పోతు న్నాను. నన్ను మర్చిపో!

రేవతి."

ఉత్తరాన్ని మడిచి కవర్లో పెట్టి అతనికేసి జాలిగా చూశాను. రేవతి శవం గుర్తుకొచ్చింది. ఆత్మహత్య!

"బాజీరావు, ఈ వుత్తరాన్ని వెంటనే ఇన్స్పెక్టర్ నాయర్‌కి అందజేయి," అన్నాను.

అతను తలాడించాడు. అతని కళ్ళమ్మట నీళ్ళు కారుతు న్నాయి.

"పరశురామ్‌గారూ, రేవతి తొందరపడింది. నాతో జరిగింది చెప్పివుంటే నేను మన్నించేవాడిని. ఎవరో బలా త్కారంగా ఆమెను ఏదో చేస్తే తప్పు ఆమెదికాదు. అన వసరంగా ఆత్మహత్య చేసుకుంది!" అన్నాడతను.

"ఆమె తండ్రికికూడా ఇలా ఉత్తరం రాసిందేమో!"

"అదిగో చూడండి!"

అప్పుడే వచ్చిన బస్సువైపు అతను పరుగెత్తాడు. కార్ను పోనిచ్చాను. ఐ. సి. ఎఫ్ కాలనీలోని ఇంటిముందు కారాపాను. దిగి లోపలకు వెళ్లాను. రాజన్ నన్నుచూసి లేచి నిలబడ్డాడు.

"పరశురామ్ గారూ, ఆ దుర్మార్గుడు దొరికాడా?" అడిగాడతను.

"దుర్మార్గులు అంత తొందరగా దొరకరు!" అన్నాను.

"రోజులు మారాయి, సార్. మనుషులు దారుణంగా ప్రవర్తిస్తున్నారు."

"మీకేమైనా ఉత్తరం వచ్చిందా?"

"లేదు," అన్నాడతను.

ఇంటిముందు స్కూటర్ ఆగింది. రాజన్ బయటకు గబగబా వెళ్ళాడు. స్కూటర్ మీద కూర్చున్నతనితో ఏదో మాట్లాడుతున్నాడు. లోపల గుమ్మంవైపు చూశాను. అతని భార్య కనిపించింది. దగ్గరగా వెళ్ళాను. ఆమె ఒక కవర్ని నాకు అందించింది.

ఏడ్చి ఏడ్చి ఆమె కళ్ళు ఎర్రబడ్డాయి.

"పరశురామ్‌గారూ, ఈ ఉత్తరం వచ్చినట్లు ఆయనకు తెలియదు. దయచేసి చెప్పకండి!"

ఉత్తరాన్ని జేబులో పెట్టుకు బయటకు నడిచాను. రాజన్ ఎదురయ్యాడు.

"కూర్చోండి సార్!" అన్నాడతను.

"పనుంది, మళ్ళీ వస్తాను!" అని కారువైపు గబగబా వెళ్ళాను.

కార్ను కొంచెందూరం పోనిచ్చి రోడ్డువారగా ఆపాను. ఉత్తరాన్ని బయటకులాగి చదవసాగాను.

"ప్రియమైన అమ్మకి,

అనుకోని పరిస్థితుల్లో నా సర్వస్వాన్నీ పోగొట్టుకున్నా నమ్మా! నాకు మానభంగం జరిగింది. వాడి రోగాలతో నా రక్తం చెడివుంటుంది. ఈ స్థితిలో ఇంటికి రావడానికి నాకు మనసొప్పడంలేదు. అందువలన మరో లోకానికి ప్రయాణంకడుతున్నాను. బాజీ మూలంగా నాకు ఏ హానీ జరగలేదు. అతను యోగ్యుడు. ఈ ఉత్తరం నీకు అందేసరికి నే నీ లోకంలో వుండను.

అమ్మా! బాధపడకు! మరో జన్మ నేదివుంటే నీకడుపున మళ్ళీ పుట్టాలని నా ఆఖరి కోర్కె.

రేవతి."

కవర్ని జేబులో పడేసుకుని ఆలోచిస్తూ కూర్చుండి పోయాను. రెండు ఉత్తరాల్లోనూ రేవతి వివరంగా ఏదీ చెప్పనందుకు విచారించాను. తనకు జరిగినది మరెవరికైనా జరగొచ్చు! ఆమె అంతా రాసివుంటే ఇతర్లను కాపాడే అవకాశం పోలీస్ వారికి చిక్కివుండేది.

ఆమె వివరంగా ఎందుకు రాయలేదు? ఆమె మెదడు సక్రమంగా ఆలోచించే స్థితిలో లేదేమో!

*　　*　　*

ఇన్స్పెక్టర్ నాయర్ ఎదురుగా కూర్చున్నాను. గదిలో ఫాన్ తిరుగుతోంది. సిగరెట్ పీలుస్తూ అతనివైపు చూశాను. "బ్రదర్, మరో అమ్మాయి నిన్న రాత్రి మాయమైనట్లు పోలీస్ రిపోర్ట్ ఇవ్వబడింది," అన్నాడు నాయర్.

ఒక షీట్ను అతను నాకిచ్చాడు. దానిమీద అమ్మాయి పేరు, ఇంటి అడ్రెస్ అన్నీ వున్నాయి. మిస్ దేవిక!

"నాయర్ భాయ్, ఇది విచిత్రంగావుంది. బాజీరావుకి ఆమె రాసిన ఉత్తరం చదివేవా?"

"ఎవడో దుష్టుడు అందమైన అమ్మాయిలను కిడ్నాప్ చేసి తన సెక్స్ వాంఛలను తీర్చుకుని వదిలేస్తున్నాడు! మిస్ దేవిక తండ్రి మల్టీమిలీనియర్. ఏదో వెంటనే మనం చెయ్యకపోతే అతను వూరుకోడు!" అన్నాడు నాయర్.

నాయర్ తెప్పించిన కాఫీ తాగి కారెక్కాను. కీల్పాక్ లోని హాడ్డోస్ రోడ్డుకి కారును పోనిచ్చాను. నంబర్ ఇరవై గేటుముందు కారాపి చూశాను. గూర్ఖా వాచ్‌మన్ బయట పచార్లు చేస్తున్నాడు. కార్ను లోపలకు పోనిచ్చాను. పోర్టికోలో కారాపి దిగాను.

మూడంతసుల భవనం. రతన్‌లాల్ షా పేర్ను ఇంతకు ముందు ఎన్నిసార్లో విన్నాను. లైన్స్ క్లబ్, రోటరీ క్లబ్ మెంబరతను. లక్షలమీద విరాళాలు ఇస్తూవుంటాడు. దేవిక అతని కూతురు.

ఒక యువకుడు నావేపు వచ్చాడు.

"రతన్‌లాల్ షా వున్నారా?" అడిగాను.

"కూర్చోండి, సార్," అంటూ అతను నన్నొక హాలు లోకి తీసుకువెళ్ళాడు.

పెద్ద హాలు. ఖరీదైన సోఫాలున్నాయి. ఒక యాంగ్లో ఇండియన్ యువతి నా దగ్గరకొచ్చింది. నన్ను గదిలోకి తీసుకొచ్చినతను ఆమెతో ఏదో చెప్పి బయటకు వెళ్ళి పోయాడు.

సోఫాలో కూర్చుని సిగరెట్ వెలిగించాను.

"యువర్ నేమ్ ప్లీజ్!" అందామె.

ఆమెకు నా కార్డిచ్చాను. పేరుచూసి ఆమె నాకేసి నవ్వుతూ తిరిగింది.

"కూర్చోండి. ఆయనతో చెప్తాను," అందామె.

అయిదు నిమిషాల తర్వాత ఆమె నన్ను పైకి రమ్మంది.

ఒక ఏర్ కండిషండ్ గదిలోకి ప్రవేశించాను. కుషన్డ్ సోఫాలో అతను కూర్చుని వున్నాడు. కాశ్మీర్ శాలువా కప్పుకున్నాడు. అతని ముఖంమాత్రం కొద్దిగా కనిపిస్తోంది. కళ్ళకు కళ్ళద్దాలున్నాయి. మఫ్లర్ తలనీ, గొంతునీ, చెవులనూ, కప్పేసింది.

ఎదురుగావున్న సోఫాలో కూర్చున్నాను. అతను నావైపు నవ్వుతూ చూశాడు.

"మిస్టర్ పరశురామ్, నేను కిందకి రావడానికి బదులు మిమ్మల్ని పైకి రప్పించినందుకు నన్ను క్షమించండి. ఈ మధ్య నా ఆరోగ్యం బాగాలేదు. ఇల్లు విడిచి ఎక్కడకీ వెళ్ళడంలేదు," అన్నాడు షా.

"డోంట్ బాదర్," అన్నాను.

యాంగ్లో ఇండియన్ యువతి గదిలోకి ట్రేతో వచ్చింది. ట్రేని నా ముందున్న టీపాయిమీద పెట్టింది.

"స్కాచ్ ప్లీజ్," అన్నాడతను.

"థాంక్స్. విస్కీ విత్ సోడా!" అన్నాను.

ఆమె రెండు గ్లాసుల్లో విస్కీపోసి సోడా కలిపింది. ఒక గ్లాసును నాకిచ్చి రెండో గ్లాసును అతని కందించింది.

"రీతా, మాకేదేనా కావలిస్తే చూస్తూవుండు!" అన్నాడతను.

"యస్, బాస్," అని ఆమె వెళ్ళిపోయింది.

అతను గ్లాసును ఎత్తాడు. గ్లాస్ ఎత్తి, "చియర్స్!" అన్నాను. గ్లాసులోని విస్కీని తాగేసి సిగరెట్ వెలిగించాను.

"బెస్ట్ క్వాలిటీ స్కాచ్!" అన్నాను.

"థాంక్స్ టు స్మగ్లర్స్!" అన్నాడతను నవ్వుతూ.

"మీ అమ్మాయి మాయమైందని రిపోర్టిచ్చారట!" అని

సంభాషణన్ని మార్చాను.

"దేవిక కాలేజినుంచి ఇంటికి రాలేదు. కారుపంపాను. తోవలో కారుకి రిపేరొచ్చింది. దేవిక ఫోన్ చేసింది. కారు రాలేదంది. మరో కారు పంపుదామనుకున్నాను. ఫ్రెండ్ కారులో వచ్చేస్తానంది. వూరుకున్నాను. అమ్మాయి ఎంతకీ రాలేదు."

"ఏ ఫ్రెండ్ కారులో ఆమె వస్తానంది?"

"కమల కారులో. నా సెక్రెటరీ కమలకి ఫోన్ చేసి అడిగింది. దేవిక తన కారులో రాలేదందామె. దేవికను గురించి తనకేమీ తెలియదంది."

"ఏ చుట్టాల ఇంటికేనా ఆమె వెళ్ళుంటుందా?"

"చెప్పకుండా వెళ్ళదు!"

అతను వుఫ్ అన్నాడు. యాంగ్లో ఇండియన్ యువతి పరుగెత్తుకొచ్చింది. నా గ్లాసులో విస్కీ పోసి సోడా కలిపింది. ప్లేటులోవున్న చిప్స్, పీనట్సు నవుల్తూ మరికొంత విస్కీ తాగాను. ఉషారుగావుంది. అతనికేసి నవ్వుతూ చూశాను.

అతను గ్లాసులోని విస్కీని మెల్లిగా సేవిస్తున్నాడు. డబ్బున్న వ్యక్తికాని తన ధనాన్ని అనుభవించే ఆరోగ్యం లేదు.

"పరశురామ్‌గారూ, ఎవరో అమ్మాయికి ఘోరంగా అపచారం జరిగిందని పేపర్లో చదివాను. నాకు చాలా గాభరాగా వుంది!"

"ఆమె సాధారణంగా ఎన్నింటికి ఇంటికొస్తుంది?"

"అయిదింటికి వచ్చేస్తుంది. నిన్న పద్దాకా చూసి, తర్వాత రిపోర్టివ్వమన్నాను. పరశురామ్‌గారూ, మీరు ఆమెకోసం వెతకండి. ఎంతేనా ఖర్చు పెట్టండి, నేనిచ్చు

కుంటాను," అన్నాడతను.

గ్లాసులు ఖాళీ చేశాను. నిషా గా వుంది. అతనికేసి సూటిగా చూశాను.

"మీ కెంతమంది పిల్లలు?"

"ఒక్కగా నొక్క కూతురు. నా భార్య మరణించింది. తర్వాత నేను పెళ్ళాడలేదు."

అతను సౌజ్ఞ చేశాడు. గూంగ్లో ఇండియన్ యువతి నావద్ద కొచ్చింది.

"అమ్మాయి ఫోటో వుందా?"

"రీతా, దేవిక ఫోటో ప్లీజ్," అన్నాడతను.

ఆమె విస్కీ పోసి, సోడా కలిపి వెళ్ళిపోయింది. పాస్ పోర్ట్ సైజు ఫోటోను పట్టుకొచ్చి నాకిచ్చింది. ఫోటోను చూడగానే దేవిక అంత అందమైన యువతి కాదనిపించింది! ఈమెను ఎవరేనా ఎత్తుకుపోతే మరేవో కారణాలు వుండొచ్చు!

గ్లాసులోని విస్కీని తాగేసి సోఫాలోంచి లేచాను.

"మిస్టర్ షా, థాంక్స్ ఫర్ ది డ్రింక్స్, వెళ్ళొస్తా," అన్నాను.

"రీతా, టేక్ హిమ్ టుది కార్!" అన్నా డతను నవ్వుతూ.

రీతా పక్కనే నడిచి మెట్లు దిగాను. పోర్టికోలో ఆపిన కారులో కూర్చుని తలుపు మూశాను. కారుపక్కనే రీతా నిలబడి వుంది. ఆమెవైపు చూసి తాపీగా నవ్వాను.

"దేవిక ఇంటికొస్తే నాకు ఫోన్ చేసి వెంటనే చెప్పు!" అన్నాను.

"యస్సార్," అందామె.

  

ఆమె అతనికేసి భయంతో చూసింది. ఆమె వయస్సు ముప్ఫయిదాటి వుంటుంది. చక్కటి పట్టుచీర కట్టుకుంది. చేతులకు బంగారం గాజులున్నాయి. మెళ్లో నగలు మెరుస్తున్నాయి. నుదురుమీద కుంకుమ బొట్టు!

"దగ్గరగా రా!" అన్నాడతను.

ఆమె జంకుతూ ముందుకు జరిగింది.

"పెళ్లయి పదేళ్లయినా నీ అందం పోలేదు!" అన్నాడతను.

"నేను ముసలిదాన్ని. వయస్సులో వున్న యువతుల ముందు నేనెందుకు పనికొస్తాను?" అందామె.

"సూరమ్మా, నిన్ను చూస్తే బాగా డబ్బు సంపాదిస్తున్నావనిపిస్తుంది," అన్నాడతను.

"మీ దయ," అందామె వినయంగా.

"ఈసారి పదిహేనేళ్ల దోర యువతిని తీసుకురా!"

ఆమె తలాడించి అతనికేసి చూసింది.

"నాకు రెండువేలు కావాలి!"

అతను ఇనప్పెట్టె తెరిచి ఆమెవైపు రెండు కట్టలు విసిరాడు. ఆత్రంగా ఆమె వాటినందుకొని తన హేండ్ బాగ్‌లో దాచుకొంది.

"వెళ్లివస్తాను, సార్," అందామె.

"గెట్ మి యంగ్ స్టఫ్!" అన్నాడతను.

ఆమె బయటకు గబగబా నడిచింది.

*   *   *

చీకటి పడ్తోంది. టెలిఫోన్ మ్రోగింది. రిసీవర్ ఎత్తి "హలో!" అన్నాను.

"మిస్టర్ పరశురామ్, బాస్ మాట్లాడతారు," అంది రీటా. పా కంఠం వెనువెంటనే వినపడింది.

"మిస్టర్ పరశురామ్, చాలా థాంక్స్! ఇప్పుడే అమ్మాయి ఇంటికొచ్చింది," అన్నాడు షా.

"ఏమైందిట?"

"ఆమెకు నేను భయపడిన విధంగా ఏ ప్రమాదమూ జరగలేదు. తన స్నేహితురాలితో ఆమె వాళ్లింటికి వెళ్లిపోయింది. అక్కడ వాళ్ళు పట్టుబట్టి ఆమెను వుండిపోమన్నారుట."

"కనీసం మీకామె ఫోన్ చేయవలసింది," అన్నాను.

"వాళ్లింట్లో ఫోన్ లేదట. దగ్గరలో ఫోన్ లేదట. ఏదో చెప్పింది. చెడామడా తిట్టి యిటుపైన అలా ఎక్కడికీ వెళ్లొద్దన్నాను. మిస్టర్ పరశురామ్, మీకు చాలా థాంక్స్!"

మెల్లిగా నవ్వాను.

"మిస్టర్ షా, మీ అమ్మాయి విషయంలో నేనింతవరకూ ఏమీ చేయలేదు. ఆమె యింటికి రావడం, మీ లక్!" అన్నాను.

"ఎనీవే, మీకు నా చెక్కు పంపుతున్నాను!"

"ప్లీజ్, వద్దు! ఏ పనీ చేయకుండా డబ్బు తీసుకోవడం నాకిష్టం లేదు!"

రతన్‌లాల్ షా ఫక్కున నవ్వాడు.

"మిస్టర్ పరశురామ్, మీ మాటలు మీ గొప్పతనాన్ని నిరూపిస్తున్నాయి! నేను వుంటాను," అని అతను రిసీవర్ పెట్టేశాడు.

• • •

పద్మజ ప్లాస్టిక్ బుట్ట పట్టుకొని పేవ్‌మెంటమ్మట వేగంగా అడుగులేస్తోంది. సాయంత్రం సమయం. సూర్యాస్తమయం అయింది, కాని ఇంకా చీకటి పడలేదు.

పద్మజ వయస్సు పదిహేనుంటుంది. సన్నగా, పొడుగ్గా వుంటుందామె. బంగారంలాంటి శరీర ఛాయ. స్కర్ట్, వైట్ బ్లౌస్ ధరించింది. రెండు జడలు!

ఎదురుగా వస్తూన్న స్త్రీ ఆమెకేసి సూటిగా చూసింది. ఆమె కళ్ళు మెరిశాయి, పద్మజను చూడగానే.

"అమ్మాయి, నువ్వేనా..." అని అడిగిందామె.

"నా పేరు పద్మజండి," అందామె అమాయకంగా.

"నీకోసమే వస్తున్నాను," అందామె.

"నాకోసమా, ఎందుకు?"

"అమ్మకి హార్ట్ ఎటాక్ వచ్చింది..."

"అమ్మెవరు? పిన్నా?"

"అదే పిన్నికి!" సరిదిద్దిందామె.

పద్మజ గాభరాగా ఆమెకేసి చూసింది.

"పిన్నెక్కడుంది?"

"ఇసబిల్లా హాస్పటల్లో. అక్కడకి వెళ్దాం, పద!"

పద్మజ ఆమెతో కొంచెం దూరం నడిచింది. ఒక కారు పక్కనే ఆగి ఆమె వెనుక తలుపు తెరిచింది.

"ఎక్కమ్మా, కారులో తొందరగా వెళ్ళొచ్చు!" అందామె.

పద్మజ వుషారుగా కారులో కూర్చుంది. ఆమెపక్కనే కూర్చుని తలుపు మూసింది. ముందు సీటుమీద వున్నతను కారును పోనిచ్చాడు. పద్మజ వెనుక నడుస్తూన్న తన క్లాస్‌మేట్ శంకర్ వైపు చూసింది.

కారు ఎక్కడికో పోతోంది. ఇసబిల్లా హాస్పిటల్ ఎక్కడున్నదీ పద్మజకు తెలుసు.

"ఇసబిల్లా హాస్పిటల్ దాటి వచ్చేశాం!" అందామె.

"ప్రాణం పోదులే!" అందామె కటువుగా.

నవ్వుతూ తనని పలకరించిన స్త్రీ ముఖంలో ఇప్పుడు నవ్వు లేదు. పిశాచంలా అగుపిస్తోందామె.

"నన్ను పోనివ్వండి!" అంది పద్మజ.

"ఎక్కడకి పోతావు?" అందామె పరిహాసంగా.

"హాస్పిటల్ కి వెళ్ళి పిన్నిని చూస్తాను."

"బోనులో ఇరుక్కున్న ఎలుకను వదిలేయరు!"

పద్మజ వులిక్కిపడింది. నల్లటి గుడ్డను తీసి ఆమె పద్మజ కళ్ళను కప్పేసి వెనుక బిగించి కట్టింది. కారు స్పీడుగా వెళ్తోంది. ఎటు వెళ్తోందో ఆమె చూసే స్థితిలో లేదు.

"నన్నెక్కడకి..." పద్మజ అడగబోయి మధ్యలో ఆగింది.

"నోరు మూసుకుని కూర్చో. అల్లరిచేస్తే కష్టపడవలసి వస్తుంది. బుద్ధిగావుంటే త్వరలో నీ ఇల్లు చేరుకుంటావు," అందామె.

పద్మజ మరే ప్రశ్నలూ వెయ్యలేదు. కారు ఆగింది. ఆమెను దింపి, ఎవరో నడిపించి తీసుకుపోయారు. కొంత సేపయ్యాక నల్లగుడ్డ తీసివేయబడింది. కళ్లు చిట్లించి పద్మజ నలువైపులా చూసింది. అందమైన గది, గది కిటికీ తలుపులు మూసి వున్నాయి.

ఎదురుగా ఆమె నిలబడివుంది.

ఏడుస్తూ పద్మజ ఆమెకు నమస్కరించింది.

"మీకు దణ్ణం పెడ్తాను, నన్ను పోనీయండి!"

"పని పూర్తయ్యాక వెళ్దువుగాని!"

"నాతో మీకు పనేముంది?"

ఆమె పిశాచంలా నవ్వింది.

"నీలాంటి అందమైన పిట్టతో పనున్న వ్యక్తి కాస్సేపట్లో వస్తారు!" అందామె.

"నన్నేం చేస్తావు?"

"తెలియనట్లు అడుగుతున్నావే! ఈనాటి పిల్లలకు అన్నీ తెలుసు!" అందామె.

పద్మజ గుండె దడదడ కొట్టుకుంది. ఆమె గదిలోంచి బయటకు వెళ్ళి తలుపు మూసి గొళ్ళెం పెట్టింది.

* * *

పద్మజ ఎదురుగా అతను నిలబడ్డాడు. తలుపు మూసి వుంది. అతడిని చూడగానే ఆమె భయంతో వెనక్కి జరిగింది. కుష్టురోగి! శిథిలమైన పురాతన విగ్రహంలా శరీరం అనేక చోట్ల చీలేసింది. రసి కారుతోంది!

అతని కళ్ళు ఆకలితో ఆమెను తినేస్తున్నాయి. అతను ముందుకు వెళ్ళాడు. ఆమె గోడ వారగా నిలబడింది. ఎదురుగా నిలబడ్డాడతను. ఆమె ధరించిన బ్లౌస్‌ను చించి, గట్టిగా లాగాడు. బ్రాసియర్‌లో దాగివున్న ఆమె బిగువైన స్తనాల కేసి ఆకలితో చూశాడు.

ఆమె ఏడుస్తోంది. కళ్ళమ్మట, ముక్కుమ్మట నీళ్ళు కారుతున్నాయి.

"నన్ను పోనీ! అరుస్తాను!" అందామె.

అతను పిచ్చివాడిలా నవ్వాడు.

"అరిస్తే నిన్ను రక్షించడానికి ఎవ్వరూ రారు! నువ్వు అరవగానే ఏ కృష్ణుడో వచ్చి కాపాడే రోజులు కావివి!" అన్నాడతను.

"నీకేం కావాలి?" అడిగిందామె.

"నువ్వు కావాలి. అందంగా వున్నావు. నిన్ను ఒల్చుకు నమిలేస్తాను!" అన్నాడతను.

"నన్ను చంపకు!"

"అడ్డురాకుండా నాకు లొంగిపో! ప్రాణంతో ఇంటి

కిడ్తావు. నన్ను ఎదిరిస్తే నీకే ప్రమాదం!'' గర్జించేడతను.

*   *   *

టైమ్ పది దాటింది. పాత ఇంటిముందు కారాపాను. దిగి ఇంటికేసి చూశాను. లైట్లన్నీ వెలుగుతున్నాయి. లోపలకు వెళ్ళాను. ఒక స్త్రీ నాకు నమస్కరించి కూర్చోమంది. ఆమె పక్కనే సన్నగా, పొట్టిగావున్న ఒక పురుషుడు చేతులు కట్టుకుని నిలబడి వున్నాడు.

కుర్చీలో కూర్చొని వాళ్ళిద్దరి వైపూ చూశాను.

''ఇతను నాభర్త, నా పేరు రమణి. అక్కయ్య కూతురు పద్మజ యిక్కడ మాతో వుంది. చదువుకుంటోంది. అది ఇంటికి రాలేదు,'' అందామె.

''మీరు వెంటనే పోలీస్ రిపోర్ట్ యిచ్చుంటే బాగుండేది. తొమ్మిది దాకా కాలయాపన చేస్తూ కూర్చున్నారు,'' అన్నాను.

''యూ ఆర్ రైట్, సార్,'' అన్నాడామె భర్త.

ఆమె అతని వైపు కోపంగా చూసింది.

''రాజూ, ఇదంతా నేను చూస్తాను. నువ్వెళ్ళి పడుకో!'' అందామె.

మూతికాలిన పిల్లిలా అతను లోపలకు వెళ్ళిపోయాడు.

''పద్మజ ఫోటో ఇది. దాని వయస్సు పదిహేను లోపున వుంటుంది,'' అందామె.

ఫోటో చూశాను. పద్మజ బంగారం బొమ్మలావుంది.

''మీరు ఏం చేస్తున్నారు?'' అడిగాను.

''నేను పోస్ట్ అండ్ టెలిగ్రాఫ్స్‌లో పనిచేస్తున్నాను పి. ఎమ్. జి. ఆఫీసులో,'' అందామె.

''పద్మజకి ఎవరేనా బాయ్ ఫ్రెండ్స్ వున్నారా?''

''అది ఎసెస్ ఎల్సీ చదువుతోంది, సార్. ఈ మధ్యనే

పెద్ద మనిషైంది. దానికి బాయ్ ఫ్రెండ్స్ ఏమిటి?"
అందామె.

"ఆల్ రైట్, దర్యాప్తు చేస్తాను," అని బయటకు
నడిచాను.

రోడ్డు మీదున్న కారెక్కి తలుపు మూశాను. ఎవరో
కారు వైపు పరుగెత్తుకొచ్చారు. పదహారేళ్ళ యువకుడు.
వైట్ పాంట్, స్లాక్ ధరించాడు. నూనూగు మీసాలు!

దగ్గరలోవున్న స్ట్రీట్ లైట్ కాంతిలో అతను
స్పష్టంగా కనిపిస్తున్నాడు.

"సార్! పద్మజ ఏమైంది?" అడిగాడతను.

"నువ్వెవరు?" ప్రశ్నించాను.

"నా పేరు శంకర్. ఆమె క్లాస్ మేట్ ని. ఇందాక
పోలీస్ జీప్ వచ్చి వెళ్ళింది. ఇప్పుడు మీరొచ్చారు!"

"పద్మజ స్కూలునుంచి ఇంటికి రాలేదు. ఆమెను
గురించి నీకేదేనా తెలుసా?"

"తెలుసు. అది చెప్పాలనే ఇలా వచ్చాను."

"ఏం తెలుసు?"

"స్కూల్ అవగానే ఆమె ఇంటికి నడుస్తోంది. వెన
కనే నేను నడుస్తున్నాను. ఎవరో స్త్రీ ఆమెను పలకరిం
చింది. ఇద్దరూ కొంతదూరం నడిచి కారులో ఎక్కారు.
కారులో కూర్చుని పద్మజ నావైపు చూడ్డం నాకింకా
గుర్తుంది."

"కారులో ఎంతమంది వున్నారు?"

"ఆమెను పలకరించిన స్త్రీ కాక ముందు సీటులో
డ్రయివర్ వున్నాడు."

"కారు నెంబర్ చూశావా?"

అతను బట్టీ పట్టిన కారు నంబర్ని నాకు చెప్పాడు.

అతని భుజంమీద చెయ్యివేశాను.

"మైడియర్ ఫ్రెండ్, నువ్వు చూసి చెప్పింది మాకెంతో వుపయోగపడుతుంది. ఎక్కడుంటున్నావు?"

"ఇదే వీధిలో, అదుగో ఆ ఇల్లు," అని మూడో ఇంటి కేసి అతను చెయ్యి చూపించాడు.

"ఆ స్త్రీని మళ్ళీ చూస్తే పోల్చగలవా?"

"పోల్చగలను సార్," అన్నాడతను.

"అవసరమైతే నిన్ను మళ్ళీ కల్సుకుంటాను," అన్నాను.

"పద్మజకి ఏ ప్రమాదం రాకుండా చూడండి, సార్. ఆమె చాలా మంచిది!" అన్నాడతను.

కారును పోనిచ్చాను. పోలీస్ హెడ్‌క్వార్టర్స్ కాంపౌండులో కారాపి ఇన్‌స్పెక్టర్ నాయర్ ఆఫీసులోకి వెళ్ళాను.

నాయర్ కుర్చీలో కూర్చుని కునికిపాట్లు పడుతున్నాడు. నా బూట్లచప్పుడు విని లేచి ఆవులిస్తూ నావైపు చూశాడు.

"బ్రదర్, కూర్చో!" అన్నాడతను.

అతనికి కారునంబర్ చెప్పాను.

"నాయర్ భాయ్, ఆ కారు ఎవరిదో కనుక్కో!"

ఇన్‌స్పెక్టర్ నాయర్ నంబర్ తిప్పి యెవరితోనో మాట్లాడుతున్నాడు. ఆలోచిస్తూ సిగరెట్ పీలుస్తున్నాను. అందరూ దేవికలా అదృష్టవంతులు కాకపోవచ్చు. రేవతి జపిస్తోంది!

"ఆ కారు భాస్కర్ నాయర్‌ది. అతను టాంక్ స్ట్రీట్ మైలాపూర్, పదో నెంబర్ ఇంట్లో ఉండాలి!" అన్నాడు నాయర్.

వేగంగా బయటకు వెళ్ళాను. డాడ్జికారును కపాలీ టాంక్ వైపు పోనిచ్చాను. ఒక ఇంటిముందు పాత అంబాసిడర్ కారు ఆగివుంది. అదే నంబర్.

కిందకిదిగి వీధితలుపును తట్టాను. ఒకతను లేచివచ్చి కటకటాల తలుపు తెరిచాడు. లోపలకు దూకి అతనికేసి సూటిగా చూశాను.

"ఈకారు నీదేనా?"

"నాదేసార్!" అన్నాడతను.

"సాయంత్రం ఆయిదు ప్రాంతంలో ఆ కారులో ఒక అమ్మాయి ఎక్కింది. ఆమెను యెక్కడ దింపావు?"

కాస్సేపు అతను మాట్లాడలేదు. నావైపు చూస్తూ వుండిపోయాడు.

"సార్, నేను కార్పొరేషన్ ఆఫీసులో పనిచేస్తున్నాను. ఆ కారును ప్రయివేట్ టాక్సీగా నడుపుతున్నాను. డ్రైవర్ని అడిగితే ఆ కారు యెక్కడకి వెళ్ళిందీ తెలుస్తుంది" అన్నాడతను.

"డ్రైవర్ ఇల్లెక్కడ?"

"పల్లాతోపులో వుంది."

"అక్కడకు వెళదాం, తొందరగా రా!" అన్నాను.

అతను లోపలకు వెళ్ళి చొక్కా తొడుక్కొని వచ్చాడు. తలుపు మూసుకోమని భార్యతో చెప్పి అతను కార్లో కూర్చున్నాడు. కారును స్పీడుగా పోనిచ్చాను.

* * *

అతని చేతులు ఆమెను చుట్టేశాయి. పద్మజ అతని ముఖంమీద వుమ్మింది.

"ఛీ, దుర్మార్గుడా! రోగిష్టి వెధవ్వి!" అరిచిందామె పళ్ళు కొరుకుతూ.

"నీకు కావలసినంత డబ్బిస్తాను!"

"నీడబ్బు ఎవరికి కావాలి, పొయ్యిలో పెట్టుకో!" అందామె.

అతనామెను తనవైపు లాక్కున్నాడు. ఆమె అతని

పొట్టమీద తన్నింది. అతను వెనక్కి పడ్డాడు. క్రోధంతో ఆమెకేసి చూశాడు.

"నిన్ను నాశనం చేస్తాను!" అరిచాడతను.

ఆమె పరిహాసంగా నవ్వింది.

"కుష్టురోగం నిన్ను నాశనం చేస్తోంది!" అందామె.

అతనిమూతి వంకరబోయింది. అతను గుమ్మంవైపు వెళ్ళి తలుపు తెరిచాడు. బయట కూర్చునివున్న స్త్రీకేసి తీక్షణంగా చూశాడు. ఆమె తమలపాకులు నవుల్తోంది.

"పిట్ట లొంగటంలేదు!" అన్నాడతను.

"మరో వెయ్యి రూపాయిలిలా పడేయి! కాళ్ళూ చేతులూ విర్చి పట్టుకుంటాను. ఆటుపైన మీరు అమృతాన్ని సులువుగా తాగొచ్చు" అందామె.

"అందరికీ నీలా డబ్బాశవుంటే బాగుండేది!" అన్నాడతను.

"యూ ఆర్ రైట్, బాస్," అందామె.

అతను మరో గదిలోకెళ్ళి ఒక నోట్లకట్టను తెచ్చి ఆమెకిచ్చాడు. డబ్బును ఆమె హేండ్ బాగ్‌లో పడేసుకుంది. ఆమె చొరవగా గదిలోకి నడిచింది. అతను లోపలకెళ్ళి తలుపు మూశాడు.

"మిమ్మల్ని ఎవరు కాదనగలరో చూస్తాను," అరిచిందామె, పద్మజ కేసి పిశాచంలా కదుల్తూ.

* * *

నేలమీద పద్మజ నెల్లకిలా పడుంది. చేతుల్ని వెనక్కి లాగి ఆమె బలంగా పట్టుకుంది. పద్మజ ఆమెకేసి హీనంగా చూసింది.

"నువ్వు భారతదేశంలో వుండవలసిన స్త్రీవి కావు! నాలాటి అమాయకురాలి జీవితాన్ని నాశనం చేస్తూన్న అతనికి సహాయపడ్డం మహా పాపం! మరో జన్మలో కప్పయి

పుడ్తావు!" అర్చింది పద్మజ.

"నీ ఇష్ట మొచ్చినట్లు శపించు! కప్పగానే సుఖంగా జీవిస్తాను," అని ఆమె అతని వైపు చూసింది.

"కానివ్వండి, బాస్!" అందామె.

అతను ఆమె వైపు వంగాడు. తటాలున ఎవరో బూట్ కాలుతో తలుపును తన్నారు. తలుపు చటుక్కున తెరుచుకుంది.

పద్మజను పట్టుకున్న స్త్రీ లోపలున్న బాత్ రూమ్ లోకి దూరి తలుపు మూసుకుంది. అతను లేచి వెనక్కి తిరిగాడు.

"మిస్టర్ రతన్ లాల్ షా, ఆనాడు కదలలేని వాడిలా నా ముందు నటించావు! డర్టీ రాస్కెల్!" అర్చాను గంభీరంగా.

పద్మజ లేచింది. నా దగ్గరగా వచ్చి నిలబడింది. వణుకుతున్న ఆమె చేతులు నన్ను చుట్టేశాయి.

చిరిగిన ఆమె దుస్తుల వైపు విచారంతో చూశాను. ఆమె కళ్ళమ్మట నీళ్ళు జలజల కారాయి.

"దేవుడిలా వచ్చినా మానాన్ని కాపాడారు. మిమ్మల్ని యీ జీవితంలో మర్చిపోను!" అందామె.

"పద్మజా, యూ ఆర్ లక్కీ! నిన్ను కాపాడింది నీ క్లాస్ మేట్ శంకర్. అతను చూసి నాతో చెప్పినది నిన్నికక్కడకు తీసుకొచ్చింది," అన్నాను ఆమెను నిమురుతూ.

* * *

గదిలో ఫ్లోరసెంట్ లైట్ వెలుగుతోంది. కుర్చీలో షా కూర్చుని వున్నాడు. అతని చేతులకు బేడీలున్నాయి. ఇన్ స్పెక్టర్ నాయర్, నేనూ అతని కెదురుగా నిలబడి వున్నాం.

"మిస్టర్ షా, అనేకమందికి ఎంతో డబ్బిచ్చావు! ఇంత నీచస్థితికి ఎందుకు దిగజారావు?" అడిగాను.

అతను జవాబివ్వలేదు. తన చేతులను చూసుకుని ఏడుస్తున్నాడు.

"రేవతిని రేప్ చేసి వదిలేశావు. ఆమె నూతిలో పడి ఆత్మహత్య చేసుకుంది. పశువులా ఎందుకిలా పతనమయ్యావు?"

"మిస్టర్ పరశురామ్, చిన్నప్పటినుంచీ నేను కుష్టు రోగిని. లక్షలకు లక్షలు గడించాను. అందరూ డబ్బు కోసం నావద్ద కొచ్చేవారు, కాని లోలోపల నన్ను చూసి అసహ్యించుకునేవారు. నాలుగు సార్లు నేను పెళ్ళాడాను. నా భార్యలు నన్ను దగ్గరకు రానిచ్చేవారుకారు. నన్ను చూసి ఆక్షేపించేవారు. నా భార్యలు నన్ను వదిలి వెళ్ళి పోయారు. ఎంత డబ్బు గణించినా సాధారణ మానవుడి కుండే దాంపత్య సుఖం నాకు లేకుండా పోయింది!

"తీరని కోర్కెలు మనిషిని వదలవు! దానితో నా కపట జీవితం ప్రారంభమైంది. ఎలాగో నా కోర్కెలను తీర్చుకోవాలి. అందుకోసం ఏం చేసినా పాపం లేదనిపించింది! నా స్థితిలో వుంటే ఎవరైనా ఇలాగే చేసేవారేమో!" అన్నాడు షా.

అతని వైపు చూస్తూ సిగరెట్ వెలిగించాను. ఇన్స్పెక్టర్ నాయర్ నాచెయ్యి పట్టుకున్నాడు.

"థాంక్స్ బ్రదర్. సూరమ్మనీ, షానీ కస్టడీలో వుంచి వాళ్ళమీద చార్జిషీట్ ఫైల్ చేస్తాం," అన్నాడు నాయర్.

టైమ్ చూశాను. పన్నెండు దాటింది.

"గుడ్ లక్ అండ్ గుడ్ నైట్," అని నాయర్ తో చెప్పి పోర్టికోలో వున్న డాడ్జికారు వైపు నడిచాను.

—: ఐపోయింది :—

# త్రినేత్రుడు

## సుజనశ్రీ

తను చెప్పేది అందరూ ఎంత ఉత్సుకతతో వింటున్నారా అని ఆచార్య అందరివంకా ఒకసారి పరికించి చూశాడు. ప్రతి వ్యక్తి ఊపిరిగూడ పీల్చడం మరచిపోయారా అన్నంత ఆతృతగా అతడు చెప్పేది వింటున్నారు.

“సస్పెన్సులో ఆపారేం? ప్రొసీడ్!” అన్నాడు నారాయణ్.

“ఇదో వస్తున్నాను!” అంటూ బిలియర్డ్స్ బోర్డుమీద బాల్‌ని గురిచూసి కొట్టాడు ‘స్టిక్’తో. బాల్ వెళ్ళి కంతలో దూరింది.

“ఇకనన్న చెప్పండి ఆచార్యా!” మరో వ్యక్తి అతడ్ని అభ్యర్థించాడు.

"చెప్పేందుకేముంది? ఆ ఆలయంలో ప్రవేశించి, అందులోని విగ్రహానికి పొదిగివున్న అపూర్వ వజ్రాల్ని ఇంతవరకూ ఎవరూ తీయలేకపోయారు. ఇదంతా ఆ విగ్రహంలో మహిమ కాకపోతే మరేమిటి చెప్పండి!"

"దేముడంటే నమ్మకంలేని బాస్టర్డ్స్‌ని అక్కడికి తోలితే సరి! బాగా బుద్ధి వస్తుంది!" ఎవరో ఆ సేవకుడు కసిగా అన్నాడు.

"అంటే మీరనేది అర్జునరావ్ గురించేనా?" ఒకవ్యక్తి రెట్టించి అడిగాడు.

"ఒక్క అర్జునరావ్ ఏమిటి? ఏ నాస్తికుడైనా సరే! వాళ్ళని ఆ ప్రదేశానికి తరమాలి!" మొదటివ్యక్తి గర్వంగా కనుబొమ లెగరేశాడు.

"నా పేరే వినబడుతోందే! నన్ను గురించేనా చర్చ జరుగుతున్నది!" అంటూ అర్జునరావు హాల్లోకి ప్రవేశించాడు.

అతడ్ని చూస్తూనే, అతడ్ని అవహేళన చేయటానికి ప్రయత్నించిన వ్యక్తులిద్దరూ గతుక్కుమన్నారు.

"మీకు నూరేళ్ళు ఆయుస్సు. మీ పేరే మా నోళ్ళలో ఆడుతున్నది. అంతలోనే మీరు వచ్చేశారు!" మరో ప్రేక్షకుడు అందుకుని చెప్పాడు.

"ఇంతకీ ఏమిటి సంగతి?" అర్జునరావు అసలు విషయం అడిగాడు.

"అదేనండీ! అక్కడెక్కడో, కీకారణ్యాల్లో పాడుబడిన ఆలయం ఉన్నదట. అందులోని దేవుడి విగ్రహానికి మూడు అపూర్వమైన వజ్రాలు పొదగబడి ఉన్నవట. వాటిని సేకరించాలని వెళ్ళిన ప్రతివ్యక్తీ చిత్రాతి విచిత్రంగా ఘోర దుర్మరణాన్నే చవిచూశాడట. కాబట్టి ఆ

పురాతన విగ్రహంలో ఇంకా అపూర్వ శక్తులున్నయ్యనే అంటున్నారు మన ఆచార్యగారు!" అసలు విషయాన్ని అర్జునరావుకు సవివరంగా చెప్పాడు మరోవ్యక్తి.

బిలియర్డ్స్ బోర్డు చుట్టూవున్న వ్యక్తుల కళ్ళన్నీ అర్జున రావు మీదనే కేంద్రీకృతమై ఉన్నాయ్. బోర్డు చుట్టూరా వున్న వ్యక్తుల్లో ఆటమీద ఆసక్తి నశించిపోయింది. ఆచార్య, అర్జునరావుల మధ్య ఎటువంటి వాగ్యుద్ధం చెల రేగుతుందో అని అందరూ కనిపెట్టుకుని ఉన్నారు.

"నాన్సెన్స్! ఇంకా ఈ ఇరవయ్యో శతాబ్దంలోకూడా దేవుడూ, దయ్యాలమీద నమ్మకం పెట్టుకునే ఇండియన్స్ని చూస్తుంటే నాకు అసహ్యం పుడుతోంది" అర్జునరావు నోట్లోంచి సిగార్ తీసి మరీ అన్నాడు. అతడి కళ్ళు ద్వేషాన్ని వెళ్ళగక్కినయ్.

"పాశ్చాత్య వ్యామోహం వెర్రితలలు వేసినవాళ్ళంతా దేవుణ్ని నిరసిస్తూనే ఉంటారు. కాని విదేశాల్లో చూడండి! భౌతిక వాదంపై రిసెర్చ్ చేసే సైంటిస్ట్ గూడ ఆదివారం వచ్చేసరికి లాబొరేటరీ మూసేసి, బైబిల్ చేతపుచ్చుకుని చర్చికి వెళతారు. మనమో! అటు వాళ్ళ సంప్రదాయాల్ని అనుకరించబోయి, ఇటు మన నాగరికతను ద్వేషిస్తూ, రెంటికీ చెడిన రేవడిలా తయారవుతున్నాం" ఆచార్య సూటిగా అర్జునరావును విమర్శించాడు.

"నేను మీ అందరి ముందరా ఇదే సవాలు చేస్తున్నాను. ఆ శిథిలాలయం ఎక్కడున్నదో వివరాలు చెప్పండి. నేను అక్కడకు వెళ్ళి వాటిని ఆ విగ్రహంనుంచి ఊడబెరుక్కొని వస్తాను" అర్జునరావు రోషంతో అరిచాడు.

"అర్జునరావుగారూ! త్వరపడకండి! ఆవేశంలో మీ ప్రాణాల్ని బలిచెయ్యొద్దు! బాగా ఆలోచించుకోండి!"

అక్కడ చేరిన వారిలో ఒకరిద్దరు అర్జునరావుని శాంతింప జేయటానికి ప్రయత్నించారు.

"అండమాన్ దీవుల్లో ఒకదానిలో దట్టమైన అడవి మధ్య వుంది. అక్కడి ఆటవికుల్లోగానీ, లేదా పోర్ట్ 'బ్లయిర్' లో పోర్టర్ నడిగినా చెబుతారు ఆ ప్రదేశం గురించి. ఆ దేవుడి పేరు త్రినేత్రుడు. దమ్ములుంటే వెళ్ళి సాధించుకురా!" ఆచార్య సవాలు చేశాడు.

అర్జునరావు గర్వంగా తన మీసాల్ని దువ్వుకున్నాడు. ఆ తర్వాత అందరికేసి చూసి చిరునవ్వు నవ్వాడు.

"మిస్టర్ ఆచార్య! మీ సవాలు ఎదుర్కొంటున్నాను. నా ఫ్రెండ్స్ మరో ఇద్దరు వస్తున్నారు. వాళ్ళు రాంగానే అండమాన్స్‌కి స్టార్ట్ అవుతాం. ముగ్గురం ఆ అమూల్య వజ్రాలను సాధించుకు వస్తాం. కావాలంటే నీవు మాతో రావచ్చు, ప్రత్యక్ష సాక్షిగా."

"నిజంగానే వెళుతున్నారా? మొత్తానికి మీరు అసాధ్యులండీ! మిలటరీ మనిషిగదా!" ఎవరో అర్జునరావుని అభినందించారు.

ఆ తర్వాత ఆచార్య, అర్జునరావు లిద్దరూ బిలియర్డ్స్ బోర్డు దగ్గరకు వెళ్ళి ఆటలో మునిగిపోయారు.

## 2

టెలిగ్రామ్ చూసి విసుక్కున్నాడు అర్జునరావు. తన మిత్రుల రాకకోసం తను ఎదురు చూస్తున్నాడు. ఈ హోటల్లో తను రూమ్ బుక్ చేసి సరిగ్గా వారంఅవుతోంది. రఘురాం, కృష్ణయ్య లిద్దరూ కావలసిన 'సరుకు' వేసుకుని త్వరలోనే వస్తారని వేచి వున్నాడు అర్జునరావు. వాళ్ళిద్దరూ ఈరోజే రావాల్సివుంది తమ ప్రోగ్రామ్ ప్రకారం. అక్కడేదో పనివుండి ఆగిపోయామనీ, ఇంకో నాలుగైదు

రోజుల్లో తప్పకుండా వచ్చేస్తామని టెలిగ్రామ్ ఇచ్చారు.

ఈ వారం రోజులకే అర్జునరావుకు బోర్ కొడుతోంది. పైగా ఈ 'క్లాస్' హోటల్లో డబ్బు మంచినీళ్ళలా ఖర్చవుతోంది. ఎంతసేపూ పేకాట, బిలియర్డ్స్‌ని ఆడుతూ డ్రింక్స్ సేవించటంతో తనకు విసుగెత్తుతోంది.

అందుకే అతడు అలా బయటకు వెళ్ళి రావాలనుకున్నాడు. హోటల్‌కి అరమైలు దూరంలోనే అడవి మొదలవుతోంది. గన్ తీసుకుని వేటకని అడవిదాకా నడిచాడు. నిజానికి ఆ అడవిలో అనుమతిలేకుండా వేటాడరాదనే నియమముంది. కాని అర్జునరావుకి ఏదైనా 'అడ్వెంచర్' సాహసకార్యం చేయాలనీ, తద్వారా కొంతఉబుసుపోకగా ఉంటుందనే అతడు అడవిలోకి చొరబడ్డాడు.

పెద్దపెద్ద చెట్లమీద రకరకాల పక్షులూ, కోతులూ, కుందేళ్ళు కనుపించినయ్. మరో చెట్టుమీదనుంచి క్రిందకు వ్రేలాడుతూ కొండచిలువ ఒకటి కనుపించింది. ఒకటి రెండు పక్షుల్ని కాల్చాడు అర్జునరావు.

ఏవైనా దుప్పులుగానీ, ఎలుగుబంట్లుగానీ తారసపడతాయేమో అని ఇంకా లోపలకు వెళ్ళాడు. చిన్న సెలయేరు వేగంగా పారుతోంది. అడవిలో నీళ్ళున్న చోటికి విధిగా అనేక జంతువులు దప్పిక తీర్చుకోవటంకోసం వస్తయ్యని అతడికి బాగా తెలుసు. అందుకే ఏటి ఒడ్డునే కూర్చుని తుపాకిని గురిపెట్టి చెట్లమీదకు చూస్తూన్నాడు.

ఒకవైపుగా చెట్లమీద పక్షులు ఒక్కసారిగా అరుస్తూ ఆ చెట్టుమీదనుంచి ఈ చెట్టుమీదకూ, ఇటునుంచి అటూ ఎగిరినయ్. ఆ కలకలం విని అక్కడ నేలమీద ఏదో జంతువు వస్తూండాలని ఊహించాడు అర్జునరావు.

తను కూర్చున్న చోటినుంచి లేచి ఒక చెట్టుచాటుగా

నక్కాడు అర్జునరావు. ఆ వస్తున్న జంతువేమిటా అని ఆసక్తిగా చూడసాగాడు.

అతడికి ఆశ్చర్యం కలిగింది. చెట్లగుంపుల్లోంచి ఒక వ్యక్తి ఆదరా బాదరాగా పరుగెత్తుకు వస్తున్నాడు, ఎవరో తరుముకొస్తున్నట్టుగా. అతడు అర్జునరావుకు దగ్గరగా వచ్చాడు. ఒక్క నిముషం ఆగి అలుపు తీర్చుకున్నాడు. ఆ తర్వాత తన చుట్టూ పరికించి చూశాడు. కనుచూపు మేరలో యెవరూ లేరని నిర్ధారించుకుని, తన జేబులోంచి సిగరెట్ పెట్టె సైజులో ఉన్న టిన్ తీశాడు. అతడి కెదురుగా వున్న పెద్దచెట్టుకు, నేలమీదనుంచి నాలుగడుగుల ఎత్తున తలదూరేటంత సైజులో తొర్రవుంది. తన చేతిలోని 'టిన్' ని ఆ తొర్రలోకి జారవిడిచాడు.

మరుక్షణంలో మరో దిశగా అతడు పరుగు లంకించుకున్నాడు. అర్జునరావు ఆ వ్యక్తిని గుర్తుతెచ్చుకోవటానికి ప్రయత్నించాడు. అతడూ తనుంటున్న హోటల్లోనే మకాం చేశాడు అతని పద్ధెనిమిదేళ్ళ కొడుకుతో.

అంతలోనే ఆగంతకుడు పారిపోయివచ్చిన దిశనుంచి మరో ఇద్దరు వ్యక్తులు పరుగెత్తుకొచ్చారు. చెట్టుతొర్ర దగ్గరే వారూ ఆగారు. తాము వెంబడించే వ్యక్తి ఎటుగా పరుగెత్తాడా అని నాలుగుదిక్కులా చూశారు. తూర్పు దిశలో పారిపోతున్న వ్యక్తి వాళ్ళ కంటబడ్డాడు.

"అదుగో! అటుగా పారిపోతున్నాడు!" వాళ్ళలో ఒకడు అరిచాడు.

ఇద్దరూ ఆ వ్యక్తిని వెన్నాడుతూ పరుగెత్తారు.

అర్జునరావు తను దాక్కున్న చాటుప్రదేశంనుంచి బయటకు వచ్చాడు. ఆ ఇద్దరు వ్యక్తులూ మొదటి మనిషిని యెందుకు వెన్నాడుతూన్నట్టు. వాళ్ళకు భయపడి పారిపో

వలసిన పనేమొచ్చింది? ఆ మొదటి వ్యక్తితో తను రెండు రోజుల క్రితం మాట్లాడాడుకూడా.

అతను త్రివేంద్రంనుంచి వచ్చినట్టుగా చెప్పాడు. మైసూర్‌లో ఏనుగుల్ని పట్టుకునే విధానాన్ని చూడటానికి తనూ, తన కుమారుడూ వచ్చినట్టుగా చెప్పాడు. అటువంటి వ్యక్తి యెవరినో చూసి భయపడి పారిపోవలసిన అవసరం ఏమొచ్చిందని? ఎవరి సహాయం కోసమన్నా అరించవచ్చుగదా?

తను పరిశోధించటానికి పని తగిలిందనే ఆనందంతో అర్జునరావు అడవిలోంచి తిరుగుముఖం పట్టాడు.

రిసెప్షన్‌లో క్లర్కుని అడిగాడు. "ఆ పిల్లిగడ్డం ముసలాయనా, ఆయన కొడుకూ ఎన్నో నెంబరు గదిలో ఉన్నారు?"

"డాక్టర్ నారాయణన్, ఆయన కుమారుడి గురించేనా మీరడిగేది? వారు ఇరవయ్ తొమ్మిదిలో వున్నారు."

"వాళ్ళు ఎన్నాళ్లు బుక్ చేశారు?"

"ఒక గడువు అంటూ ఏంలేదు!"

"థాంక్యూ మాడమ్!" అంటూ అర్జునరావు డైనింగ్ హాల్ వేపుగా అడుగులు వేశాడు. హాల్లో ఒక టేబుల్ ముందు నారాయణన్ కుమారుడు కూర్చుని ఉన్నాడు కోడ్డుమీదకు చూస్తూ. అతడి ముఖంలో ఆందోళన వ్యక్తం అవుతోంది. మరో టేబుల్ ముందు కూర్చుంటూ హాల్ అంతా కలయజూశాడు. అడవిలో తను చూసిన ఇద్దరు వ్యక్తులూ ఉన్నారు. వాళ్ళిద్దరూ డ్రింక్స్ 'సిప్' చేస్తూ మెల్లిగా తమలో తాము గుసగుసలాడుకుంటున్నారు. మధ్య మధ్యలో ఆ కుర్రవాడికేసి చూస్తున్నారు.

అర్జునరావు డ్రింక్స్‌కి ఆర్డరిచ్చాడు. ఆ ముగ్గుర్నీ గమ

నిస్తూ చాలాసేపు గడిపాడు. డిన్నర్ టైమ్ అయింది. అగంతకు లిద్దరూ లేచి వెళ్ళిపోయారు. ఆ కుర్రవాడు మాత్రం కదలకుండా అలాగే కూర్చున్నాడు రోడ్డు మీదకు చూస్తూ.

అర్జునరావు అక్కడా అక్కడా వాకబుచేసి ఆ ఇద్దరు వ్యక్తుల గురించీ తెలుసుకున్నాడు. అందులో పొడవాటి వ్యక్తి పేరు కణ్ణన్. కొంచెం పొట్టిగా లావుగా వున్నవాడి పేరు అహమ్మద్. వాళ్ళ విషపు చూపుల్ని బట్టి వాళ్ళి ద్దరూ దుర్మార్గుల్లా ఉన్నారనుకున్నాడు అర్జునరావు.

కణ్ణన్, అహమ్మద్‌ల వెనుక అసలు 'మాస్టర్' మరో వ్యక్తి వుండి తీరాలనుకున్నాడు అర్జునరావు. అయితే వీళ్ళకు డాక్టర్ నారాయణన్ నుంచి రాబట్టుకోవలసిన సమాచారం ఏముంటుంది!

డాక్టర్ నారాయణన్ కుమారుడ్ని చూస్తుంటే జాలి కలుగుతోంది. అతడికి తను చూసిన విషయం చెప్పాలా వద్దా అన్న మీమాంసలో పడ్డాడు అర్జునరావు. బహుశా ఆ ముక్కుపచ్చలారని కుర్రవాడు ఆత్రుతగా తన తండ్రి కోసమే ఎదురు చూస్తున్నాడేమో! పోనీ వెంటాడిన ఆ ఇద్దరి గురించీ పోలీసులకు రిపోర్టు ఇస్తేనో! ప్చ్! లాభం ఉండదు. వాళ్ళు డాక్టర్ నారాయణన్‌కి ప్రత్యక్షంగా అపకారం తలపెట్టినట్టుగా ఋజువు దొరకద్దూ పోలీసులకు. కనుక ఆ పనివల్ల ఉపయోగం వుండదు.

కాని ఒకటి మాత్రం ఖాయం. ఆ తండ్రీ కొడుకు లిద్దరూ ప్రమాదంలో ఉన్నారు. వాళ్ళను అగంతకులు హత్య చేయటానికిగూడ వెనుకాడరేమో! తండ్రిని హతం చేసిన తర్వాత వాళ్ళ తరువాతి లక్ష్యం కొడుకు పని పట్ట టమే. వాళ్ళకు కావలసిన సమాచారం దొరికేదాకా ఆ

పక్రవాడ్ని గూడ వదలరు.

అయితే ప్రాణాలకు సైతం తెగించి, డాక్టరు తను కాపాడాలని చూసే ఆ సమాచారం దేన్ని గురించి అయి వుంటుంది?

వాచీ వంక చూసుకున్నాడు అర్జునరావు. భోజనాల టయిమ్ కావస్తున్నది. అర్జునరావు హాలంతా కలయ జూశాడు. వాళ్ళిద్దరూ అక్కడ లేరు. తను కుర్చీలోంచి లేచి ఆ పక్రవాడి టేబుల్ దగ్గరకు వెళ్ళి అతడి కెదురుగా కుర్చీలాక్కుని కూర్చున్నాడు.

"మీ నాన్నకోసమేనా ఎదురు చూస్తున్నది?" అని అడిగాడు, అతడి ముఖంలోకి చూస్తూ.

"అవునండీ! మీ రెవరు?"

"నేనూ పదహారో నెంబరు రూమ్‌లో ఉంటున్నాను. ఇందాక ఇద్దరు వ్యక్తులు అక్కడ కూర్చుని వెళ్ళారు, గుర్తుందా? ఆ వెధవలు మీ నాన్నను వెంబడించడం చూశాను! బహుశా ఆయనకేమైనా ప్రమాదం తలపెడతారేమో!"

"అలాగాండీ!" అతడు ఇంకా భయపడిన వాడిలా కనుపించాడు.

"ఎందుకయినా మంచిది. మీ నాన్న పోలీసుల హెల్ప్ అడగటం మంచిది. ఆ వ్యక్తులిద్దరూ ఎంతకయినా తెగించిన వాళ్ళలా కనుపిస్తున్నారు."

"మా నాన్నగారు రాగానే అలాగే చెబుతాను సర్! థ్యాంక్స్ ఫర్ యువర్ ఇన్‌ఫర్మేషన్!" అన్నాడు కృతజ్ఞతా పూర్వకంగా.

"అన్నట్టు నీ పేరు!" కుర్చీలోంచి లేస్తూ అడిగాడు అర్జునరావు.

"నా పేరు మురుగన్ అంటారండీ!"

# 3

అర్జునరావుకి మనసులో ఆరాటంగా వుంది. డిన్నర్ చేసేటప్పుడు గూడ అతగాడికి, నారాయణన్ చెట్టు తొర్రలో జారవిడిచిన వస్తువు మీదనే మనసు లగ్నమై వుంది.

భోజనం పూర్తి చేసి కాసేపు నిద్రపోయాడు అర్జునరావు. ఒక గంటసేపు బాగా నిద్రతీశాక, మళ్ళీ డ్రెస్ వేసుకుని గన్ చేత్తో పుచ్చుకుని అడవి వేపుగా వెళ్ళాడు.

అతడి దృష్టి చెట్లమీద పక్షులమీద లేదు. తొఱ్ఱగా ఉన్న చెట్టుమీదనే లగ్నమైంది.

చెట్టు తొఱ్ఱ దగ్గరకు వెళ్ళి తొఱ్ఱలోకి చేయి దూర్చాడు. కాని అతడికి క్రింద నేల తగల్లేదు. ఆ మాను క్రిందివరకూ తొఱ్ఱ వుండాలనుకున్నాడు. మళ్ళీ తన నెవరైనా అనుమానిస్తారేమో అని ఇవతలకు వచ్చి రెండు మూడు పక్షుల్ని కాల్చాడు.

"ఈ అడవిలో తుపాకిని ఉపయోగించరాదండీ!"

ఎవరిదో కంఠం విని అర్జునరావు తల ప్రక్కకు త్రిప్పి చూశాడు. తన వెనుకనే కన్నన్ నిలబడి ఉన్నాడు నవ్వుతూ.

"నిబంధనను అతిక్రమిస్తే ఏం చేస్తారో చూద్దాం అనే ఇక్కడ ఆ పని చేస్తున్నాను" తల బిరుసుగా సమాధానం చెప్పాడు.

"ఏమైనా కొత్తరకం పక్షుల్ని కొట్టారా! అడవి లోపలకు వెళ్ళి, పులులుగానీ, ఎలుగుబంట్లుగానీ దొరుకుతాయేమో చూడకపోయారా?"

"ఏదో ఉబుసుపోకకు వచ్చాను. అడవి లోపలకు వెళ్ళేటంత తీరిక లేదు."

కన్నన్ ఆ సమయంలో అక్కడకు ఎందుకు వచ్చినట్టు అని సందేహపడ్డాడు అర్జునరావు.

చెట్టు తొఱ్ఱలోంచి ఆ వస్తువుని బయటకు తీసే ప్రయత్నానికి స్వస్తి చెప్పి హోటల్ వేపుగా నడిచాడు. కన్నన్ గూడా అతడితో ఆ మాటా ఈ మాటా చెబుతూ అతడి వెంటే వస్తున్నాడు.

హాల్లో మురుగన్ కనుపించాడు. అన్నం గూడా తినకుండా అలానే తండ్రికోసం ఎదురు చూస్తూ కూర్చున్నాడేమో అలిసినట్టుగాను, నీరసంగానూ కనుపించాడు.

"డ్రింక్ తీసుకుందాం రండి!" అని అహ్వానించాడు కణ్ణన్.

వాడి పీడా వదలించుకోవడానికి అర్జునరావు వాడి ఆఫర్ ని నిరాకరించాడు. "నో! థ్యాంక్స్! వెళ్ళి స్నానం చేయాలి" అంటూ మెట్లెక్కి పై అంతస్థులోని తన గదిలోకి వెళ్ళి పోయాడు.

గన్ గోడకు తగిలించి బెడ్ మీద వాలిపోయాడు. రెండు నిముషాలు గడిచాయో లేదో, డోర్ హ్యాండిల్ క్రిందకు వాలింది. ఆ హ్యాండిల్ని బయటినుంచి ఎవరో త్రిప్పుతున్నారని, మరుక్షణంలో ఆ వ్యక్తి లోపలకు వస్తాడని ఊహించిన అర్జునరావు "ఎవరది" అని అరిచాడు.

"నేనే సార్! మీ కోసమై చాలా సేపట్నుంచి ఎదురు చూస్తున్నాను" అంటూ తలుపు నెట్టుకుని మురుగన్ లోపలకు వచ్చి తన వెనుకనే తలుపు మూసి గడియ పెట్టాడు.

"కూర్చో మిస్టర్! ఏమిటి సమాచారం?" నైట్ గౌన్ తొడుక్కుంటూ ప్రశ్నించాడు అర్జునరావు.

"మా నాన్నగారు ఇంతవరకూ తిరిగి రాలేదు. ఉదయం

ఎనిమిది గంటలకనంగా బయటకు వెళ్లారు. ఆయనకు ఏదన్నా ప్రమాదం జరిగి ఉండదు కదా?'' అతడి మాటల్లో ఆతృత గోచరిస్తోంది.

అర్జునరావు ఒక్క నిముషం ఆలోచించాడు. తను ఏం జరుగుతుందని అనుమానిస్తున్నాడో అదే జరిగేలా ఉంది. తనకూ ఏం చేయటానికీ పాలుపోవటం లేదు. ఈ కుర్ర వాడూ నిస్సహాయుడుగా కనిపిస్తున్నాడు. ఇంతకీ అతడి తండ్రి వద్దనున్న రహస్య సమాచారం దేన్ని గురించి? ఇతగాడికేమైనా తెలుసేమో!

"నేను సాయంకాలం మళ్ళీ అడవిలోకి వెళ్ళినప్పుడు ఆ కణ్ణన్ నా వెనుకే వచ్చాడు దొంగచాటుగా. నా వెంట ఎందుకు పడ్డాడో నా కర్థం కాలేదు.''

"అలాగా! మధ్యాహ్నంనుంచి హాల్లో అహమ్మద్ ఒకడే కనుపించాడు. రెండోవాడు ఏమైనాడా అని మథన పడ్డాను. వాడు గూడ ఒక గంట తర్వాత వెళ్ళి పోయాడు.''

"వాళ్లు మీ నాన్న వెంట ఎందుకు పడుతున్నారో నీకు తెలుసా? మీ నాన్న దగ్గర వాళ్లకు కావలసిన సమా చారం ఏమిటి?'' అర్జునరావు అడిగాడు.

"అదేమిటో నాకూ తెలియదు. కాని మా నాన్న తన వెంట చిన్న సిగరెట్ కేస్‌లాటిది భద్రంగా ఉంచు కుంటాడు. అందులో ఏముంటుందో, లేదా దాన్ని అంత ప్రాణప్రదంగా ఎందుకు చూసుకుంటున్నాడో నాకు తెలీదు!''

"ఆయన స్వంత కొడుకువైన నీకూ చెప్పనేలేదా? లేక నీవే అడగలేదా?''

"ఎందుకడగలేదు! అడిగాను అనేకసార్లు. కాని

ఆయనే చెప్పలేదు. అవసరమొచ్చినప్పుడు నేనే చెబుతాన్లే అని కసిరాడు" మురుగన్ అమాయకంగా చెప్పాడు.

"అయితే ఎన్నాళ్లనుంచి వీళ్లు మీ నాన్నను వెంటాడుతున్నారు?"

"సుమారు రెండు నెలలనుంచి. మేం అండమాన్ నుంచి త్రివేండ్రం చేరాం. అక్కడనుంచి బెంగుళూరు, మైసూర్, కొచ్చిన్, పాండిచ్చేరి, మద్రాసు, మహాబలిపురం తిరిగి ఇక్కడకు వచ్చాం. అన్ని చోట్ల మారు పేర్లతోనే వ్యవహరించాం. కాని రామేశ్వరం పోయినా శనేశ్వరం పోలేదన్నట్టు వీళ్ళు మా ఉనికిని వెదికి పట్టుకని, మా వెంట పడుతున్నారు."

"మీ నాన్న ఈ వ్యవహారాన్ని ఇంతదూరం రానివ్వకుండా జాగ్రత్తపడాల్సింది. ఇలా వాళ్లకు భయపడి పారిపోతే, ముల్లోకాలు తిరిగినా, వాళ్ళు వెంటాడుతూనే ఉంటారు."

"ఏమిటో అంతా అయోమయంగా వుంది. ఏం చేయాలో నాకూ పాలుపోవడం లేదు."

తలుపుమీద ఎవరో తట్టారు. మురుగన్ భయంగా చూశాడు. "బహుశా ఆ ఇద్దర్లో ఒకరై ఉంటారు! మనం ఏం మాట్లాడుకుంటున్నామో కనిపెట్టటానికి వచ్చి ఉంటాడు" అన్నాడు.

"ఏం భయంలేదు. వాడ్ని నేను సాగనంపుతాన్లే!" అంటూ అర్జునరావు లేచాడు కుర్చీలోంచి.

"ఏమిటో ఈ హోటల్లో! ఎప్పుడూ ఎవరో ఒకరు వస్తుంటారు, డిస్టర్బ చేస్తుంటారు!" పెద్దగా విసుక్కుంటూ తలుపు తీశాడు.

"ఎదురుగా కణ్ణన్ నిలబడి ఉన్నాడు. అర్జునరావు మాటలు విన్నాడేమో, ముఖం మాడ్చుకున్నాడు.

"ఓ! మీరా! నాతో ఏదైనా పని ఉందా?" అర్జునరావు అడిగాడు.

"పనేం లేదండీ. ఊరికే ఉబుసుపోకకు వచ్చాను."

"సారీ! నేనిప్పుడు బిజీగా ఉన్నాను" అని చిరునవ్వు నవ్వాడు అర్జునరావ్! "లోపల అమ్మాయి ఉంది!" అన్నాడు చిన్నగా.

కణ్ణన్ కూడ నవ్వాడు. "అదా సంగతి! విష్‌యూ హ్యాపీ నైట్!" అంటూ గబగబ అడుగులు వేసుకుంటూ వెళ్ళిపోయాడు.

## 4

అర్జునరావు సిగరెట్ వెలిగించాడు. "అయితే ఇప్పుడు ఏం చేద్దాం అంటావు?" అని అడిగాడు మురుగన్ వంక చూస్తూ.

"అదే నాకూ అర్థం కావటం లేదు. అందుకే గదా మీ దగ్గరకు వచ్చింది!"

"ఇవాళ ఎటూ రాత్రయింది. ఒకవేళ ప్రొద్దుపోయాక వస్తాడేమో చూద్దాం. అప్పటికీ రాకపోతే రేపుదయం వెదుకుదాం. ఆఖరి ప్రయత్నం పోలీసు రిపోర్టు ఇవ్వడం! ఏమంటావ్!"

"అలాగే సార్! నాకు ఇక మీరే దిక్కు! మా నాన్న ఈ రాత్రికి వస్తే మీ గురించి చెప్పి, మీ సహాయం అడగమని చెబుతాను" అంటూ మురుగన్ కుర్చీలోంచి లేచాడు.

తలుపుతీసి బయటకు తొంగి చూచాడు. ఎవరూ లేరని నిర్ధారణ చేసుకుని కారిడర్‌లోంచి గబగబ అడుగులు వేసుకుంటూ తన రూమ్‌లోకి వెళ్ళిపోయాడు.

సిగరెట్ పొగ వదులుతూ కిటికీ వద్దకు వచ్చి నిలబడ్డాడు అర్జునరావు. ఆకాశం మేఘావృతమై, దట్టంగా నల్లగా వుంది. ఈ రాత్రికి వాన వస్తుంది అనుకున్నాను. సిగరెట్ క్రిందకు జారవిడిచి డైనింగ్ హాల్ వేపుగా వెళ్ళాడు.

హాల్లో భోజనం చేస్తున్నారు కొంతమంది. రాత్రి ఆట్టే పొద్దుగూక లేదు, అందుకే జనం రాలేదు ఇంకా అనుకుంటూ టేబుల్ కోసం నాలుగు వేపులా కలయజూశాడు అర్జునరావు.

ఒక టేబుల్ ముందు కూర్చుని అన్నం తింటున్నాడు కణ్ణన్. చేయి పైకెత్తి ఊపుతూ అర్జునరావుకేసి సైగ చేశాడు రమ్మని. అర్జునరావు గూడ అక్కడకే వెళ్ళి కూర్చున్నాడు.

సర్వర్ భోజనం వడ్డించాడు. మరో రెండు ప్లేట్లు తెచ్చి అతడి ముందు ఉంచాడు. "ఇవిగో సార్! మధ్యాహ్నం మీరు షూట్ చేసిన వాటిని కూర చేశాను" అంటూ చెప్పాడు.

"వెరీ గుడ్! కణ్ణన్! నీవూ ఒక ప్లేటు తీసుకుని రుచి చూడు" అంటూ ఆఫర్ చేశాడు అర్జునరావు.

"థ్యాంక్యూ!" అంటూ కణ్ణన్ తన కృతజ్ఞత తెలియజేశాడు.

అన్నం తింటూనే ఇద్దరూ ఏవేవో కబుర్లు చెప్పుకున్నారు. కాసేపట్లో ఇద్దరూ స్నేహితులై పోయారు.

"కణ్ణన్! నేనో విషయం అడుగుతాను. నిజం చెబుతావా?"

"అడగండి సార్!" కణ్ణన్ నవ్వుతూ అన్నాడు.

వర్షం మొదలయింది బయట. ఉరుములూ మెరుపులతో

కుండ పోతపోస్తోంది ఆకాశం.

"డాక్టర్‌నుంచి మీకు కావలసిన సమాచారం దేన్ని గురించి?" అర్జునరావు సూటిగా అతడి కళ్ళలోకి చూస్తూ అడిగాడు.

కణ్ణన్ ముందు ఆశ్చర్యపోయాడు. "అతడ్ని మేం వెంటాడుతున్నట్టుగా మీకెలా తెలుసు?" అనడిగాడు.

ఇద్దరూ ఒక్క క్షణం మౌనంగా ఒకరి నొకరు చూసుకున్నారు.

"మీరు పోలీసు శాఖలో పనిచేశారా?"

"లేదు. మిలిటరీలో చేసి రిటైరయాను" అర్జునరావు గర్వంగా బదులు చెప్పాడు.

"నేను చెప్పేది చాలా రహస్యం. ఎవరికీ తెలియనివ్వకండి. ఆ డాక్టరు ఇదివరలో అండమాన్‌లో పనిచేసేవాడు. అక్కడ పెద్ద బిజినెస్ మాన్‌కి ఇతడు ఫ్యామిలీ డాక్టరు. ఆ వ్యాపారస్తుని పేరు 'గోపల్లవ.' అతడు సింహళానికి చెందినవాడు. రెండు సంవత్సరాల క్రితం సింహళంలో అతడేవో ప్రభుత్వ వ్యతిరేక చర్యల్లో పాల్గొన్నాడని దేశంనుంచి వెళ్ళగొట్టబడ్డాడు."

"అంటే కమ్యూనిస్టు ఉద్యమంలో ఈమధ్య సింహళ ప్రభుత్వం చాలా మందికి మరణశిక్ష విధించింది. ఆ ఉద్యమంలో ఇతడికీ పాత్ర ఉంది కాబోలు."

"ఏమో తెలీదు. ఏమయితేనేం అతడు తను దాచుకున్న ధనంతోసహా సింహళంలోనుంచి బయటపడి ఇక్కడ స్థిరపడ్డాడు. అతడివద్ద విలువైన వజ్రాలూ, బంగారమూ, వెండి ఉన్నదట. అతడు నాలుగు నెలల క్రితం జబ్బుపడ్డాడు. ఈ నారాయణన్ అతడికి వైద్యం చేశాడు. ఈతని హస్తవాసివల్ల అతగాడు స్వర్గానికి టికెట్ పుచ్చు

కున్నాడు. అతడి ధనమంతా ఈ నారాయణన్‌కి అప్ప గించాడని మా బాస్ అనుమానం.” కన్నన్ ‘బాస్’అన్న చోట నాలుక కరుచుకున్నాడు.

“మీ బాస్ ఎవరు?” అర్జునరావు వదల్లేదు. నిలదీసి అడిగేశాడు.

“అదే! ఆ వ్యాపారస్థునికి చట్టరీత్యా వారసుడు. అతని మరణానంతరం ఆ డబ్బంతా మా బాస్‌కే గదా రావ ల్సింది. కాని ఈ డాక్టర్, తన పేరిట ఆ ధనాన్నంతా రాసేసినట్టుగా విల్లు గూడా సృష్టించుకున్నాడు. ఇది ఎంత అన్యాయం చూడండి!”

“నిజమే మరి!” అర్జునరావు సానుభూతి వ్యక్తపరి చాడు. “ఇంతకీ ఆ ధనం ఎక్కడున్నట్టు?”

“అదే ఆచూకీ చిక్కలేదు. ఆ వ్యాపారస్థుని ఇల్లు మా బాస్ స్వాధీనం చేసుకున్నాడు. ఇల్లంతా గాలిం చినా ఎక్కడా ఒక్క విలువైన వస్తువూ దొరకలేదు. బహుశా దాన్నంతా ఎక్కడో గుప్తంగా దాచిఉంచి, ఆ ప్రదేశాన్ని నారాయణన్‌కి చెప్పి ఉండచ్చని మా అను మానం. అందుకే నారాయణన్ వెంటబడ్డాం! వీడు మా చేతికందకుండా దేశాలు పట్టి తిరుగుతున్నాడు. చూస్తాం! వీడి ఆట ఎన్నాళ్ళు సాగుతుందో!” కన్నన్ పళ్ళు కొరి కాడు.

“ఆ చనిపోయిన వ్యక్తి మిగిల్చిపోయిన ధనం ఎంత ఉంటుందేమిటి?”

“సుమారు ఏడెనిమిది లక్షలుండవచ్చు!”

“అబ్బా! పెద్ద మొత్తమే!” అంటూ ఆశ్చర్యపడ్డ వాడిలా నోరు తెరిచాడు అర్జునరావు.

“ఈ విషయంలో మీనుంచి చిన్న సహాయంకావాలి!”

కణ్ణన్ కొద్దిగా ముందుకు వంగి అడిగాడు.

"ఏమిటది?"

"ఆ కుర్రవాడు మీతో స్నేహంగా ఉంటున్నట్టున్నాడు. అతడి నుంచి మాకు కావలసిన సమాచారం రాబట్టాలి!"

అర్జునరావు చిన్నగా చిరునవ్వు నవ్వాడు. "దాని దేముంది. చాలా తేలిక! కానీ అందుకు నా ఫీజు!"

"భలేవారే సార్! మా బాస్‌కి చెప్పి మీకు మంచి బహుమతి ఇప్పించవమూ."

"అయితే తప్పకుండా ప్రయత్నిస్తాను. రేపే! సరేనా?" అర్జునరావు కుర్చీలోంచి లేస్తూ హామీ ఇచ్చాడు.

కణ్ణన్ ముఖంలో ఆనందం అలుముకుంది.

## 5

హోరుగాలితో వాన ఉధృతమైంది. తుఫానులాగ మారుతుందేమో ఈ వాన అనుకుంటూ అర్జునరావు సిగరెట్ వెలిగించి కిటికీలోంచి బయట అంధకారంలోకి చూస్తూ కూర్చున్నాడు. ఏడెనిమిది లక్షలు! ఆ ధనాన్ని తను చేజిక్కించుకోగలడా? పులి కోరల్లాంటి 'బాస్' నుంచి తప్పుకుంటూ తమ బృందం సఫలీకృతం కాగలదా? ఏమైనా సరే ప్రయత్నించి చూడాలనుకున్నాడు.

రేపుదయం లేస్తూనే అడవిలోకి వెళ్ళి ఆ చెట్టు తొఱ్ఱలోని వస్తువుని చేజిక్కించుకోవాలి. అందులో తప్పకుండా ఆ గుప్తధనం ఎక్కడ దాచిపెట్టబడిందో వివరాలుంటయ్. కన్నన్, అహమ్మద్‌లకు తెలియకుండా ముందు దాన్ని సంగ్రహించాలి.

లేచి బెడ్ మీద వాలిపోయి, వెచ్చగా దుప్పటి కప్పుకున్నాడు. గుప్తధనం గురించి ఊహించుకుంటూ నిద్రలోకి జారిపోయాడు.

తెల్లవారింది. మబ్బులు తేలిపోయి ఆకాశం నిర్మలంగా ఉంది. సరోవరంలో హంసల్లా అక్కడక్కడ తెల్లని మేఘ శకలాలు తారాడుతున్నాయ్. సూర్యుడు పైకి లేస్తూండగానే చిటపటలాడుతూ ఎండ ప్రసరించింది.

అర్జునరావు కాలకృత్యాలు తీర్చుకున్నాడు. పిస్టల్ తీసి జేబులో వేసుకున్నాడు. ఆ తర్వాత అడవిలోకి బయలుదేరాడు. మెట్లు దిగి మళ్ళీ ఏదో గుర్తుకు వచ్చిన వాడిలా వెనక్కి తిరిగి వచ్చాడు.

డ్రాయరు లాగి అందులోంచి ఆరడుగుల వైర్ రోప్, సిగరెట్ టిన్ సైజులో మాగ్నెట్ కట్టిఉంది రోప్‌కి చివరగా, దాన్ని తీసి జేబులో కుక్కుకున్నాడు.

అడవిలో చెట్లని పరిశీలనగా చూస్తూ ముందుకు పోతున్నాడు నెమ్మదిగా అర్జునరావు.

ఒకచోట ఆగిపోయాడు. ఒక చెట్టు చాటుగా నక్కి జేబులోంచి పిస్టల్ తీశాడు.

డాక్టర్ నారాయణన్ తన 'టిన్'ని జారవిడిచిన చెట్టు దగ్గర అహమ్మద్ నిలబడి ఉన్నాడు. చెట్టు తొర్రలోకి చేయి పూర్తిగా పోనిచ్చి అడుగుభాగాన్ని అందుకోవాలని తంటాలు పడుతున్నాడు.

అర్జునరావు గుండెలు వేగంగా కొట్టుకున్నాయ్. తన చేతికి చిక్కిందనుకున్న లక్షల ధనం చేయిజారిపోయి అహమ్మద్ చేతికి పోతున్నట్టుగా బాధపడ్డాడు. ఒకవేళ ఆ ప్యాకెట్‌ని అహమ్మద్ దొరకపుచ్చుకుంటే, అతడు చెట్టుదగ్గరనుంచి ఒక్క అడుగు వేసేలోపలే అతడ్ని కాల్చిపారేయాలనుకున్నాడు.

అహమ్మద్ ఉన్నట్టుండి "అమ్మో!" అని బాధగా అరిచాడు. తొర్రలోకి జొనిపి వెతుకుతున్న తన చేతిని

వెనక్కా లాక్కున్నాడు. అతడి చేతిలో ప్యాకెట్ ఉందేమో అని ఆత్రంగా తొంగి చూశాడు అర్జునరావు.

అతడి చేతికి చుట్ట చుట్టుకుని గోధుమరంగు త్రాచు పాము బయటికి వచ్చింది. అప్పటికే అతడి చేతిని రెండు మూడు కాట్లు వేసిందేమో, అహమ్మద్ శరీరం రంగు నల్లగా మారిపోయింది. నోటినుంచి నురుగు వస్తున్నది. నేలమీద వెల్లకిలా పడిపోయి కొట్టుకుంటున్నాడు.

అర్జునరావు ఆపదనుంచి బయటపడ్డ వాడిలా రిలీఫ్ అయ్యాడు. అహమ్మద్ రాకముందే తను వచ్చిఉంటే ఏమయి ఉండేది. గాలివానకు ఎక్కడనుంచో త్రాచు పాము వచ్చి ఆ చెట్టు తొర్రలో తలదాచుకుంది. తనూ ఆత్రంగా తొఱ్ఱలోకి చేయి పెట్టంగానే తననూ కరిచేది! ఎంత ప్రమాదం తప్పిపోయింది క్షణంలో. లేకపోతే నేల మీద పడి ప్రాణాలు వదిలిన అహమ్మద్ గతే తనకూ పట్టి ఉండేది. లక్షలు దొరక్కపోగా, ప్రాణాలు సైతం యమ పురికి ప్రయాణం కట్టి ఉండేవి.

అహమ్మద్ చేతికున్న త్రాచుపాము, చేతిని వదలి ఎటో వెళ్ళిపోయింది. తొఱ్ఱలోకి పోలేదని నిర్ధారించు కుని అర్జునరావు చెట్టుదగ్గరకు వెళ్ళాడు. మాగ్నెట్ లోప లకు జారవిడిచాడు, వైర్ రోప్‌ని కొంచెం కొంచెంగా లోపలకు వదలుతూ.

అడుగు తగిలింది. బావిలో బొక్కెనవేసి త్రిప్పినట్టుగా తాడుని తొర్రలో ఆడించాడు. నెమ్మదిగా మళ్ళీ త్రాడుని పైకిలాగాడు.

మాగ్నెట్ పైకి వచ్చింది. దానికి అతుక్కుని సిగరెట్ ప్యాక్ సైజులో 'టిన్' ఉంది. అర్జునరావు ఆనందానికి అంతులేదు. ఎనిమిది లక్షలు విలువగల గుప్తధనం రహస్యం

ఇప్పుడు తన పిడికిలిలో వుంది.

'టిన్' ని ప్యాంటు జేబులో వేసుకుని వైర్ రోప్ ని చుట్ట జుట్టి నిండుగా, వేగంగా పొర్లుతున్న ఏటిలోకి విసిరేశాడు.

తనను ఎవరూ గమనించలేదుగదా అని నాలుగు దిక్కులా చూసి, మరుక్షణం పరుగులాంటి నడకతో ఊళ్లోకి వచ్చి పడ్డాడు.

అది చిన్న ఊరైనా టూరిస్ట్ సెంటర్ అవడం మూలాన్ని నాలుగైదు లాడ్జిలు ఉన్నయ్. తను దిగిన హోటల్ కాకుండా మరో హోటల్లో గది తీసుకున్నాడు. తలుపు లోపల గడియపెట్టుకుని టిన్ విప్పదీశాడు.

లోపల వాటర్ ప్రూఫ్ పేపరులోచుట్టి మరో కాగితం వుంది. ఆ మడత ఊడదీశాడు.

అదొక మ్యాప్. మ్యాప్ లో చిన్నచిన్న ద్వీపా లున్నయ్. అందులోకి పెద్దదైన ఒక దీవి పటంలో ఒక ప్రక్కగా గుర్తించబడివుంది. ఆ దీవిలో సముద్రతీరా న్నుంచి ఎర్రసిరాతో మార్గం చూపుతోంది పటం. ఎర్ర గీత అంతమయేచోట దేవాలయం బొమ్మవుంది.

మ్యాప్ తో బాటు మరో కాగితంగూడ ఉంది టిన్ లో. అది వీలునామా. నారాయణన్ పేరిట తన ధనాన్నంతా వ్రాస్తూ, సింహళ వ్యాపారస్తుడు వ్రాసిన వీలునామా అది.

మరో కాగితం తీసుకుని దానిమీద ఆ మ్యాప్ ని చిత్రిం చాడు యథాతథంగా. వీలునామా కాపీని మ్యాప్ కాపీని మడతపెట్టి చొక్కా లోపలి జేబులో పెట్టుకున్నాడు.

ఒరిజినల్ మ్యాప్ నీ, వీలునామానూ మడిచి టిన్ లో ఉంచేసి, దాన్ని ప్యాంటుజేబులో భద్రపరచాడు.

# 6

పోస్టాఫీసుకు వెళ్ళి తన ఫ్రెండ్స్‌కి వెంటనే వున్న పళాన రమ్మనమని టెలిగ్రాం ఇచ్చాడు. ఉషారుగా ఈల వేసుకుంటూ హోటల్ కి తిరిగి వచ్చాడు.

హోటల్ ముందు జనం గుంపులు గుంపులుగా ఉన్నారు.

"ఏమిటో! ఈ ఊరికి వినాశకాలం వచ్చింది. కాకపోతే ఒకరోజునే రెండు హత్యలా?" ఎవరో అంటున్నారు.

"అసలీ లాడ్జీలవాళ్ళే, డబున్న వాళ్ళను సఫా చేసినా చేస్తుంటారు! ఎవరినీ నమ్మడానికి వీల్లేదు" మరో పెద్ద మనిషి హోటల్ అంతస్తుల్లోకి చూస్తూ గొణిగాడు.

రెండు హత్యలా? ఒకటి నారాయణన్‌ది అయివుండాలని ఊహించుకుంటూ, జనాన్ని చీల్చుకుని లోపలకు వెళ్ళాడు అర్జునరావు.

నేలమీద నారాయణన్ శవం కనుపించింది. నీళ్ళలో తడిసి ఉబ్బిపోయి అసహ్యంగా ఉంది. ఒంటిమీదఅక్కడక్కడా గాయాలున్నయ్. పీకమీద మాత్రం ఎవరో నులిమేసినట్టుగా స్పష్టంగా కనుపిస్తోంది. ఉబ్బిన పీకమీద సన్నని చార భూతద్దంలోంచి చూస్తే పెద్దదిలా కనుపించే విధంగా అవుపిస్తున్నది.

శవం ప్రక్కనే మురుగన్ గొంతుక కూర్చునివున్నాడు, రెండుచేతుల్లోనూ తల పట్టుకుని. అతడ్ని పలకరించకుండానే జనంలోంచి తప్పుకుని రెండో మరణాన్ని చూడటానికి వెళ్ళాడు అర్జునరావు.

ఆ శవం అహమ్మద్‌ది. పాముకాటుచే మరణించిన వ్యక్తిది. తను కళ్ళారా అతడి దారుణ విషాదాంతాన్ని ప్రత్యక్షంగా చూశాడు. ఆ మృతదేహాన్ని చూస్తూనే

ఆతడి ఒళ్ళు గగుర్పొడిచింది. పాముని అతి చేరువలో చూసినట్టుగా ఉలిక్కిపడ్డాడు. అతడి చేయి అప్రయత్నంగా ప్యాంటుజేబుమీదకు పోయింది. జేబులోని ప్యాకెట్ ని తడిమింది.

విషాదవదనంతో కణ్ణన్ యెక్కడనుంచో వస్తున్నాడు.

"మీ స్నేహితుడి మరణానికి చాల విచారిస్తున్నాను. అసలేం జరిగింది?" అనడిగాడు అర్జునరావు.

"అడవిలోకి పోయినట్టున్నాడు పొద్దున్నే! త్రాచు పాము కరిచిందిట. కట్టెలు కొట్టుకునే వాళ్ళు ఆ శవాన్ని చూసి తెలియజేశారు. పోస్టాఫీసుకు వెళ్ళి బాస్ కి టెలిగ్రామ్ ఇచ్చి వస్తున్నాను."

"అలాగా! అన్నట్టు మీ డాక్టరుగూడ టికెట్ పుచ్చుకున్నాడే!"

అంత విచారంలోనూ కణ్ణన్ నవ్వాడు, ఏదో ఘనకార్యం చేసినవాడిలా. అతడిమీద గొంతువరకూ కోపం వచ్చింది అర్జునరావుకి. అయినా దిగమ్రింగుకుని మౌనంగా ఉండిపోయాడు.

పోలీసు కానిస్టేబిల్ వచ్చి మరణాల్ని నమోదు చేసుకున్నాడు. హోటల్ ప్రొప్రయిటర్ అతడ్ని లోపలకు తీసుకువెళ్ళి ఏవో మంతనాలాడాడు. ఇప్పటికే ప్రొప్రైటర్ భయపడిపోతున్నాడు, ఈ మరణాలవల్ల హోటలుకు అప్రతిష్ట వచ్చిందనీ, ఇకముందు యెవరూ తన లాడ్జిలో బసచేయరేమో అని.

ఇప్పుడా శవాల్ని పోస్టుమార్టమ్ చేయాలంటే ఊరికి ఇరవయ్ మైళ్ళ దూరంలోవుంది హాస్పిటల్. అక్కడికి పంపేసరికి ఈ వార్త చుట్టుపట్లగూడ పాక్కిపోతుంది. అందుకే వాటిని సహజ మరణంక్రింద వ్రాయించి అక్కడి

కక్కడే సంస్కారం చేయించాలని ప్రొప్రయిటర్ తాప త్రయం.

అర్జునరావు గుంపులోని వ్యక్తిని అడిగాడు "ఎలా చని పోయాడు ఈయన!" నారాయణన్ దేహాన్ని చూపిస్తూ.

"కట్టెలు కొట్టుకునే వాళ్ళు ఏరు బాగా పొంగినపుడు, కట్టెల మోపుల్ని ఏటిలో వేస్తారు, దిగువకు సరఫరా చేసేందుకు. రాత్రి వానకు ఏరు బాగా పారింది. అందులో మోపులు పడేసినట్టున్నారు. ఆ మోపులకు తగులుకుని ఏటిలో ఆగిపోయింది ఈయన దేహం. కట్టెల వాళ్ళే తెచ్చి పడేశారు."

"సాయంకాలం అడవిలోకి పోయి ఉంటాడు. చీకటి పడి దారి తప్పిపోయి ఉంటాడు. కుంభవృష్టి, ఏరు పొంగ టంతో, ఏటి ఒడ్డున నడుస్తూ, బురద నేలలో కాలుజారి ఏటిలో పడిపోయి వుంటాడు" ప్రొప్రయిటర్ పెద్దగా వివరిస్తున్నాడు పోలీసుకు, అంతా కళ్ళతో చూసినట్టుగా నే.

ప్రక్కనే నిలబడివున్న కట్టెలు కొట్టుకునే వాళ్ళు తలూపుతున్నారు. "అంతేనండీ! అచ్చం అంతే జరి గుండాలి" అని వంత పాడుతున్నారు.

ప్రొప్రయిటర్ తన ఖర్చుతోనే ఆ శవాలకు దహన సంస్కారం ఏర్పాటు చేశాడు. అతని ఔదార్యానికి ఊళ్లో ప్రజలు మెచ్చుకున్నారు.

టైమ్ తెలియకుండానే రాత్రయింది. అర్జునరావుతో మాట్లాడే స్థితిలోగూడ లేదు మురుగన్.

అతడితో ప్లాన్ విషయం రేపుదయం చెప్పచ్చులే అని సరిపెట్టుకున్నాడు అర్జునరావు.

## 7

డైనింగ్ హాల్లో భోజనం చేసేటప్పుడు గూడ కణ్ణన్

కనుపించలేదు అర్జునరావుకి. బహుశా తన సహచరుడి మర ణానికి భయపడ్డాడో, లేక ఇద్దరూ కలిసి నారాయణన్ని హత్యచేసి పొంగి పొరలుతున్న ఏటిలో పారేసి ఉండాలి; ఆ పాపం క్షణాలమీదే పండిపోయి అహమ్మద్ని బలి గొన్నదేమో. ఇక తర్వాత తన గతేమవుతుందో అని కణన్ దీర్ఘాలోచనలో పడి తన రూమ్లోనే పడుకుని ఉన్నాడేమో!

మురుగన్ గతి ఏమవుతుంది? అతడి ఒక్కగానొక్క దిక్కు, తండ్రి చనిపోయాడు. హోటల్ బిల్ చాలా అయి ఉంటుంది. అదంతా ఎలా కడతాడు, అతడి వద్ద డబ్బు ఉందో, లేదో!

సాయంకాలం తన తండ్రియొక్క ప్లీడరుకి టెలిగ్రామ్ ఇచ్చానని చెప్పాడు మురుగన్. అతడు వస్తే, మురుగన్కి అతడి తండ్రి ఏమాత్రం మిగిల్చిపోయాడో బయట పడుతుంది.

భోజనం ముగించి అర్జునరావు తన రూమ్ వేపుగా నడి చాడు. అంతలోనే అతడికి మురుగన్ని పలకరించి వద్దా మనిపించింది. వెనక్కు తిరిగి మురుగన్ గదికి దారితీశాడు.

మురుగన్ గది తలుపులు వారగా వేసి ఉన్నయ్. లోపల్నుంచి సన్నగా మాటలు వినబడుతున్నయ్. అత డితో ఎవరు మాట్లాడుతున్నారా అని ఆశ్చర్యపడ్డాడు అర్జునరావు.

అదే మామూలు పరిస్థితుల్లో అయితే మురుగన్ ఎవర్నో కొత్త స్నేహితుడ్ని సంపాదించాడేమో అని సరిపెట్టు కునే వాడే. కాని ప్రస్తుతం పరిస్థితులు వేరుగా ఉన్నయ్. మురుగన్ తండ్రిని పొట్టన బెట్టుకున్న దుర్మార్గులు తమ కబంధ హస్తాలతో మురుగన్ని కబళించే ప్రయత్నం చేస్తుంటారు.

అనుమానంగానే తలుపు నెట్టాడు అర్జునరావు. మురుగన్ నైట్ డ్రెస్‌లో, పైజమా, ఓపెన్ షర్ట్‌లో ఉన్నాడు. గోడకు ఆనుకుని నిలబడి తన కెదురుగా ఉన్న ఇద్దరు వ్యక్తుల వంక చూస్తున్నాడు. అతడి కళ్ళలో భయం తాండవిస్తోంది.

మురుగన్‌కి ఎదురుగా నిలబడిన వ్యక్తుల్లో ఒకడు కణ్ణన్ అని గుర్తుపట్టాడు అర్జునరావు. రెండో వ్యక్తి కొత్తగా ఉన్నాడు. అతడ్ని లోగడ తను చూసి ఎరగడు. అత డెవరయి ఉంటాడు?

మెరుపులా ఊహ మెరిసించి అంతలోనే. ఉదయమే తమ బాస్‌కి టెలిగ్రామ్ ఇచ్చానని చెప్పాడు కణ్ణన్. బహుశా అతడే ఆ బాస్ అయిఉంటాడు.

నారాయణన్‌ని వెంటాడుతూ ఇప్పటికే చాల టైమ్‌నీ, డబ్బునీ ఖర్చుపెట్టి వుంటారు. ఇంక ఆలసించిన కొద్దీ, కాలమూ గడిచిపోతుంది, ఖర్చూ ఎక్కువౌతుంది. అందుకే అటో ఇటో తేల్చుకోవాలని బాస్ త్వరపడి వచ్చేసి ఉంటాడు అనుకున్నాడు అర్జునరావు.

కణ్ణన్ పిడికిలి బిగించి మురుగన్ మీదకు పోయేవాడల్లా, తలుపు తెరుచుకున్న అలికిడి విని కాబోలు ఆగిపోయాడు. లేదా ఎదురుగా గోడకు వ్రేలాడుతున్న అద్దంలో వాకిట్లో నిలబడిఉన్న తన ప్రతిబింబం చూసి ఉండచ్చు.

నూతన వ్యక్తి వెనక్కు తిరిగి వాకిట్లో నిలబడి ఉన్న అర్జునరావుని చూశాడు. "ఏం పని మీకక్కడ?" అని అడిగాడు. అతడి మాట కర్కశంగా, తాటాకులు గల గల మన్నట్టుగా ఉంది. అతడి కళ్ళు నిప్పులు గ్రక్కుతున్నాయ్.

అర్జునరావు నదురూ బెదురూ లేకుండా లోపలకు

అడుగు పెట్టాడు, "మురుగన్‌తో ఒక విషయం చెప్పటం మరిచాను! అన్నట్టు మీ రెవరు? ఏం చేస్తున్నారు ఇక్కడ?"

"అదంతా నీ కనవసరం!" పళ్ళు కొరికాడు ఆ వ్యక్తి.

"వీరే మా బాస్! అండమాన్స్‌లోని నేను చెప్పిన వ్యాపారస్తుని గుప్తధనానికి ఈయనే చట్టరీత్యా వారసుడు" కన్నన్ తను కలుగజేసుకుని అర్జునరావుకి తన బాస్‌ని పరిచయం చేశాడు. తలుపు దగ్గరకు జరిగి తలుపు మూసేశాడు కన్నన్.

"చూడండి! ఈ కుర్రవాడి తండ్రి అనుమానాస్పద పరిస్థితుల్లో మరణించాడు. అది సహజ మరణమో, హత్యో ఇంకా తేలవలసి వుంది. అతడికి నేనిప్పుడు గార్డియన్‌ని. అయినా మీతో నాకు వాదన ఎందుకు? మురుగన్! ఏమిటిదంతా?" మురుగన్ కళ్ళలోకి సూటిగా చూస్తూ అడిగాడు అర్జునరావు.

"నా దగ్గర రహస్య సమాచారం ఉందనీ, అదేదో వాళ్ళ చేతికివ్వకపోతే నన్నూ మా నాన్న దగ్గరకు పంపిస్తామనీ, కొడుతున్నారు నన్ను!" మురుగన్ దీనంగా చెప్పాడు.

"అవునా?" అంటూ అర్జునరావు కోపంగా బాస్‌కేసి చూశాడు.

బాస్ కుడిచేయి కోటుజేబులోనుంచి పైకి వచ్చింది. ఇప్పుడు అతడి చేతిలో సైలెన్సర్ అమర్చిన పిస్టల్ వుంది.

"అక్కడే కదలకుండా నిలబడు. ముందు ఈ కుర్ర సన్నాసి అంతు తేల్చాక, నీ సంగతేమిటో చూస్తాం!" అంటూ బాస్ కన్నన్‌కి సంజ్ఞ చేశాడు.

కన్నన్ తన కుడిచేతి పిడికిలి బిగించాడు. మురుగన్

పొట్టలో "దభీ" "దభీ" మని రెండు పోట్లు పొడిచాడు. మురుగన్ అమ్మో అంటూ మెలికలు తిరిగిపోయాడు.

"కన్నన్ ఆగు! తొందరపడకండి! మీకు కావలసిన ప్లాన్ నాదగ్గర ఉంది!" అర్జునరావు తురుపు ముక్కను విసిరాడు.

"వాట్! నీ దగ్గరుందా ఆ మ్యాప్! నేను నమ్మను" బాస్ అనుమానంగా చూస్తూ అన్నాడు, అతడు ఏదైనా కొత్త ట్రిక్ వేస్తున్నాడేమో అని.

"మీరు నమ్మినా, నమ్మకపోయినా ప్లాన్ నా దగ్గర ఉంది. కన్నన్ ప్లాన్‌ని సంపాదించి పెట్టినందుకు మీచేత పెద్ద బహుమతి ఇప్పిస్తానని గూడ వాగ్దానం చేశాడు! ఏం కన్నన్?"

"అవును బాస్! అతడు చెప్పేది నిజమే! అర్జునరావ్ గారూ! ఆ ప్లాన్ ఇచ్చేయండి. మీకు వెయ్యి రూపాయలు బహుమానంగా ఇప్పిస్తాను" కన్నన్ బ్రతిమాలుతున్నట్టుగా అడిగాడు.

"మేం ఇన్నాళ్ళనుంచి ఇంతగా శ్రమపడుతున్నా మాకు దొరకలేదు ఆ ప్లాన్! అది ఇప్పుడు నీ చేతికి వచ్చిందంటే మేం నమ్ముతామా?" బాస్ గుర్రుగా అన్నాడు.

అర్జునరావు, నారాయణన్ పారిపోతూ ఆ రేకు పెట్టెను చెట్టు తొఱ్ఱలో ఎలా జారవిడిచిందీ, అహమ్మద్ దాని కోసమై ప్రయత్నించి త్రాచుపాము వాతపడి చనిపోగా, చివరకు దాన్ని తాను ఎలా సంగ్రహించగలిగిందీ క్లుప్తంగా చెప్పాడు.

బాస్ ముఖంలో ఆశ్చర్యం, ఆనందం వెలిసినయ్. సైలెన్సర్‌ని జేబులో పెట్టుకుంటూ "ఏదీ ఆ ప్లాన్ ఇవ్వండి చూస్తాను! అది మాకు సంబంధించినది అవునో కాదో చూడద్దూ?"

"ముందు వెయ్యి రూపాయలు అక్కడ ఉంచండి" అర్జునరావు సెట్టు చేశాడు.

బాస్ తన జేబులోంచి నోట్లకట్టను లాగి బెడ్ మీదకు విసిరేశాడు.

అప్పటిదాకా సంభ్రమాశ్చర్యాలతో గుడ్లప్పగించి వింటున్న మురుగన్ నోరు తెరిచాడు. "వద్దు సార్! వద్దు! నా ప్రాణాలు పోయినా సరే, దాన్ని వాళ్ళకివ్వద్దు. ఆ ఆ సికి నిజంగా వారసుడ్ని నేను" అన్నాడు వణికే కంఠంతో.

"మురుగన్! అత్యాశకుపోయి ప్రాణాలు పోగొట్టుకో వద్దు. నా మాట విను. ఆ ఆ స్తికి నిజమైన వారసులు ఆయనే నంటున్నాడు గదా!" అంటూ బాస్ కేసి తిరిగాడు అర్జునరావు. తన జేబులో చేయి పెట్టి సిగరెట్ ప్యాకెట్ సైజులో ఉన్న రేకు పెట్టెను బయటకు తీశాడు.

పెట్టె మూత తీసి అందులోని ప్లాన్ ని మడతలు విప్పాడు. బాస్ కళ్ళు పెద్దవైనాయ్. ఆత్రంగా ప్లాన్ ని అందుకుని చూడసాగాడు. అతడు మ్యాప్ తన చేతిలోకి రావటాన్ని నమ్మలేకుండా ఉన్నాడు.

మురుగన్ సుడిగాలిలా దూసుకువచ్చాడు ముందుకు. "దీనికోసం మా నాన్న తన ప్రాణాల్నే త్యాగంచేశాడు. నా బొందిలో ప్రాణం ఉన్నంతవరకూ దాన్ని సంరక్షించే బాధ్యత నామీద ఉంది" అన్నాడు ఆవేశంగా.

"మురుగన్! అవివేకంలో పడి ప్రాణాలు పోగొట్టుకో వద్దు! బ్రతికుంటే డబ్బు ఎలాగైనా సంపాదించుకోవచ్చు. ఆ డబ్బుకోసం ప్రాణాలు పోగొట్టుకోవడం అవివేకం!" అర్జునరావ్ మురుగన్ కి అడ్డం వచ్చాడు.

"అలా బుద్ధి చెప్పు! ఈ మ్యాప్ కోసమే నేను అహో

రాత్రాలు పరితపించి పోతున్నాను!కన్నన్!ఇక పద!మనం వచ్చిన పని పూర్తయింది. మనం జగాన్ని పొందాం!" అంటూ బాస్ చిందులు త్రొక్కాడు, మ్యాప్‌ని మడిచి జేబులో పెట్టుకుంటూ.

బాస్ తలుపుని ఒక్క తన్ను తన్ని తెరిచాడు. మరు క్షణంలో బాస్, కన్నన్ ఇద్దరూ బయటకు దూసుకు పోయారు. మరికొద్ది నిముషాల్లో క్రింద కారు బయలుదేరిన మోత వినిపించింది అర్జునరావుకి.

# 8

"ఎంత పని చేశారు సార్ మీరు! మా నాన్న ఎంతో జాగ్రత్తగా కాపాడిన రహస్యాన్ని మీరు క్షణాలమీద వాళ్ళ కందించేశారు గదా!" ఉసూరుమంటూ అడిగాడు మురుగన్, అర్జునరావు కేసి చూస్తూ.

"నీకు తెలీదు మురుగన్! దాన్ని వాళ్ళ ముఖాన కొడితే వాళ్ళు ఇక మన జోలికి రారు. లేకపోతే మనల్ని వెంటాడుతూ అడుగడుగునా ప్రమాదభరితంగా తయారవుతారు!"

"ఇప్పుడు మాత్రం ఏం ఒరిగింది. వాళ్ళు నేరుగా ఆ గుప్తధనం ఉన్న చోటికి వెళతారు. హాయిగా దాన్ని స్వాధీనం చేసుకుని అనుభవిస్తారు. చనిపోయిన వ్యాపారస్తుని వీలునామా ప్రకారం అది నా తండ్రికి చెందాలి గదా. ఆయన పోయారు గనుక దానికి నేను వారసుడ్ని అవుతాను."

"ఇప్పుడు మాత్రం మించిపోయినదేముంది? వాళ్ళకన్న ముందుగా మనం ఆ చోటికి వెళ్ళి దాన్ని మనం స్వాధీన పరుచుకుంటాం!" అర్జునరావు గర్వంగా అన్నాడు.

మురుగన్ తెల్లబోయి అతడి ముఖంలోకి చూశాడు. అప్పటికిగాని అర్జునరావు ప్లాన్ అర్థం కాలేదు అతగాడికి.

"అంటే ఆ ప్లాన్ మరోటి మీ దగ్గర ఉన్నదన్న మాట!"

"కరెక్ట్! దాని నకలుని మన దగ్గర భద్రపరిచాను. రేపుదయం మన ఫ్రెండ్స్ వస్తారు. అందరం కలసి అండమాన్స్‌కి ప్రయాణమవుతాం! నీ ఆస్తిని నీకు అప్పజెప్పే బాధ్యత మాది. అర్థమయిందా?"

"మీకు ఎలా కృతజ్ఞతలు తెల్పుకోవాలో అర్థంకావటం లేదు సార్!" అంటూ అర్జునరావుని అభినందించాడు మురుగన్.

ఆ రాత్రి ఇద్దరూ నిద్రపోలేదు. సంతోషంగా కూర్చుని వైన్ త్రాగుతూ కబుర్లు చెప్పుకున్నారు.

మరునాడుదయం డాక్టర్ నారాయణన్ వకీలు వచ్చాడు.

"ఇంత చిన్న వయసులోనే పితృవియోగం కలగడం నాకూ చాల విచారకరంగా ఉంది బాబూ! కానీ అందరం విధి చేతిలో కీలుబొమ్మలం. ఇక అసలు విషయానికి వద్దాం. మీ నాన్నగారు బ్యాంక్‌లో ఇరవయ్ వేల రూపాయలు డిపాజిట్ చేశారు. ఇదిగో ప్యాస్‌బుక్. తన తదనంతరం మాత్రమే తన కుమారుడికి అందజేయాలని మాకు ఉత్తరువు. ఇదికాక మద్రాసులో అడయార్‌లో బంగళా ఒకటి కొన్నారు. దానిమీద నెలకు అయిదువందలు అద్దె వస్తుంది. ఇవిగో ఇంటి తాలూకు దస్తావేజులు."

"చాలా థ్యాంక్సండీ!" అన్నాడు మురుగన్ వాటిని అందుకుంటూ.

"ఇక నేను వచ్చినపని పూర్తయింది. నావల్ల ఏమైనా అవసరం ఉంటే నాకు జాబు వ్రాయండి!" అంటూ వకీలు వెళ్ళిపోయాడు.

ప్యాస్ బుక్ ఒక కవరులో ఉంచి సీలు వేయబడింది. మురుగన్ కవరు చించాడు. ప్యాస్ బుక్ తెరిచాడు. ఆ పుస్తకంలోంచి పెద్ద కాగితం క్రింద పడింది. ఆత్రంగా దాన్ని అందుకుని మడత విప్పాడు.

అది తన తండ్రి తన నుద్దేశించి వ్రాసిన ఉత్తరం. దాని చివర మరో మ్యాప్ లాంటిది గీయబడి ఉంది. అది అచ్చం బాస్ చేతికిపోయిన దానిలాగే ఉంది. ఆ ఉత్తరంలో నారాయణన్ తను ఎలాంటి పరిస్థితుల్లో బాస్‌ని తప్పించుకుని పారిపోయి వచ్చిందీ వివరిస్తూ, తనకు వ్యాపారస్తుని ద్వారా సంక్రమించిన యావదాస్తినీ అండమాన్ దీవుల్లోని దుర్గమారణ్యం మధ్యలో ఉన్న త్రినేత్రుడి విగ్రహం క్రింద పదిలపరచాననీ, ఆ త్రినేత్రుడి శిథిలాలయానికి దారి మ్యాప్‌లో ఇవ్వబడిందనీ వ్రాశాడు.

త్రినేత్రుడి ఆలయంలో ఆటవికులు సంవత్సరానికొక సారి అంటే మహాశివరాత్రి పర్వదినాన మాత్రమే వేడుకలు జరుపుతారనీ, మిగతా అప్పుడు ఆ గుడి వేపుగా వచ్చేందుకు ప్రతివాళ్ళు జంకుతారనీ అందువల్లనే ఆ ప్రదేశాన్ని తన ధనం దాచేందుకు ఎన్నుకున్నాననీ వివరించాడు నారాయణన్.

అంతే కాదు. ఆ ఆలయం చుట్టుపట్ల అతి భయంకరులైన ఆదివాసులు నివసిస్తుంటారు. వాళ్ళ భయంవలన నాగరిక మానవులెవరూ ఆ చాయలకు పోరు. అప్పుడప్పుడు త్రినేత్రుడి విగ్రహంలోని అపూర్వ వజ్రాలకోసం ఆశపడి వచ్చిన వారు ఆటవికులకు విందు అయిపోతుంటారు.

ఆ ఉత్తరం చదివిన మురుగన్, అర్జునరావులు ఇంకా తమ మార్గం తేలికయిందని సంతోషించారు.

"ఇంకా ఆలస్యం ఎందుకు. మనం ఈరోజే బయలు

దేరదాం!'' అన్నాడు మురుగన్.

''ఎక్కడికో ప్రయాణ సన్నాహంలో ఉన్నారే!'' అంటూ అరుణరావు స్నేహితులు రఘురాం, కృష్ణయ్యా గది లోపలకు వచ్చారు.

''రండి! అడబోయిన తీగం ఎదురైనట్లుగా మనం త్రినేత్రుడి నేత్రాలకోసం బయలుదేరుతున్నాం గదా! ఆ విగ్రహం క్రింద నే ఈ కుర్రవాడి తండ్రి ధనాన్నంతా పాతిపెట్టాడట! దాన్ని గూడ బయటికి తీసి ఆ ధనాన్ని ఈ కుర్రవాడికి అప్పగించాలి!'' అరుణరావు తన స్నేహితులకు టూకీగా జరిగిన కథంతా చెప్పాడు.

''నాకీ సహాయం చేసినందుకు మీకు గూడ కొంత వాటా ఇస్తాను. అంతా నేను ఒక్కడ్నే మాత్రం ఏం చేసుకోను?'' మురుగన్ ఉత్సాహంగా అందరి వంకా చూశాడు.

''నీ ఆస్తిని నీ కప్పగించాక నీవు దానం చేస్తావో, మాకు వాటా ఇస్తావో నీ ఇష్టం!'' కృష్ణయ్యా, మురుగన్ వంక నిశితంగా చూస్తూ అన్నాడు.

ఆ సాయంత్రం అంతా తమకు కావలసిన వస్తుసామగ్రి, సరంజామాను సేకరించటంలో గడిచిపోయింది వాళ్ళ నలుగురికీ. చిన్న సైజువి నాలుగు అడుగుల పలుగులూ, పారలూ గొడ్డళ్ళూ, త్రాటిమోకులూ, విటమిన్ టాబ్లెట్లూ, యాంటిబయాటిక్ మందులూ, దోమకాటుకి వాడే క్రీములూ, గార్లిక్లెట్లూ అన్నీ సిద్ధం చేసుకున్నారు.

# 9

తెల్లవారుతూనే లాడ్జి ఖాళీచేసి నలుగురూ ప్లేన్ లో త్రివేంద్రం హుటాహుటిగా చేరుకున్నారు.

తిరువేంద్రంనుంచి రైలుప్రయాణం చేసి హిందూ మహా

సముద్రతీరాన్ని చేరారు. అక్కడనుంచి స్టీమర్‌లో మూడు గంటలు ప్రయాణంచేసి అండమాన్స్ చేరేటప్పటికి రాత్రి బాగా పొద్దుపోయింది.

అర్జునరావు స్నేహితుడొకడు పోర్టులో ఉద్యోగం చేస్తున్నాడు. అతడు అంత రాత్రిలోనూ వచ్చి వాళ్ళను 'రిసీవ్' చేసుకున్నాడు.

తెల్లవారుతూనే మోటార్ బోటులో అండమాన్ నుంచి సముద్రంలో బయలుదేరారు.

తాము దిగవలసిన దీవి రాంగానే బోటు డ్రైవర్‌కి అసలు ఛార్జికన్న యెక్కువగా ఇచ్చారు. మళ్ళీ మరునాటి సాయంత్రానికి అదే తీరానికి లాంచీని తెచ్చి తమకోసం వేచివుండమని చెప్పారు. రాత్రి యెనిమిది గంటలవరకూ యెదురుచూడమన్నారు.

"మేం ఇక్కడ దిగినట్టుగా ఎవరన్నా అడిగినా చెప్పవద్దు సుమా!" అని అతడ్ని హెచ్చరించారు.

"అలాగే సార్!" అంటూ అతడు సలాంచేసి వెళ్ళిపోయాడు.

సముద్రపు ఒడ్డుదాటి చెట్లమాటుకు వచ్చిన తర్వాత అందరూ చదునైన చోటు చూసుకుని కూర్చున్నారు. పోలీథీన్ సంచీ తెరచి టిఫిన్ తిని, ఫ్లాస్కులోని టీ త్రాగేశారు.

"ఫ్రెండ్స్! రేపు సాయంత్రందాకా మనకు టీ కాఫీలు దొరకవు. కనుక ఇప్పుడే కడుపారా త్రాగండి!" అంటూ నవ్వాడు అర్జునరావు.

మిగతావాళ్ళు అతడితో శృతి కలిపారు.

టిఫిన్ తిని టీ త్రాగడం అయాక, తాము ఎటుగా పోవాలో నిర్ణయించేందుకు మ్యాప్‌ని తీసి చూశారు.

'దిక్సూచి' ని నేలమీద ఉంచి, ఏ దిక్కుగా తాము ప్రయాణం కావల్సివుందో తేల్చుకున్నారు.

"మనం వీలైనంత త్వరగా కదలాలి ఇక్కడ్నుంచి. అంతేకాదు, మనం యెంత వేగంగా గమ్యం చేరుకుంటే అంతమంచిది. ఎందుకంటే ఈ ప్రదేశానికే బాస్ కూడ ఈపాటికి ప్రయాణమై ఉంటాడు. మనం ప్లేన్ లోరావటం వల్ల ముందుగా ఇక్కడకు చేరగలిగాను నే నా అభిప్రాయం" అర్జునరావు అందరివంకా చూస్తూ అన్నాడు.

"బాస్ అత్యంతగా వస్తూండాలి ఈపాటికి. ఏదిఏమైనా మనం ముందుగా అనుకున్నంత తేలిక కాదు ఈ వ్యవహారం. మనతో పోటీగా, "బాస్" వస్తున్నాడు. అతడో, మనమో, ఈ ఇద్దరిలో ఒకవర్గం మాత్రమే ఆ నిధిని చేజిక్కించుకోగలం. ప్రాణాలకు సైతం తెగించి మనం ఈ పనికి దిగామని అందరూ మరోసారి గుర్తుతెచ్చుకోవటం మంచిది" రఘురాం అందరిలోనూ ఆవేశాన్ని రగిలించాడు.

"నాకు నా ప్రాణాలమీది తీపికన్న, నిధి మీద నే ఆసక్తి యెక్కువ" అన్నాడు మురుగన్. "అతడి గుప్త ధనంలో వజ్రాలూ, రత్నాలతో పొదగబడిన కత్తులూ, ఇతర విలువగల వస్తువులున్నయ్. నా చిన్నప్పుడు వ్యాపారస్థుని ఇంట్లో చూసిన గుర్తు ఇప్పటికి జ్ఞప్తికి వస్తున్నది."

"బాస్ ఒక్కడుగాని లేదా అతడి ముఠాతోగాని వస్తే అతడ్ని తేలిగ్గా యెదుర్కొని హతమార్చగలం. కాని అతడీ ప్రాంతాల వ్యక్తి అవటంవలన, ప్రభుత్వంతో తన పలుకుబడిని వినియోగించి, పోలీసు బలగాన్ని మనమీద తోలితే మనపని ఇరకాటంలో పడుతుంది" కృష్ణయ్య తన అనుమానాన్ని వెలిబుచ్చాడు.

"అసలు మనం వాడికన్న ముందుగానే ఇంతదూరం వచ్చామని వాడికి తెలిస్తేనేగదా, మనల్ని పట్టుకునేందుకు వాడు ప్రభుత్వ సాయం కోరేది" అర్జునరావు బదులు చెప్పాడు.

ఆకాశంలో నల్లని మేఘాలు కమ్ముకుంటున్నయ్. చెట్లు దట్టంగా పెరిగి ఉండటం మూలాన్ని నేలమీదకు సరిగా వెలుగు అనటంలేదు.

"వాన వచ్చేట్టుంది" రఘురాం ఆకాశంవంక చూస్తూ అన్నాడు.

కాని ఎవరూ అతడి మాటలు పట్టించుకోలేదు. తమ లగేజీని సమానంగా పంచుకుని సంచుల్లో మూటకట్టుకుని భుజాలకు తగిలించుకున్నారు. నలుగురి చేతుల్లో తుపాకు లున్నయ్. అర్జునరావుదగ్గర జేబులో రివాల్వర్ గూడవుంది. కృష్ణయ్య మొలకు కత్తి వ్రేలాడుతోంది.

మిత్రబృందం ముందుకు సాగింది. అర్జునరావు ముందూ, తర్వాత మురుగన్, అతని వెనుకగా రఘురాం, కృష్ణ య్యలూ నడుస్తున్నారు.

రాత్రయేదాకా నడవటం, ఆ తర్వాత అడవిలోనే మజిలీ వేయాలనీ, తెల్లవారిన తర్వాత తమ ప్రయాణం కొనసాగించాలనీ అర్జునరావు ఆలోచన.

దోవ అంతటా గడ్డి దట్టంగా పెరిగింది. తీగెల చెట్లు తాలూకు లతలు దట్టంగా అల్లుకుని ఉన్నయ్. కొన్ని చోట్ల ఆ తీగెలను ఛేధించి ముందుకు పోవాల్సి వస్తున్నది.

అక్కడి చెట్లనుగానీ, మోకల్లావున్న తీగచెట్లనుగానీ వేటినీ చేతితో తాకవద్దని హెచ్చరించాడు అర్జునరావు. రక్కసి వృక్షాలుంటాయనీ, అవి జంతువుల్నీ మనుషుల్నీ సైతం, వాళ్ళ రక్తాన్ని వాసనపట్టి పెనవేసుకుని భక్షిస్తా యనీ వివరించాడు.

ఏదైనా తీగను అడ్డం తొలగించాలంటే గొడ్డలి తీసుకుని దానితో నరకటంగానీ, లేదా ప్రక్కకు నెట్టటంగాని చేస్తున్నారు.

ముందుకు నడుస్తున్న వాడల్లా అర్జునరావు హఠాత్తుగా ఆగిపోయాడు. తన రెండు చేతులూ జాపి, తన వెనుక వస్తున్న వారిని ఆటంకపరిచాడు.

"ఏం జరిగింది?" అని ప్రశ్నించాడు మురుగన్.

అర్జునరావు మాట్లాడలేదు. అతడి దృష్టి ఎక్కడకు సారించిందో అటుగా చూశారు మిగతావాళ్ళు.

అక్కడ పెద్ద కొండచిలువ దారికి అడ్డంగా పడుకుని ఉంది. అది సుమారు పదిహేనడుగుల పొడవు ఉంటుంది. దాని తల పొదల్లో ఉంది. దాని నోట్లో ఏదో చిన్నసైజు జంతువు గిజగిజకొట్టుకుంటున్నది.

"దాన్ని తాకకుండా దాటి వచ్చేయండి త్వరగా!" అని గొణిగాడు అర్జునరావు.

నలుగురు అతిజాగ్రత్తగా పెద్ద దుంగలా దోవకు అడ్డంగా పడివున్న కొండచిలువను దాటి ముందుకు వేగంగా పరుగెత్తారు.

"దాని నోట్లో ఏదో జంతువు, బహుశా కుందేలుగాని లేక నక్కగాని అయివుండచ్చు, అది గిలగిల కొట్టుకుంటోంది" మురుగన్ వివరించాడు.

"అవును! దాని నోటికి ఏదో ఆహారం దొరకబట్టే మనం బ్రతికిపోయాం. లేకపోతే మనలో ఒకరిని బలితీసుకునేది" అర్జునరావు నవ్వాడు గలగల.

"గుప్తధనంలో వాటాదారుడు ఒకడు తగ్గేవాడు కదూ?" కృష్ణయ్య నవ్వుతూ అన్నాడు.

"కృష్ణయ్యా! ఏమిటా మాటలు?" అర్జునరావు కసిరాడు.

మురుగన్, రఘురాం ఇద్దరూ అనుమానంగా చూశారు అతడివైపు.

# 10

"ఇక్కడ కొండచిలువలు జాస్తిగా ఉండేలా ఉన్నాయే!" అన్నాడు అర్జునరావు టాపిక్ మారుస్తూ.

"అలాగే కనబడుతోంది. లేకపోతే ఇందాక మనం చూసిన చిలువ యెంత పెద్దది. నా జీవితంలో అంత పెద్ద పాముని చూడలేదు" మురుగన్ ఆశ్చర్యాన్ని వెలిబుచ్చాడు.

"ఓస్! ఇదో పెద్ద లెక్కా? ఈ చిలువ మహా ఉంటే పదిహేను అడుగుల పొడవు ఉండచ్చు! నేను ఇరవై అడుగుల కొండచిలువను కూడ చూశాను," గర్వంగా చెప్పాడు రఘురాం.

"ఏం చేశారు మీరు అప్పుడు?" ఆసక్తిగా అడిగాడు మురుగన్.

"నేను చూసింది చనిపోయినదాన్ని!"

అందరూ నవ్వారు.

"కనుకనే నీవు బ్రతికిపోయావ్!" కృష్ణయ్య అన్న మాటలకు అందరూ మరోసారి నవ్వారు.

సన్నగా తుప్పర ప్రారంభమైంది. నలుగురు ఒక చెట్టు క్రింద ఆగారు, అలుపు తీర్చుకోవడానికి.

అంతలోనే వారికి దడదడమని శబ్దం విన్పించింది.

"ఇదేమిటి? ఉరుములు కూడ లేవే! వాన కూడ సన్నగానే వస్తున్నది. ఈ శబ్దం ఎక్కడిది?" మురుగన్ భయంగా అన్నాడు.

అందరూ ఆ శబ్దం వచ్చిన వేపు చూశారు. చెట్ల కొమ్మల్ని విరిచేస్తూ, చిన్న చిన్న చెట్లను త్రొక్కివేస్తూ

నాలుగు మదపు టేనుగులు కనుపించినయ్.

వాటివల్ల తమకు మరణం తప్పదని అందరూ ప్రాణాలు బిగబట్టుకుని చాటుగా నిలబడ్డారు.

వీళ్ళ అదృష్టం బాగుండి ఏనుగులు వీళ్ళున్న దిశగా రాలేదు. ఒక ప్రక్కనుంచి వచ్చిన మదపు టేనుగులు మరో దిక్కుగా ఆగం చేసుకుంటూ వెళ్ళిపోయినయ్.

"ఆ కొండచిలువ ఈ ఏనుగుల్లో ఒకదాన్ని పట్టుకుంటే, ఏది గెలుస్తుందంటూరు?" మురుగన్ చిన్న పిల్లాడిలా అడిగాడు.

"గుప్తనిధిని చేజిక్కించుకున్నాక మేం నిన్నిక్కడే వదలివెడతాం. ఏది గెలుస్తుందో కళ్ళారా చూసి మరీ వద్దువుగాని నీవు" అన్నాడు కృష్ణయ్య.

"కృష్ణయ్యా! నీ నోటివెంట ఒక్కమాట గూడ సవ్యంగా రాదుగదా! వెధవ మాటలూ నీవూను!" కసురుకున్నాడు అర్జునరావు మళ్ళీ.

"ఒక ప్రక్క కొండ చిలువలూ, మరో ప్రక్క మదపు టేనుగులు, ఇంకా లోపలకు పోయే కొద్దీ ఇంకా ఏ భయంకర మృగాలను చూడాల్సి వస్తుందో!" రఘురాం బిక్కు బిక్కుమంటూ అడిగాడు.

"ఈ ప్రమాదాల మధ్య మనం ఈ రాత్రికి ఎక్కడని మకాం వేయగలం?" మురుగన్ తన భయాన్ని వ్యక్తం చేశాడు.

"అసలు మజిలీ వెయ్యకపోతే నేం? ఇలాగే రాత్రంతా ముందుకు సాగిపోతూనే వుందాం. ఎందుకంటే, ఒకవేళ 'బాస్' ఈ రోజు సాయంత్రం ఈ దీవిలో దిగినా, ఈ వానలో, ఈ రాత్రివేళ రావటానికి ప్రయిత్నించడని నా ఉద్దేశ్యం" అర్జునరావు తన ఊహను బయటపెట్టాడు.

"అదీ నిజమే! తెల్లారినాక తీరిగ్గా, పెళ్ళి కొడుకులా నిదానంగా వెళ్ళొంలే అనుకుంటాడు వాడు! తీరంలో మజిలీ చేసి 'నిధి' గురించి కలలుకంటూ వుంటాడు. ఈ అపూర్వ అవకాశాన్ని మనం సద్వినియోగం చేసుకోవాలి!" రఘురాం అతడ్ని బలపరచాడు.

మురుగన్, కృష్ణయ్య మౌనంగా వుండిపోయారు.

"మాట్లాడరేం! మీరేమంటారు? రాత్రల్లా నడవగల ఓపిక వుందా మీకు?" వాళ్ళిద్దరి వంకా చూస్తూ అడిగాడు అర్జునరావు.

"మీరెలా చెబితే అలానే!" అన్నారిద్దరు తల లూపుతూ.

వాన పడుతున్నా లక్ష్యపెట్టకుండా నడవసాగారు అందరూ. రెయిన్ కోట్లు తొడుక్కుని, తలకు టోపీలు తగిలించుకున్నారు. టార్చిలైట్ల వెలుగుని నేల బారుగా మాత్రమే ప్రసరిస్తూ, దోవ చూసుకుంటూ మౌనంగా పోతున్నారు.

చీకటి పడేకొద్దీ దోమల బాధ ఎక్కువైంది. చిత్తడి నేలల్లోనూ, నీళ్ళగుంటల మీద తేనెటీగ ప్రమాణంలో దోమలున్నాయ్. అవి కరిస్తే, కరిచినచోటనుంచి నెత్తురు గూడ కారేలా ఉన్నాయ్ వాటి కాటు.

ఒక్క నిముషం ఆగి, అందరూ చేతులకూ, మెడ మీదా, ముఖానికీ క్రీమ్ రాసుకున్నారు.

## 11

"అదుగో శిథిలాలయం!" అరిచాడు రఘురాం.

అందరూ అతడు చూపించిన వేపుగా చూశారు. దూరంగా చెట్లమధ్యగా సగం కూలిపోయిన గోడలు కనిపించాయి.

మురుగన్ వాటివంక చూస్తూ "ఇది శిథిలాలయం కాదు. చనిపోయిన సింహాళ వ్యాపారస్తుని బంగళా అది. దాన్ని ఎవరో పడగొట్టేశారు. బహుశా "బాస్" గుప్తధనం అక్కడ దాచిపెట్టబడిందేమోనని అనుమానంతో దాన్ని శిథిలంచేసి ఉంటాడు" మురుగన్ వివరించాడు.

మ్యాప్ తీశాడు అర్జునరావు. అప్పటికి వాన పూర్తిగా తగ్గిపోయింది. మబ్బులు విడిపోయాయి. ఆకాశంలో తారకలు, మానవుని ఆశల్లా, మెరుస్తున్నయ్.

"ఈ బంగళానుంచి ఇక కొద్ది దూరమే ఉంది త్రినేత్రుడి ఆలయం. బహుశా గంటా, రెండు గంటల్లో మనం అక్కడికి చేరగలం!" అర్జునరావు మ్యాప్‌లోకి చూస్తూ చెప్పాడు.

అందరి ఆనందానికీ అంతులేదు. ఒకరినొకరు అభినందించుకున్నారు.

"ఈ పాడుబడ్డ బంగళాలో కాస్సేపు తలదాచుకుందామా?" అని అడిగాడు కృష్ణయ్య.

"వద్దు! ఇలానే ముందుకు సాగిపోయి త్రినేత్రుడి ఆలయాన్ని చేరుకోవాలి. తెల్లవారంగానే త్రినేత్రుడిని పెకలించి, మధ్యాహ్నానికల్లా తిరుగు ప్రయాణం అవాలి మనం!" అర్జునరావు కంఠంలో ధృఢ నిశ్చయం ప్రతిధ్వనించింది.

"ఊరికే చేతులు ముడుచుకుని కూర్చునేకన్నా నిదానంగానైనా సాగిపోతూ ఉండటమే మంచిది!" రఘురాం తన అభిప్రాయాన్ని వెలిబుచ్చాడు.

"ఓ కే!" అంటూ మిగతా ముగ్గురూ తలలూపారు.

వెనుకటి అంతటి వేగం లేకపోయినా, నలుగురూ ప్రతి అంగుళం నేలను పరిక్షించుకుంటూ అడుగులు వేస్తున్నారు నిదానంగా.

నీటి గుంటల్లోని గోంద్రుకప్పలు బెక బెకమని అరుస్తున్నాయ్. కీచురాళ్ళు అంతంలేని పాటలా రొదపెడుతున్నాయ్. చెట్లమధ్యగా మినుకు మినుకుమంటూ మిణుగురులు తిరుగాడుతున్నాయ్. దోమల సంగతి సరేసరి! ఎక్కడ అవకాశం దొరుకుతుందా, మనిషిరక్తం రుచి చూద్దామని వాళ్ళచుట్టూ తిరుగాడుతూ, క్రీమ్ వాసనకు వెనక్కు తగ్గుతున్నయ్.

మళ్ళీ కుండపోతగా వాన ప్రారంభమైంది. తాము ఊహించినంత తేలికగా లేదు ఈ సాహసయాత్ర. అందరూ ప్రాణాలకు తెగించే బయలుదేరినా, ఈ వాతావరణం, కటిక చీకటి, కుంభవృష్టి, క్రూర మృగాలూ_ ఈ వాతావరణం ఎటువంటి ధైర్యశాలికయినా భయం గొల్పేలా వుంది, అనుకున్నాడు అర్జునరావ్.

ఎడారిలో ఒయాసిస్సులాగా, దట్టంగా ఉన్న చెట్ల మధ్య పెద్ద ఖాళీ జాగా కనుపించింది. ఆ ఖాళీ స్థలంలో చిన్న మేదర గుడిసెల్లాంటివి పది గుడిసెలున్నయ్.

అర్జునరావు వెనక్కు అడుగువేశాడు. "అవి ఇక్కడి ఆటవికులవి అయి ఉంటయ్. మనం వారి కంటబడడం క్షేమంకాదు. ఎందుకైనా మంచిది, వాళ్ల ఇళ్లను తప్పించి పోవటం నయం!" అన్నాడు.

రఘురాం అక్కడున్న చెట్టుఎక్కి చూశాడు. వాళ్ల గుడిసెలున్న వైపూ తూర్పుగా చెట్లమధ్యగా ఖాళీ కనబడుతోంది. ఆ వైపుగా మైదానం ఆవలకు పోవటానికి నిశ్చయించుకున్నారు. నిజానికి గుడిసెల్లో మానవసంచారం ఉన్నట్టులేదు. బహుశా అందులోని ఆటవికులు మరో దీవికి వేటాడానికి వెళ్ళివుండచ్చు. అయినా ముందుజాగ్రత్త కోసం వాళ్ల ఇళ్లను తప్పించి, పోవడానికి నిశ్చయించుకున్నారు.

అర మైలు నడిచాక వారికి ముందు దోవ కనుపించ లేదు. పచ్చగడ్డి, రెల్లుదుబ్బులూ దట్టంగా అయిదారు అడుగుల ఎత్తున పెరిగి, మార్గాన్ని మూసివేసినయ్.

అర్జునరావు వాచీ చూసుకున్నాడు. రాత్రి మూడు గంటలు దాటింది.

“ఈ చీకటిలో మనం మార్గం తప్పామంటే మళ్ళీ కలుసుకోవటం కష్టం! ఇంక తెల్లవారటానికి ఆట్టే వ్యవధి లేదు. అందాకా మనం ఇక్కడే ఆగి నిరీక్షించటం మంచిది” అన్నాడు.

ఒక చెట్టుక్రిందుగా ఉన్న పెద్దరాయిమీద కూలబడ్డారు అందరూ. మురుగన్ బాగా అలిసిపోయాడేమో, కూర్చుంటూనే చెట్టుకు ఆనుకుని నిద్రలోకి జారుకున్నాడు.

# 12

తూర్పు రేఖలు తెల్లబారినయ్. చెట్లమీద పక్షులు మేల్కొని కిలకిలారావాలు చేస్తున్నయ్. ఒక గంట నిద్ర తీశాక మురుగన్ నూతనోత్సాహంతో బయలుదేరాడు.

రెల్లు దుబ్బుల మధ్యగా సన్నని దోవపోతున్నది. ఆదారంటే నడిచి గడ్డిదుబ్బుల్ని దాటి ముందుకు వచ్చేశారు.

అంతలోనే వాళ్ళకు మళ్లీ ఏవో జంతువులు హడావిడిగా పరుగెత్తుకు వస్తున్నట్టుగా, నేలమీద విరిగి పడిపోయిన చెట్లకొమ్మలు త్రొక్కేస్తున్న అలికిడి వినవచ్చింది.

మళ్ళీ ఏనుగల మందకాదుగదా అనుకుని ఒక ప్రక్కగా ఒదిగి నిల్చున్నారు నలుగురూ.

చెట్ల గుంపుల్లోంచి దున్నపోతులు పదో, పన్నెండో పరుగెత్తుకు వస్తున్నయ్.

“అవి ఈఆటవికులకు చెందినవి అయిఉంటయ్. వాటికి పెద్ద పులి కనిపించి ఉండాలి. అందుకే భయంతో దిక్కు

తోచకుండా పారిపోతున్నయ్" మురుగన్ చెప్పాడు.

"పాములూ, కొండచిలువలా, మదపుటేనుగులూ, ఎనుములూ; ఇక పైన పులులు గూడానా! భగవాన్! ఎటువంటి ప్రదేశంలో వచ్చి పడ్డాం!" అని నిట్టూర్చాడు రఘురాం.

"భయపడకు. ప్రమాదభరితమైన ప్రదేశం దాటి వచ్చేశాం. ఇక పైన ఇంత భయంకరంగా ఉండదులే!" అర్జునరావు హామీ ఇచ్చాడు.

దున్నపోతుల మంద దాటిపోయాక, మళ్ళీ నడక సాగించారు. సూర్యుడు లేతగా, ఎర్రగా, తూర్పుదిక్కున దర్శనం ఇచ్చాడు.

చెట్లమధ్యగా కొండరాళ్ళతో గోడలాగ కనబడింది. ఇంకేం రఘురాం ఎగిరి గంతేశాడు.

"అదుగో శిలాలయం!" అని అరిచాడు.

నలుగురూ ఒకరితో ఒకరు పోటీలుపడి పరుగెత్తారు ఆ చోటికి. అది పురాతన దేవాలయం. పూజా పునస్కారాలు వున్నట్టులేవు. పాడుపడిపోయినదానిలా వుంది.

ఆ గుడికి తలుపులు లేవు. నేరుగా లోపలకు వెళ్ళారు. ప్రహరీగోడ దాటంగానే రాతికట్టడం వచ్చింది. ఆ గది మధ్యగా ఎత్తైన అరుగువుంది. అరుగుమీద ఒక విగ్రహం బంగారు ఛాయలో మెరిసిపోతున్నది.

ఎవరో మహాపురుషుడు బాచిపట్టు వేసుకుని కూర్చున్నాడు ధ్యానముద్రలో. కళ్ళు అరమోడ్పులుగా వాలి వున్నయ్. తలమీద కిరీటంలో ఎర్రని రాయి కళ్ళకు మిరుమిట్లు గొల్పుతోంది. ఆ విగ్రహం బుద్ధదేవుడిదో, పరమశివుడిదో ఎవరికీ అర్థం కాలేదు. అయినా అందరూ భక్తితో నమస్కరించారు.

"ఇది త్రినేత్రుడి ఆలయం కాదు. మరింకేదో ఆలయం. మనం పటం చూడాలి!" అంటూ అర్జునరావు మ్యాప్ విప్పి చూశాడు.

అందులో ఈ గుడిగూడ గుర్తించబడి ఉంది. కాని తాము వెళ్ళవలసిన నిర్దీత మార్గంనుంచి రెండు మైళ్ళు ఇవతలకు వచ్చేశారని తేలుతోంది. ఎందుకంటే తమ నిర్ణీత మార్గంలో ఈ గుడి తగలదు.

"చూశారా! మనం ఎంత జాగ్రత్తగా వచ్చినా కొంచెంగా తప్పిపోయాం! అయినా ఫరవాలేదు. మనం కేవలం రెండు మైళ్లు మాత్రమే ఇవతలగా వచ్చాం. పగటి పూట గనుక ఇంకా వేగంగా నడిచి ఉదయం పదిగంటలలోగానే అక్కడికి చేరుకోగలం!" అని ఉపారిచ్చాడు అర్జునరావు.

"ఇంకా ఆలస్యం ఎందుకు? నడవండి!" అన్నాడు రఘురాం తన లగేజీని బుజానికి తగిలించుకుని వెను దిరుగుతూ.

"ఆగండి! ఒక్క నిముషం!" అంటూ కృష్ణయ్య విగ్రహం వేపుగా అడుగువేశాడు. రాత్రంతా వాన కురవటం మూలాన్ని విగ్రహం చుట్టూ గచ్చు నేల మీద, పాదాలు మునిగేలోతున నీళ్లు నిలిచినయ్.

గమ్‌బూడ్స్‌తో నీళ్లలో చప్పుడు చేసుకుంటూ దిగాడు కృష్ణయ్య.

"కృష్ణయ్యా! ఏమిటి నీవు చేసేపని?" అర్జునరావు అరిచాడు.

"ఈ నిర్జనవనంలో ఈ కాంచన విగ్రహం ఎందుకు, అడవిగాచిన వెన్నెలలా. దీన్ని మన సాహసయాత్రకు గుర్తుగా నేను తెచ్చుకుంటాను!" అన్నాడు కృష్ణయ్య.

అతడి కళ్లలోని దురాశను తేలిగ్గా పసిగట్టాడు అర్జున రావు. తను కాదంటే అక్కడికక్కడ భేదాభిప్రాయాలు వస్తాయి. నలుగురిలో చీలికలు వస్తవి. ఇటువంటి పరిస్థితుల్లో ఏమాత్రం పేచీలు వచ్చినా అవి పెరిగి పెద్దవయి ప్రాణాల్నే బలి తీసుకుంటాయి కనుక తను ఓర్పుగా, తెలివిగా వ్యవహరించాలి.

అందుకే అర్జునరావు మళ్ళీ అభ్యంతరం చెప్పలేక పోయాడు. మురుగన్, రఘురాం ఇద్దరూ అర్జునరావు ఎంత చెబితే అంత! ఇక కృష్ణయ్యకి అభ్యంతరం చెప్పేవారు లేకపోయారు.

విగ్రహం చాల బరువుగా ఉంది. అయినా తన మూటను రఘురాం చేతికిచ్చి ఆ విగ్రహాన్ని బుజానికెత్తుకున్నాడు.

"ఇది బంగారు విగ్రహమేనంటావా?" రఘురాం అనుమానంగా అడిగాడు.

"అందుకు సందేహం లేదు! ఈ ఆటవికులకు బంగారం విలువ ఏం తెలుసు?" కృష్ణయ్య సమర్థించుకున్నాడు.

"ఒకవేళ బంగారుది అయినా కాకపోయినా, దీన్ని ఏ మ్యూజియంకో లేదా పురాతన విగ్రహాలుకొనే వారికో అమ్మితే బంగారం ధరకన్న ఎక్కువే గిట్టుబాటు అవుతుంది!" అన్నాడు మురుగన్.

"మంచి అయిడియా!" అని మురుగన్‌ని మెచ్చుకున్నాడు, కృష్ణయ్య.

దోవ వెంబడే పోతుంటే, కృష్ణయ్య బుజాన ఉన్న లోహవిగ్రహం మీద సూర్యుని కిరణాలుపడి మెరిసి పోతున్నది.

"కృష్ణయ్యా! ఆ విగ్రహాన్ని మన దగ్గరున్న సంచీలో పెట్టి తీసుకుపోవటం మంచిది. ఈ కాంతి ఎవరికైనా ఆట

విషల్ని ఇట్టే పట్టిచ్చేస్తుంది. ఇక్కడి ఆటవికులు తాము ఆరాధించే విగ్రహాన్ని ఎత్తుకుపోతున్నారని తెలిస్తే ఇంకేమైనా ఉందా?'' అగసరావు సూచించాడు.

కృష్ణయ్యా విగ్రహాన్ని ఖాళీ సంచీలో ఉంచి, దాని మూతి బిగించి కట్టి, ఆ మూటను భుజానికెత్తుకున్నాడు.

# 13

రాత్రిపూట వానలో ప్రయాణంలో వారికి అట్టే శ్రమ తెలియలేదు. సూర్యుడు పైకెగబ్రాకేకొద్దీ వారికి అధికంగా చెమటలు కారుతున్నయ్. కృష్ణయ్యా అయితే విగ్రహాన్ని మోయలేక, చెమటలు కక్కుతూ, ఆయాసపడుతున్నాడు.

'దీన్ని మోయటానికి మనకు ఏదైనా జంతువు దొరికితే బాగుండును' అనుకున్నాడు మనసులో.

మరో నాలుగు గజాలు వెళ్ళేసరికి అడవిలో ఒంటరిగా మేస్తూ దున్నపోతు కనుపించింది.

''దాన్ని బంధిస్తే, మన సామాన్లు దాని వీపుమీద వేయొచ్చు. మనం ఇంకా త్వరగా నడవగలుగుతాం!'' అన్నాడు కృష్ణయ్యా.

''నిజమే! అది మచ్చిక అయిన దానిలాగే కనుపిస్తున్నది గూడా!'' మురుగన్ దానివంక చూస్తూ అన్నాడు.

మరుక్షణంలో త్రాళ్ళతో ఉచ్చులు వేసి దాన్ని బంధించారు. కృష్ణయ్యా తన వీపున మోస్తున్న సంచీని, మురుగన్ లగేజీ సంచిని రెండు సంచుల్నీ దున్నపోతు వీపుమీద వేసి అవి పడిపోకుండా, త్రాళ్ళతో గట్టిగా పెనవేశాడు.

దున్నపోతు మెడ పలుపు పట్టుకుని నడవసాగాడు కృష్ణయ్యా. భుజాన బరువు లేకపోవడంతో మురుగన్ తేలికగా గంతులు వేస్తూ నడుస్తున్నాడు. అతడి చిన్నతనపు చేష్టల్ని చూస్తూ, నవ్వుకుంటూ, తమ అలసటని మరిచి నడుస్తున్నారు మిగతా ముగ్గురూ.

చెట్లచాటునుంచి పెద్దపులి గాండ్రించింది. నలుగురూ కంగారుగా చూశారు. అతిచేరువలో పెద్దపులి కనుపించింది. తుపాకిని గురిపెట్టి కాల్చే వ్యవధిలేదు.

"అందరూ చెట్టెక్కండి!" అని అరిచాడు అర్జునరావు. మరుక్షణంలో నలుగురూ తలా ఒక దిక్కుగా, ఎదురుగా కనుపించిన చెట్టుమీదికి ఎక్కి కూర్చున్నారు.

పెద్దపులి చూపంతా దున్నపోతుమీదేవుంది. మరోసారి పెద్దగా గాండ్రించింది అది. దున్నపోతు బెదిరిపోయి పరుగు లంకించుకుంది. పులి దాని వెనుకే పరుగెత్తుతోంది.

చెట్టుమీద కూర్చున్న కృష్ణయ్య "అయ్యో! నా విగ్రహం! నా విగ్రహం!" అని గగ్గోలు పెట్టాడు.

కనురెప్పపాటులో చెట్టుమీదనుంచి రఘురాం క్రిందకు దూకాడు. అతడూ పులి వెనుకనే పరుగెత్తసాగాడు.

"అరె! వాడికేం మతిపోలేదుగదా? లేకపోతే పులి వెనుకనే పరుగెత్తుతాడా?" మురుగన్ భయ భయంగా అన్నాడు.

అంతలోనే మరో ఘోరం జరిగిపోయింది. దున్నపోతు మీది సంచులు క్రిందపడిపోయాయి. వీపుమీద బరువు తగ్గడంతో దున్నపోతు మరింత వేగంగా పరుగెత్తగలిగింది. దాన్ని తరుముతున్న పెద్దపులి విగ్రహానికి కొట్టుకుని పడిపోయింది.

కోపంగా మరోసారి గాండ్రించి లేవబోతున్న పులి దృష్టి తన వెనుకనే వస్తున్న రఘురాం మీద పడింది. అర్జునరావు తుపాకి కాల్చాలని చూశాడు కాని, చాలా దూరంలో ఉండటంవలన అది వీల్లేకపోయింది.

పులి ఒక్క ఎగురుతో రఘురాంని అందుకుంది. ఎన్నాళ్లో వియోగాన్ని పొందిన ప్రేయసి కవుగలింతలా, పెద్దపులి

ముందుకాళ్ళు రెండూ రఘురాం రెండు బుజాలమీద ఆని నయ్. వెనుక కాళ్ళమీద నిలబడిన పులి తన తలను కొద్దిగా ప్రక్కకు వంచి, నోరు తెరచి, రఘురాం పీకను కొరికి వేసింది.

రఘురాం నేలకూలాడు. అతడితోపాటు పులిగూడ క్రింద పడిపోయింది. అయినా అది తన ఫలహారాన్ని వదల లేదు. ఆ శవాన్ని ఈడ్చుకుంటూ వెళ్ళి అడవిలో మాయ మయింది.

అర్జునరావు, మురుగన్, కృష్ణయ్యలకు నోటివెంటమాట రాలేదు. కొద్దిక్షణాలసేపు నిశ్చేష్టులై పోయారు.

పెద్దపులి వెళ్ళిపోయిందని రూఢి చేసుకుని ముందుగా అర్జునరావు దిగాడు. అతడి తర్వాత మురుగన్, కృష్ణయ్యలు అతడ్ని కలిశారు.

"ఏదీ ఆ విగ్రహం!" అన్నాడు కృష్ణయ్య.

"చాల్లే ఇక నోరు మూసుకో! ఆ విగ్రహం మూలాన్నే ఇంత అనర్థం వాటిల్లింది. సూర్యుడు నడినెత్తిమీదకు రాక ముందే మనం గమ్యం చేరుకోవాలి. లేకపోతే సాయం త్రానికి మళ్ళీ తీరం చేరలేం, అడుగడుగునా వాటిల్లే ఆప దల్ని తప్పుకుని. ఈ రోజు సాయంత్రమే మోటార్ బోట్ ని మనకోసం రమ్మని చెప్పాం! గుర్తుందా?" అర్జునరావులో ఓర్పు చచ్చిపోయింది. కోపంగా అరిచాడు కృష్ణయ్యవంక చూస్తూ.

కృష్ణయ్య గుర్రుగా అతడివంక చూశాడు. మనిషినే మింగివేసేటంతటి కోపం వచ్చింది. కానీ తమాయించు కున్నాడు.

అందరూ విచారంగా, మౌనంగా నడుస్తున్నారు. అర్జున రావులో సైతం, బయలుదేరేటప్పటి ఉత్సాహం ఇప్పుడు లేదు.

సూర్యభగవానుడు నడినెత్తిమీదకు చేరుకుంటున్నాడు. ముగ్గురూ ఒకచోట ఆగిపోయారు. వారు ఒక పెద్ద కాలవ గట్టుమీద నిలబడి వున్నారు.

"మన ప్లానులో ఈ కాలువ చూసినట్టు లేదే! మనం దారితప్ప లేదుగదా?" అర్జునరావు అనుమానంగా చూశాడు. తన జేబులోని ప్లాన్ని తీశాడు.

"అదుగో అందులో త్రినేత్రుడి ఆలయముందు బ్రిడ్జి బొమ్మ వేసివుంది. బహుశా ఆ వంతెన ఈ పాటికి కూలి పోయి ఉంటుందేమో!" మురుగన్ మ్యాప్‌లోకి చూస్తూ అన్నాడు.

"ఈ కాలవ ఎంత లోతుందో ఏమో! చూద్దాం!" అంటూ దాపులనే ఉన్న చెట్టుకొమ్మ నొక దాన్ని విరిచి నీళ్ళల్లోకి పొడిచి చూశాడు కృష్ణయ్య.

నాలుగడుగుల కొమ్మని నీళ్ళలో ముంచినా అడుగు తగలేదు.

"కాలువ ఒడ్డు వెంబడే కొంత దూరం ఎగువకు పోదాం! ఎక్కడైనా లోతు తక్కువగా ఉంటుందేమో ప్రయత్నించి చూద్దాం!" అర్జునరావు సూచనకు తలకాయలూపారు మురుగన్, కృష్ణయ్య లిద్దరూ.

మురుగన్ మనసులో కృష్ణయ్య తమ ప్రయాణం మొదలులో అన్నమాట మారుమ్రోగుతోంది. 'గుప్తధనంలో వాటాదారుడు ఒకడు తగ్గుతాడు కదూ?' ఏ ముహూర్తాన అన్నాడో గాని ఆమాట నిజం అయి ఊరుకుంది.

అసలు కృష్ణయ్య విగ్రహాన్ని తీసుకురాకుండా ఉంటే, దాన్ని మోయటానికి దున్నపోతూ అవసరమయేదికాదు. పెద్దపులీ వెంటబడేదికాదు. అతడి అనాలోచిత చర్యవల్లనే రఘురాం నిండు ప్రాణాలు బలిఅయినయ్.

అగ్గునరావు వంక కూడ కృష్ణయ్య గుర్రుగా చూస్తున్నాడు. అతడ్ని కూడ ఏ విధంగానైనా హతమార్చాలని పథకం ఆలోచిస్తున్నాడా?

అగ్గునరావుని అంతం చేసినవాడు తనని మాత్ర బ్రతకనిస్తాడు? కోరికోరి శనిగ్రహాన్ని నెత్తిమీదకు ఎక్కించుకున్నట్టయింది. వీడ్ని వదిలించుకునే మార్గం ఎలా?

ఒడ్డునే నడుస్తున్న కృష్ణయ్య "అడుగో త్రినేత్రుడు" అని అరిచాడు. మిగతా ఇద్దరూ అటుకేసి చూశారు.

కాలవ అవతల పెద్ద కొండరాళ్ళ మధ్యగా చిన్న మందిరం ఉంది. దాని గోడలు చాల పాతవిగా ఉన్నయ్. సున్నం ఊడిపోయింది. పెద్ద వాకిలి అయితే ఉందిగాని, దానికి తలుపులు లేవు.

ద్వారంలోంచి త్రినేత్రుడి విగ్రహం బయటకు కనబడుతోంది స్పష్టంగా. లోగడ కృష్ణయ్య ఎత్తుకు వచ్చిన విగ్రహం లాగే ఉంది, ఇది కూడా. కళ్ళకు బదులుగా రెండు ఎర్రని వజ్రాలు కాంతిని విరజిమ్ముతున్నయ్. రెండు కళ్ళకు పైన మధ్యగా, మూడో నేత్రంలో ఆకు పచ్చని రాయి మెరుస్తున్నది.

ఆ కాంతుల్ని చూస్తుంటే మనసులో ఏవేవో భావాలు కలుగుతున్నయ్. వాళ్ళు నిలిచినచోట కాలువ లోతు తక్కువగా కనుపించింది.

ముగ్గురూ కాలువ దాటారు. త్రినేత్రుడి విగ్రహం వంకే అందరూ చూస్తూ, సూదంటు రాయి వైపుగా ఆకర్షింపబడే ఇనుపరాళ్ళలా, అచేతనంగా ముగ్గురూ మంత్రముగ్ధుల్లా నడుస్తున్నారు.

ద్వారం దాటి లోపలకు అడుగుపెట్టారో లేదో, "బంర్" మని ఏదో జీప్ వచ్చిన చప్పుడు వినిపించింది.

అడవిలో అనేక ప్రమాదాలను దాటుకుంటూ ప్రయాణించటంవలన తనకు ఏదైనా భ్రమ కలుగుతున్నదేమో అని అర్జునరావు, మిగతా ఇద్దరి ముఖాల వంక చూశాడు.

అదేసమయంలో వాళ్ళు గూడ అదే ఆలోచనతో అర్జునరావు వంక చూశారు.

ద్వారం ఇవతలకు వచ్చి, కొండరాళ్ళ చాటున నక్కి— కాలువ అవతల వైపుకు చూశారు ముగ్గురూ.

# 14

కాలువ ఆవలి ఒడ్డున ఎటువంటి సంచలనంలేదు. మరయితే ఆ మోత ఎక్కడినుంచి వచ్చినట్టు? నలుదిక్కులా కలయజూశారు ముగ్గురూ.

మళ్ళీ 'బంర్' మని అదే మోత వినిపించింది. సవ్వడి వచ్చిన వేపుకు దృష్టి సారించారు.

దూరంగా చెట్టు కొమ్మల్లో వింతరకం పక్షి ఒకటి కూర్చుని ఉంది. దాని ముఖం గుడ్లగూబ ముఖంలా ఉంది. ముక్కు చిలక ముక్కులా వాడిగా వంకరదేలి ఉంది. తల మీద కోడిపుంజు కున్నట్లుగా ఎర్రని మాంసం కిరీటంలా కనుపిస్తోంది. పక్షే వింతగా ఉంది. పైగా దాని అరుపు అచ్చం మోటూరుకారు 'బంర్' మన్నట్లే ఉంది.

"అరె! ఆమోత నిజంగా కారూదీకాదూ, జీప్ దీకాదు! ఆపక్షి అరుపే అంత! పదండి; పదండి!" అంటూ కృష్ణయ్య మళ్ళీ గుడిలోకి ఆత్రంగా పరుగెత్తాడు.

త్రినేత్రుడి విగ్రహానికి నమస్కరించాడు. ఆ తర్వాత రెండు చేతులతోను దాన్ని ఎత్తి క్రిందకు దించాడు. ఏమి లోహంతో చేశారో ఏమో విగ్రహం చాల బరువుగా ఉంది.

విగ్రహ పీఠం మీదనున్న నాపరాతి పలకను తొలగిం

చారు, అర్జునరావూ, కృష్ణయ్యా కలిసి.

లోపల మూడు నాలుగడుగుల బిలం ఉంది. దాన్నిండా బంగారు నగలున్నాయ్. ఆ నగల్లో వజ్రాలు, వైఢూర్యాలు, రత్నాలు, మాణిక్యాలు, గోమేధికాలు మొదలైన అతి విలువగలవి పొదగబడి ఉన్నాయ్.

పదినిముషాలపాటు ముగ్గురూ తాము చూసేది కలా నిజమా అన్నట్టుగా వాటివంక చూశారు.

తరువాత తమ దగ్గరున్న సంచీలోని ఆయుధాల్ని ఖాళీచేసి, దాన్ని బిలంలోంచి బయటకు తీసిన నగలతో నింపారు.

సంచీ మూట కట్టేశాడు కృష్ణయ్య. నీళ్ళకవతలగా గట్టుమీద ఉంచాడు ఆ సంచీని.

అర్జునరావు త్రినేత్రుడి విగ్రహాన్ని మళ్ళీ యధాస్థానంలో ఉంచాడు. అదే సమయంలో వెనుకనుంచున్న కృష్ణయ్య వికటంగా నవ్వాడు. అర్జునరావు వెనక్కి తిరిగి చూశాడు.

కృష్ణయ్య తన కోటుజేబులోంచి కత్తిని తీశాడు. అర్జునరావు, కృష్ణయ్య తనమీదకు రాబోతున్నాడేమో అని గభాల్న తప్పుకుని, అతణ్ని ఎదుర్కొవటానికి సిద్ధమైనాడు.

కాని కృష్ణయ్య చూపు త్రినేత్రుడి విగ్రహానికున్న మూడు నేత్రాలకు అమర్చబడిన విలువైన వజ్రాలమీద వుంది.

కత్తితో విగ్రహం కన్నుని పొడిచి ఆ వ్రజాలను తీయటానికి ప్రయత్నించాడు. కాని అవి ఒకంతట తేలిగ్గా ఊడిరాలేదు.

అర్జునరావు అతణ్ని వారించాడు. "కృష్ణయ్యా! ఇంతకు

ముందే అలాంటి విగ్రహాన్ని కాజేసినందుకు మనకు తగిన శాస్తి జరిగింది. మళ్లీ ఈ విగ్రహాన్ని పాడుచేస్తే, మనం మళ్ళీ మనదేశం చేరలేకపోవచ్చు!''

కాని కృష్ణయ్య వినలేదు. ఆకాశం విరిగి మీదపడ్డా తన ప్రయత్నం వీడనన్నాడు. ''మూడు విలువైన వజ్రాలను ముగ్గురం పంచుకుందాం! మీకు అవి అవసరం లేదంటే చెప్పండి. మూడింటినీ నేను ఉంచుకుంటాను'' అన్నాడు కర్కశంగా అర్జునరావు కళ్ళలోకి చూస్తూ.

అంతలోనే బయట చెట్లమీద పక్షుల గుంపులు గోలగా లేచినయ్ అరుస్తూ.

''మురుగన్! బండ చాటున నక్కి బయటకు చూడు. ఆ పక్షుల అరుపులు వింటుంటే, ఆ దారంట ఏదైనా క్రూరమృగం వస్తూండాలి! లేదా ఆ దారంట మనుషులైనా ఉండాలి'' అన్నాడు అర్జునరావు.

మురుగన్ తన తుపాకీని సరిచేసుకుని కొండరాయి వెనక నక్కి కాలవ ఆవలి ఒడ్డుకు చూశాడు.

దూరాన ఇద్దరు వ్యక్తులు నడిచి వస్తున్నారు. వాళ్లిద్దరూ బాస్, కన్నన్!

మురుగన్ లోపలకు వచ్చి అర్జునరావుకి ఆ విషయం చెప్పాడు.

''చూశావా కృష్ణయ్యా! వాళ్ళు అప్పుడే ఇక్కడకు చేరుకున్నారు. వాళ్లకన్న మనం ముందుగా ఇక్కడకు చేరుకున్నట్టుగా వాళ్లు గుర్తించడం ప్రమాదం. కనుక ఆ విగ్రహాన్ని పీఠంమీద ఉంచేయ్. ఆగంతకులకు ఆతిథ్యం ఇచ్చాక, మళ్ళీ నీ ఇష్టప్రకారమే కానిద్దాం!'' అన్నాడు అర్జునరావు.

కృష్ణయ్య గర్వంగా చిరునవ్వు నవ్వాడు. ''సరే!

అలాగే కానిద్దాం!'' అంటూ నిధి ఉన్న సంచీని కొండ రాయిచాటుకు చేర్చాడు.

కన్నన్, బాస్ ఇద్దరూ కాలవగట్టు దగ్గరకు వచ్చారు.

''అరె! కాలవదాటటానికి ఏమీ వంతెన లేదే! ఇప్పు డెలా?'' అని కంగారు పడ్డాడు బాస్.

''ఫరవాలేదు బాస్! వంతెన లేకపోయినా పొడవాటి నిచ్చెనను ఒకదాన్ని ఆటవికుల దగ్గర భద్రపరిచాను. నిము షాల్లో వెళ్లి తెస్తాను'' అంటూ కన్నన్ వెనక్కు పరు గెత్తాడు.

''సరే! త్వరగా ఏడువు!'' అంటూ బాస్ చెట్టు నీడ లోకి వెళ్లి నిలబడ్డాడు.

కాలువకు ఇవతలగా కాచుకొని కూర్చున్న వ్యక్తులు ముగ్గురూ ఆగంతకుల పని పట్టటానికి ఆత్రంగా వేచి ఉన్నారు. కాని బాస్, వాళ్లగన్ రేంజ్ కన్న దూరంలో ఉన్నాడు. అతడు కాలువ దాటి ఈవలి గట్టుకు వచ్చే వరకూ ఆగక తప్పలేదు. ఈ లోపలే తాము త్వరపడి కాల్పులు జరిపితే, అతడు రాళ్లచాటున పొంచి ఉన్న ప్రమాదాన్ని ముందే పసిగట్టి పారిపోగలడు. అంతేకాదు. తాము ఈ దీవినుంచి బయటపడటానికి వీల్లేకుండా దిగ్బంధ నంలో బంధించేయవచ్చు.

పావుగంటలోనే కన్నన్ తిరిగి వచ్చాడు పొడవాటి నిచ్చెనతో. అది ఇనుప కమ్మీలతో చేయబడిన నిచ్చెన. ఎనిమిది అడుగుల పొడవు ఉంది. బరువుగా ఉండటం మూలాన్న, ప్రయాసతో దాన్ని మోసుకొస్తున్నాడు.

నిచ్చెన నేలమీద పడేశాడు. అది ఫోల్డింగ్ లాడర్. సగానికి మడవబడింది. దాని ఫోల్డింగ్ విప్పి, స్క్రూలు టైట్ చేశాడు కన్నన్.

నేల బారుగా దాన్ని జరుపుతూ ఈ ఒడ్డునుంచి ఆ ఒడ్డుకు దాన్ని జరిపారు. నీళ్ళమీద, అడుగు ఎత్తున, ఈ చివరనుంచి ఆ చివరకు ఇనుప కమ్మీల వంతెన ఏర్పడింది.

బాస్ నిచ్చెన మీదుగా నడుస్తున్నాడు. కన్నన్ అతడి వెనుకే పనిముట్లతో ఉన్న సంచీని మోసుకువస్తున్నాడు.

"బాస్‌ని నాకు వదిలెయ్యండి! వాడ్ని నేను చంపుతాను. మా నాన్నను పొట్టన పెట్టుకున్న హంతకుడు. అతడ్ని నేను స్వయంగా కాల్చి చంపుతే మా నాన్న ఆత్మ శాంతిస్తుంది" మురుగన్ మెల్లగా అన్నాడు.

"కృష్ణయ్యా! నీవు కన్నన్‌ని షూట్ చెయ్! తెలిసిందా? గురి తప్పరాదు. అలా తప్పిందో మన పని అవుట్!" అన్నాడు అర్జునరావు కృష్ణయ్యనుద్దేశించి.

"అలాగే! వాడ్ని రెండు బులెట్లతో యమపురికి పంపనూ!"

"చూడు మురుగన్! బాస్‌ని నువ్వే షూట్ చెయ్యి. నీతో బాటు నేను వాడ్ని కాలుస్తాను. ఎందుకో తెలుసా? ఒకవేళ నీగురి తప్పిపోయిందంటే వాడు మననుంచి తప్పించుకోవటమేగాక, మనపాలిట పగబట్టిన త్రాచుపాములా తయారవుతాడు. సరేనా?"

"మీ ఇష్టం అలాగే కానివ్వండి!" మురుగన్ తన అంగీకారాన్ని తెలిపాడు.

# 15

"వాళ్ళిద్దరూ రేంజ్‌లోకి వచ్చారు. ఫైర్!" అన్నాడు అర్జునరావు.

ఒకేసారి మూడు తుపాకులు పేలాయి. పిడుగుపాటులా వచ్చిన బుల్లెట్లకు బాస్, కన్నన్ ఇద్దరూ నేలకూలారు.

గట్టుమీద నే నారి శరీరాల్లోంచి కారిన రక్తం కాలవలోకి సన్నగా పారింది. నీళ్ళలోని చేపపిల్లలు ఆ రక్తంచుట్టూ మూగుతూ ఎగబడినయ్.

అర్జునరావు సంతోషంగా గన్ దింపి బండకు ఆనించి నిలబెట్టాడు. మురుగన్ తన చేతిలోని గన్‌ని గూడ దాని ప్రక్కనే ఉంచాడు.

అంతలోనే గన్ మరోసారి పేలింది. గుడిలోకి పోబోతూన్న అర్జునరావు నేలకూలాడు, మొదలు నరికిన చెట్టులాగ.

మురుగన్ బిత్తరపోయాడు. "కృష్ణయ్యా! ఏమిటి నీవు చేసినపని!" అని భయంగా కీచుగొంతుతో అరిచాడు.

గన్ బారల్‌ని తుడుస్తూ కృష్ణయ్య గర్వంగా చూశాడు. "ఒరేయ్ కుర్రకుంకా! నీకేం తెలుసని నన్ను ప్రశ్నిస్తున్నావ్! ఈ ధనం, త్రినేత్రుడి విగ్రహం అంతా నాది. నా ఒక్కడిదే! ఇందులో నీకుగూడ భాగంలేదు! తెలుసా?"

మురుగన్ ఈ హఠాత్పరిణామానికి బెంబేలు పడిపోయాడు. నిధిలో తనకూ వాటా లేదంటే, దానర్థం, కృష్ణయ్య తననుగూడ చంపబోతున్నాడనే గదా!

అతడు ఆపాదమస్తకం వణికిపోయాడు. "కృష్ణయ్యా! నీకిది న్యాయమా? నిజానికి ఈ సంపదకు వారసుడ్ని నేను గదా?" అని దీనంగా బ్రతిమాలాడు.

"ఛీ! పిరికి వెధవా! భయపడి చావకు. నిన్ను చంపను లే. ఈ ధనాన్ని, ఆ విగ్రహాన్ని మోసుకురావటానికి నా కింకో మనిషి అవసరం. అందుకే నిన్ను చంపబోవడం లేదు. ఇక నీ దొంగ ఏడుపులు మాని లోపలికి నడు. సంచీ భుజానికెత్తుకో!" కృష్ణయ్య కర్కశంగా అరిచాడు.

మురుగన్ చేసేదేమీ లేక లోపలకు నడిచాడు. అతడి వెనకనే కాలయముడిలా చేతిలో రివాల్వర్ పుచ్చుకుని కృష్ణయ్య వచ్చాడు.

మురుగన్ విలువగల నగల సంచిని భుజానికి ఎత్తుకున్నాడు. కృష్ణయ్య తన బొడ్లో దాచుకున్న కత్తి పైకితీసి విగ్రహంలోని వజ్రాలు వస్తాయేమో అని ప్రయత్నించాడు కొంతసేపు. కాని ఆ వజ్రాలు అంత తేలికగా ఊడి రాలేదు.

చివరకు విసుగెత్తి విగ్రహాన్ని మొత్తం తీసుకెళ్ళాలనే నిశ్చయానికొచ్చాడు.

అదే సమయానికి మురుగన్ "అమ్మయ్యో! ఎంత పెద్ద కొండచిలువ!" అని అరిచాడు భయంగా.

కృష్ణయ్య అదిరిపడ్డాడు. అతడికి కొండచిలువ పేరు వింటేనే గుండెల్లో దడ రేగుతోంది. గిరుక్కున వెనక్కి తిరిగాడు.

మురుగన్ తన భుజాన ఉన్న బరువైన సంచిని కృష్ణయ్యకేసి బలంగా విసిరాడు. అది తగిలితే కృష్ణయ్య చని పోయి తీరాల్సిందే!

కాని కృష్ణయ్య ఒడుపుగా ప్రక్కకు తప్పుకున్నాడు. "నాతోనే చెలగాటమాడతావురా ఫూల్! చూడు నిన్నేం చేస్తానో!" అంటూ తన కందుబాటులోవున్న గొడ్డలిని దొరక పుచ్చుకుని, దాన్ని విసురుగా మురుగన్ మీదకు వేశాడు.

మురుగన్ నేలమీద కూర్చున్నాడు చటుక్కున. గొడ్డలి వెళ్ళి గోడకు కొట్టుకుని, మళ్ళీ నీళ్ళల్లో పడిపోయింది.

మురుగన్ కోతిలా ఛెంగున దూకి కృష్ణయ్య కాళ్ళు

పట్టుకులాగాడు. కృష్ణయ్య దభీమని నేలమీద పడిపో యాడు. బండరాతి నేలకు తలకాయ తగలడంతో తల కాయ చిల్లిపడింది. గాయం అయినచోట తడుముకున్నాడు కృష్ణయ్య. అతడి చేతి వేళ్ళనిండా రక్తం అలుముకుంది.

"నిన్ను, నిన్ను ఇక జాలి దలచగూడదు. పోనీలే పసి పిల్లవాడుగదా అని ఉపేక్షిస్తుంటే నాకే ఎసరుపెట్టాలని చూస్తావా? ఇక నిన్ను బ్రతకనివ్వను" అంటూ దూకు డుగా మురుగన్ మీదకు వచ్చాడు కృష్ణయ్య.

కృష్ణయ్య చేతిలో నాలుగడుగుల పలుగువుంది. దాంతో మురుగన్‌ని బలంగా కొట్టాడు.

మురుగన్ చేతికందిన గన్‌నితీసి దాన్ని రెండు చేతుల్లోను పట్టుకుని ఎత్తిపెట్టి, పలుగు దెబ్బను కాచుకున్నాడు. కాని పలుగు ధాటికి అతడి చేతిలోని గన్ విరిగిపోయింది.

విరిగిపోయిన గన్‌ని అవతల పారేసి మరో ఆధారం కోసం వెతుక్కునే లోపలే మరో దెబ్బవచ్చి పడింది, మురుగన్ మీద. ఆ దెబ్బవెంట మరో దెబ్బ! దాని తర్వాత మరొకటి, మరొకటి!

పగిలిపోయిన తలతో, విరిగిన ఎముకలతో మురుగన్ నేలను కరుచుకున్నాడు. అతడి ప్రాణాలు అనంత వాయు వుల్లో కలిసిపోయినయ్.

కృష్ణయ్య తన చొక్కా విప్పి దాన్ని నీళ్లలో తడిపి, అతడి చొక్కాని తలకు చుట్టుకున్నాడు గట్టిగా. కొద్ది సేపట్లో రక్తస్రావం ఆగింది.

వాచీవంక చూసుకున్నాడు కృష్ణయ్య. మధ్యాహ్నం రెండవుతోంది. నాలుగు, అయిదుగంటలకు మోటార్ బోటు ఆ దీవి తీరంలోకి వస్తుంది. రాత్రి ఏడు, ఎనిమిది గంటల వరకూ తమకోసం ఎదురుచూడమని డ్రైవర్‌తో చెప్పి ఉన్నాడు అర్జునరావు.

కనుక తను ప్రయాణంచేసి తీరాన్ని చేరుకోవటానికి ఆరుగంటలు వ్యవధి ఉంది.

త్రినేత్రుడు విగ్రహాన్ని మరో సంచీలో వేసుకున్నాడు. ఆ సంచీమూతికీ, నిధి ఉన్న సంచీ మూతికీ మరో త్రాడు బిగించి కట్టాడు. రెండు సంచుల్నీ కుడిభుజంమీద వేసుకున్నాడు, ఒకటి ముందుకీ, మరొకటి వెనక్కీ - త్రేలాదేలా అచ్చం గాజుల వ్యాపారులు, గాజుల మూటలు వేసుకున్నట్టుగా.

కృష్ణయ్య ఆనందానికి అవధులులేవు. తన వెంటవచ్చిన ముగ్గుర్నీ ఆ దీవికి బలిఇచ్చి త్రినేత్రుడె శిథిలాలయంలో ఉన్న నిధినీ, అపూర్వ విగ్రహాన్నీ తనొక్కడే స్వంతం చేసుకున్నాడు.

కాలువ గట్టుమీదకు చేరేలోపల అతడు ఆనంద పట్టలేక పెద్దగా, వికటాట్టహాసం చేశాడు.

అతడి వికృతమైన నవ్వుకు చుట్టూ చెట్లమీద ఉన్న పక్షులు అరుచుకుంటూ లేచి గాలిలోకి ఎగిరి, ఆకాశంలో ఒక చుట్టు ఎగిరివచ్చి మళ్లీ చెట్లమీద కూర్చున్నయ్.

ఆ దృశ్యాన్ని చూస్తూనే కృష్ణయ్య పొట్టమీద చేతులతో నొక్కుకుంటూ మరోసారి తృప్తితీరా నవ్వాడు. అతడి నవ్వుకు అతడి కళ్ల వెంట నీళ్లు కారినయ్.

ఇనుపకమ్మీల నిచ్చెనమీద బాలెన్సు తప్పిపోకుండా, తనమీదున్న బరువుని సరిచేసుకుంటూ అడుగులు వేస్తున్నాడు కృష్ణయ్య. వంతెన సగం దాటాడు.

నీళ్లమీద కొయ్యదుంగలాటిది తేలింది. కాని దాన్ని కృష్ణయ్య గమనించనే లేదు.

ఆ కొయ్యదుంగ పది అడుగుల పొడవు ఉంది. నీళ్లమీద తేలినమీదట, కోడిగ్రుడ్డు పరిమాణంలో ఉన్న

దాని కళ్ళను తెరిచింది. వాటిని చూస్తూనే అదో పెద్ద మొసలి అని ఎవరైనా గుర్తించవచ్చు.

కాని కృష్ణయ్య తన పరిసరాల్ని సైతం గమనించే స్థితిలో లేడు.

తనలాంటి భయంకర నీటి జంతువుని చూసి కూడ కృష్ణయ్యలాంటి మనిషి, ఏ మాత్రం లక్ష్యపెట్టకపోవడం ఆ మొసలికి కోపం కలిగించిందేమో, అది తన తోకను గట్టిగా ఝాడించింది.

నీళ్ళమీద నురుగులు కక్కుతూ అలలు లేచినయ్. దాని తోక తాకిడికి కాలువమీదున్న నిచ్చెన చెదిరి పోయింది.

కృష్ణయ్య తనకోసం పొంచిఉన్న ప్రమాదాన్ని గుర్తిస్తూనే నిలువెల్లా వణికిపోయాడు. అతడి కాళ్ళక్రింది నిచ్చెన కదిలిపోయింది. నీళ్లలో దబ్బున పడ్డాడు.

మొసలి గుహలాంటి తననోటిని తెరిచింది. పురుగుని పట్టుకునే కప్పలాగ, నీళ్లలో, ప్రాణభయంతో, రక్షించుకోవాలన్న తాపత్రయంతో గిలగిలలాడుతున్న కృష్ణయ్యను తన పండ్లమధ్య ఇరికించుకుని నీళ్ళలోకి మునిగింది.

స్వార్థపరులైన మానవుల చేష్టలను చూడటానికి ఇష్టం లేని వాడిలా త్రినేత్రుడు కాలువలో నీళ్ల అడుగున నాగరిక మానవులకు అందకుండా, మురుగున పడిపోయాడు.

—: ఐపోయింది :—




## (పదకొండవ భాగం)

"అక్కడ్నుంచి ఎలా తప్పించుకొన్నావ్?" అడిగాడు ఆతృతగా.

"వాళ్ళు నిద్రపోకుండా జటాయువుల్లా రెప్ప వెయ్యకుండా కాపలా కాస్తూ కూర్చున్నారు. నేనూ అలాగే వాళ్ళతోపాటు నిద్రపోతున్నట్లు నటిస్తూ మేలుకుని కూర్చున్నాను. ఇంతకు గంటముందే నిద్ర ముంచుకొచ్చి కళ్ళు మూసుకున్నారు. అదే అదనుగా భావించి తప్పించుకుని వచ్చేశాను" అంది షెల్లా.

"ఇక్కడికి త్రోవ తెలిసిందా?"

"వెళ్ళేప్పుడే గుర్తులు పెట్టుకొన్నాను. అందువల్ల సులభంగా రాగలిగాను."

నన్ను బంధించిన ఆటవికులు చేసిన అల్లరి అంతా వివరంగా చెప్పాను. వాళ్ళు వెళ్ళిపోయిన విషయం కూడా చెప్పాను.

"ఇప్పుడేం చేద్దాం?" అంది డెల్లా.

"మనం వాళ్ళు వచ్చేలోగా ఇక్కడినుండి తప్పించుకుని వెళ్దాం. ఈ కర్ర దివిటీ వుంది కాబట్టి వెలుపలున్న దయ్యం మన దారికడ్డురాదు" అన్నాను.

ఇద్దరం లేచాం.

వెలుపల వున్నట్టుండి మేఘాల ఉరుములు వినిపించాయి. తళుక్కుమని చీకటిని వెలిగిస్తూ మెరుపులు మెరిశాయి. క్షణంలో వర్షం జోరుగా కురవసాగింది.

వెలుపలికొచ్చాం.

కర్ర దివిటీ డెల్లా చేతిలో వుంది.

ఏనుగులు తొండాలతో నీళ్లు గుమ్మరించినట్లు కురుస్తోంది వాన జోరుగా. వెలుపలకొచ్చి రెండడుగులు వేసేలోగానే మేము ముద్దగా తడిసిపోయాం. మాతోపాటు, మా దగ్గరున్న దివిటీ ఆరిపోయింది.

అంతే! నా నెత్తిన దభీమని దెబ్బపడింది.

"అమ్మో!" అని అరచాను.

డెల్లా కూడా పెద్దగా కేక పెట్టింది.

దయ్యం నన్ను వెనక్కి నెట్టింది. ఆ తాకిడికి వెళ్ళి గుడిసెలో పడ్డాను. నా వెంటనే డెల్లా కూడా వచ్చి పడింది.

ఒకరిపైన ఒకరం పడిపోయాం.

దయ్యం అరుపులు వికృతంగా వినిపించాయి.

ఇద్దరం సర్దుకుని లేచి కూర్చున్నాం లోపల.

"పాడు వాన! మన ప్లాను కాస్త పాడుచేసింది" అన్నాను.

"నువ్వు దయ్యం మాట చెపితే నమ్మకం చిక్కలేదు నాకు ముందు. తీరా దెబ్బ తగిలాక అర్థమయింది" అంది

డెల్లా తల చేతుల్లో ఘట్టిగా పట్టుకుని.

"తెల్లవారుతున్నట్లుంది. నువ్వు అక్కడ కనుపించక పోవటంతో ఆడ ముఠా కంగారుపడుతూంది. వెతుక్కుంటూ వస్తారు. నిన్ను ఇక్కడ చూసి ఏంచేస్తారో?" భయంగా అన్నాను.

డెల్లా నా మాటకు జవాబు చెప్పలేదు. మౌనంగా చూస్తూ కూర్చుంది. దూరంగా పెద్ద పెద్దగా అరుపులు, తప్పెట్ల మోతలు వినిపించటం మొదలెట్టాయి.

"ఏమిటా శబ్దాలు?" అడిగింది డెల్లా.

"రాత్రి వెళ్ళిన ముఠా తిరిగివస్తూన్నట్లుంది. వాళ్ళ చేతుల్లో మనకు చావు మూడినట్లే వుంది. మనల్నిద్దరినీ ఇక్కడ చూడగానే వాళ్ళకు కోపం రెచ్చిపోతుంది. అసలే అటవికులు. అందులో అనాగరికులు. మనల్ని ప్రాణాలతో ఉండనివ్వరు" అన్నాను భయంగా.

నా మాటకు డెల్లాకు వొణుకు పుట్టుకొచ్చింది. లేచి వచ్చి నా వెనకగా వీపు చాటుచేసుకుని కూర్చుంది.

ఆ ముఠా మేమున్న స్థలంమీదుగా వెళ్ళిపోయింది. ఎవ్వరూ మమ్మల్నిగురించి పట్టించుకోలేదు. చీకటి దట్టంగానే ఉంది. నేను కళ్లు చిట్లించుకొని చూడసాగాను.

వెళ్ళినవాళ్లు వెళ్ళినట్లే వచ్చారు. చేతుల్లో ఆయుధాలు తళతళ మంటున్నాయి. దివిటీలు మండుతున్నాయి. కుక్కలు కదులుతున్నాయి వాళ్ళతోపాటే.

అందరూ వెళ్ళిపోయారు.

"నేను వెళ్తాను" అంది డెల్లా ప్రక్కగా కదిలొచ్చి.

"ఎలా? మనకు కాపలావున్న దయ్యం పోనిస్తుందా?" సందేహంగా అన్నాను.

"తెల్లారాక వాళ్ళు నన్ను ఇక్కడ చూస్తే నిన్నే

మయినా చేస్తారేమోనని భయంగావుంది. నాకేమైనా ఫర్వాలేదు. వెళ్తాను.''

''వద్దు! ఆ చేసేదేదో ఇద్దర్నీ చేస్తారు. నువ్వు ధైర్యంగా వుండు ఇక్కడే!'' అన్నాను.

డెల్లా ప్రయత్నాన్ని మానిపించేశాను.

మిగిలిన కొద్దిరాత్రి జాగరణ చెయ్యడం అనవసరమనుకొని, ఇద్దరం నేలపైనే పడుకున్నాం. హాయిగా నిద్రపోయాం.

తెల్లారింది.

నాయకుడు మనిషిని పంపాడు. వాడువచ్చి నాతో పడుకునివున్న డెల్లాను చూసి ముక్కుమీద వ్రేలేసుకుని పరుగెత్తిపోయాడు.

ఐదునిముషాలలో ఆటవికుల గుంపంతా అక్కడ తయారయింది. ఒకడు మమ్మల్నిద్దరినీ వెలుపలకు రమ్మన్నాడు. అలాగే చేశాం. అతనివెంట నడవమన్నట్టు చేతులూపుతూ చెప్పాడు. అతన్ననుసరించి వెళ్ళాం.

నాయకుడి ఇంటిముందుకు వెళ్ళి ఆగాం.

ఎప్పటిలాగే నాయకుడు ఎత్తైన ఆసనంపైన కూర్చున్నాడు. అతని బలగమంతా మా చుట్టు కూర్చుంది. మమ్మల్నిద్దరినీ ఒక పెద్దరాయిపై నిలుచుకోమన్నారు.

నాయకుడు అరుస్తూ ఏదేదో చెప్పసాగాడు. అతని మాటల్లో ఒక్క ముక్కకూడా నాకు అర్థంకాలేదు. మేమేదో పెద్ద తప్పుచేసినట్లు మాత్రం తెలుసుకొన్నాను. అతను మాట్లాడే తీరు, ధోరణినిబట్టి, మా తప్పుగురించి తన ముఠాకు వివరించి చెప్తున్నట్లు తోచింది.

అతను మాట్లాడటం ముగించి, చేతిలోవున్న పెద్ద ఎముక పైకెత్తాడు. మూడుసార్లు గాలిలో క్రిందికీ పైకీ

ఊపాడు. వెంటనే పెద్దపొగ పుట్టుకొచ్చింది. ఆ పొగ మాయమై ఒక భయంకరమైన ఆకారం ప్రత్యక్షమైంది.

నాయకుడు దాన్నేదో అడిగాడు.

ఆ ఆకారం భయంగా వంగి సమాధానం చెప్పింది.

అతను కోపంగాలేచి ఆ ఆకారంపైకి దూకి, చేతిలో వున్న ఆ ఎముకతోనే బాదాడు. ఆ ఆకారం కుయ్యో, మొర్రో అంటూ ఏడవసాగింది. అయినా అతను విడువ లేదు. పదినిముషాలు అలా కొట్టాక, తన మంత్రదండాన్ని గాలిలో ఊపాడు. ఈమారు ఆ దయ్యంచుట్టూ ఎర్రటి మంటలు లేచాయి. వాటిమధ్య అది కాలిపోయింది.

అక్కడ కూర్చున్న మూకా మొత్తం, ఒక్కగొంతుతో 'కీ'మని పెద్దగా అరచింది.

నాకు కొంతకొంత అర్ధంకావస్తుంది. కొన్నికొన్ని మాటలు ఒకటికి పదిసార్లు వినడంవల్ల వాటి భావం ఊహించగలిగాను.

నన్ను కాపలాకాయడంకోసం నియమించిన భూతమది. తన విధి నిర్వహణలో ప్రమత్తంగా వున్నందుకు నాయకుడు కోపించి విధించిన శిక్షే ఆ దహనకాండయి వుంటుందను కున్నాను.

ఆ ఘట్టం పూర్తికాగానే, నాయకుడు నా ముందు కొచ్చి నిలుచున్నాడు. డెల్లానూ, నన్నూ తేరిపార చూశాడు.

అతని అనుచరులను పిలిచాడు. వాళ్ళకేవో ఆజ్ఞలు జారీచేశాడు. వాళ్లు తాళ్ళలాంటి వేవో తెచ్చి మమ్మల్నిద్దరినీ కలిసి కట్టేశారు. మా చుట్టూ ఒక డజను కుక్కల్ని కాపలా పెట్టారు. అక్కడ్నుంచి అంతా వెళ్ళిపోయారు.

అవి పేరుకు మాత్రమే కుక్కలు. ఆకారాలు చూస్తే

పులుల్లా బలిసి వున్నాయి. నాలుకలు బైటపెట్టి రొప్పుతూ కూర్చున్నాయి.

"ఏం చేస్తారు మనల్ని?" అడిగింది డెల్లా.

"ఆ దయ్యాన్ని కాల్చినట్లు మాత్రం కాల్చరు" అన్నాను.

"ఎందుకని?"

"అలా చెయ్యాలంటే ఇంతకుముందే ఆ పని పూర్తయ్యేదిగా?"

"వీళ్ళకు మనమేమీ చెప్పేట్లు లేదు. ఏం తప్పు చేశామని ఈ శిక్ష మనకు" అడిగింది డెల్లా.

"ఈ జాతుల్లో రకరకాల ఆచారాలు, పద్ధతులు వున్నాయి. ఆడవాళ్ళుండే గూడెం మగవాళ్ళుండే గూడెం విడివిడిగా దూరంగా వుండటంబట్టి, ఎప్పుడంటే అప్పుడు ఆడ, మగ కలుసుకోనేందుకు అవకాశం లేకుండా చేసుకున్నారు.

అంటే ఏదో నిర్దిష్టమైన ఒక పద్ధతి ప్రకారం ఆ సృష్టి కార్యం జరుగుతూ వుండొచ్చు. రెండోది మగవాళ్ళ ఆరు వందలమందికి పైగానే వున్నారు. కానీ ఆడవాళ్ళు తక్కువమంది వున్నారు. ఇంతమందికి వాళ్ళు చాలరు. సర్దుకోనేందుకు ఏదో పద్ధతి పెట్టుకొని వుంటారు. అలాంటి నియమాల్ని మనం ఉల్లంఘించి మగవాళ్ళ గూడెంలో కలిసి వుండడం వాళ్ళకు కోపకారణమయి వుంటుందనుకుంటాను. అందుకే ఈ రగడంతా!" నాకుతోచింది చెప్పాను.

ఎండ ఎక్కువైంది.

పైన మంట పెట్టినట్లుంది. ఆ వేడికి కాళ్ళక్రిందున్న రాయి బాగా వేడెక్కిపోయింది. నిప్పుల్లో కాళ్ళు పెట్టి

నట్లుంది మాకు. మాలతీ, గతీ కనుక్కొనే నాధుడులేడు. పక్షులు మాత్రం చుట్టూ కూర్చున్నాయి.

వాళ్ళు కట్లుకట్టిన రీతి మమ్మల్ని కూర్చోనేందు కూడా వీలులేకుండా చేసింది.

అలాగే సాయంత్రందాకా నిలుచున్నాం. మసకచీకటి ముసురుకొచ్చింది. ఆకలితో ప్రేగులు కాలిపోతున్నాయి. దాహంతో నాలుక పిడచకట్టుకుంది. శరీరమంతా నిస్సత్తువ, నీరసం. నోట మాటకూడా రావడంలేదు.

బాగా చీకటి పడింది. ఆ గుంపంతా వచ్చింది. ఈమారు వాళ్ళముందు ఆడవాళ్ళు, పిల్లలూ వున్నారు. తప్పట్లు మ్రోగించుకుంటూ వచ్చారు. మా కట్లు విప్పారు. రాయి పైనుండి క్రిందికి దించారు.

ముందు నాయకుడు, అతని వెనుక ఆడవాళ్ళు, పిల్లలు, ఆ వెనుక మేమూ, మా తర్వాత మిగిలిన ముఠా నడవసాగాం. అలా గుడిసెలన్నీ దాటుకొని అడవిలోకి దారి తీశారు. ఒక మైలు దూరం పోయాక పెద్ద రాతి విగ్రహం ముందు ఆగిపోయారు.

ఆ విగ్రహం కాళ్ళ ముందు గుండ్రటి రాతిబండ వుంది. దానికేసి చూశాను. ఎర్రటి నెత్తురు మరకలు కనుపించాయి. జంతువుల్నో, మనుషులనో, ఆ దేవతకు బలిఇచ్చి వుండాలనుకున్నాను. మమ్మల్ని బహుశా అందుకే ఇక్కడికి ఊరేగించుకొచ్చి వుండాలన్న అనుమానం కలిగింది. డెల్లాకు రహస్యంగా చెప్పాను. విని విభ్రాంతి చెందింది.

నాయకుడు నన్ను పిలిచాడు. ఆకులు, పూలూ, కలపి కట్టిన లావుపాటి దండ నాచేతి కందించి, విగ్రహాన్ని చూపించి, మెడలో వేసిరమ్మన్నట్లు సంజ్ఞ చేశాడు. నేను అందుకున్నాను. వెళ్ళి విగ్రహం ముందు నిలుచున్నాను.

విగ్రహం సుమారు అరవై అడుగుల ఎత్తు వుంది. నల్లగా నున్నగా ముట్టుకుంటే జారిపోయేటట్లుగా వుంది. దాని పైకి ఎక్కేందుకు మెట్లు లేవు. వెనకవేపు వెళ్ళి చూశాను. అటూ అలాగే వుంది.

ఎలా ఎక్కాలని అడిగాను చేతుల్తో నటిస్తూ.

అతనికర్థమయింది నా ప్రశ్న. తనకు తెలీదన్నట్లు గాలిలో చేతులు అడ్డంగా ఊపాడు.

నా కిదో పరీక్షలాగుం దనుకున్నాను. ఎలాగైనా ఈ పరీక్షలో నెగ్గాలన్న పట్టుదల కలిగింది.

దండ తీసుకొని రాతి విగ్రహం ఎక్కడం మొదలెట్టాను ముందువేపునుంచి. గుంపంతా అక్కడే కూర్చుని ఆత్రుతగా అప్రమత్తంగా నాకేసి చూడసాగింది. అంగుళం అంగుళం ప్రాకుకుంటూ, పట్టు జారిపోకుండా చూసుకుంటూ, దాదాపు విగ్రహం గుండెలదాకా ఎక్కాను.

అందరూ సంతోషంతో చప్పట్లు కొట్టారు.

అక్కడ్నుంచి అతి కష్టంమీద, విగ్రహం కుడిభుజం పైకెక్కాను. భుజంపైనుండి తల అంచు ఒక నిలువుకన్నా ఎత్తువుంది. కుడి చెవి నాధారం చేసుకుని మెల్లగా ఎక్కి నా చేతిలోవున్న దండ విగ్రహం మెడలో పడేశాను.

అక్కడున్న జనం చేసిన హాహాకారాలు మిన్ను ముట్టాయి. ఆ శబ్దానికి నా చెవులు గింగురుమన్నాయి.

మెల్లగా దిగసాగాను. ఎక్కడంకన్నా దిగడమే కష్టంగా తోచింది. పట్టు చిక్కక, కాళ్ళు జారుతూ, చచ్చి చెడి అరగంటసేపు ప్రయత్నంచేసి క్రిందికి వచ్చి డెల్లా ప్రక్కన నిలుచున్నాను.

నాయకుడు మా ముందు నిలబడ్డాడు. జనానికి అభిముఖంగా నిలుచుని ఏమేమో చెప్పసాగాడు.

బలిపీఠం పైనుండి, బలి పశువుల గురించి ఇచ్చే ఉప న్యాసమేమో ననుకున్నాను. అతను చెప్పడం మాని పక్కన నా వేపు తిరిగి రెండు చేతుల్తో నన్ను కౌగలించుకున్నాడు. నాకు అది కలో, నిజమో అర్థంగాక అయోమయంలో పడి పోయాను. ఆడవాళ్ళలోనుండి ఇద్దరొచ్చి డెల్లాను అప్యా యంగా చెయ్యి పుచ్చుకుని క్రిందకు తీసుకెళ్ళారు.

మా ఇద్దరికీ బట్టలు మార్చారు. ఆయుధాలిచ్చారు. నాయకుడు పక్కల్ని కూడా మాకు బహుమతిగా ఇచ్చాడు. ఆ తర్వాత విందు చేశారు. మాంసం తిన్నాం. వాళ్ళు త్రాగే పానీయం త్రాగాం.

అందరం తిరిగి వచ్చేశాం. డెల్లా ఆడవాళ్ళతో వెళ్ళి పోయింది. నేను నా గుడిసెలోకి దూరాను. పడుకోందుకు ఆకులతో అల్లిన చాపలాంటి దేదో వేసివుంది. దాహమైతే త్రాగేందుకు పానీయ మేదో కనుపించింది.

నా ఆయుధాన్ని తీసి మూలగా పెట్టి పడుకున్నాను. కమ్మగా నిద్ర పట్టింది. ఆ నిద్రలో ఎన్నో రకాల కలలు వచ్చాయి. అన్నింటిలోనూ ముఖ్యమయింది నేను ఆఫ్రికా ఖండానికే నాయకుణ్ణయిపోవడం, నన్నా జనమంతా దేవుడి క్రింద చూడటం.

తెల్లవారింది. నిద్రలేచాను.

నాకు చాలా హుషారుగా వుంది.

ఆ ఆటవికుల చేతుల్లో ప్రాణాలు పోగొట్టుకోవడం తథ్యమన్నట్లు, భయంతో వాటిన్ని గుప్పెట్లో పెట్టుకుని వుండి అనుభవించిన బాధ తప్పించుకొన్నందుకు ఎంతో ఆనందం కలిగింది.

ఒక అడవి మనిషి ప్రొద్దున్నే ఆహారం పట్టుకొచ్చాడు. దాన్ని నా ముందు పెడుతూ నవ్వాడు. నేను కూడా

నవ్వాను. అతను వెళ్ళిపోయాడు.

వెలుపలికొచ్చి నీళ్ళతో మొహం కడుక్కున్నాను. పళ్ళు తోముకోవడం అనే మామూలు నాగరికుల ప్రక్రియ వదిలేసి ఎన్నో రోజులైంది. కొద్దిగా నీళ్లు నోట్లో పోసుకుని పుక్కిలించి ఉమ్మివేసి లోనికొచ్చాను.

నా ముందుంచిన ఆహారం తిన్నాను. కడుపు నిండింది.

అంతకు ముందు వచ్చి వెళ్ళిన మనిషి మళ్ళీ ప్రత్యక్షమైనాడు. నన్ను తనవెంట రమ్మంటూ సైగ జేశాడు. అతన్ని అనుసరించి వెళ్ళాను.

ఇద్దరం నాయకుడి గుడిసె వద్దకు వెళ్ళాం. నన్ను చూడగానే నాయకుడు లేచి ఎదురొచ్చాడు. నా భుజంపై చెయ్యి వేసి నొక్కాడు ఆప్యాయంగా. వెంట నడిపించుకొని లోనికి తీసుకెళ్ళాడు.

లోపలి కడుగు బెట్టాను.

పులితోళ్లు నేలపైన పరచి వున్నాయి. ఇద్దరం వాటిపైన కూర్చున్నాం. అతను అరుస్తూ మాతో వున్న మనిషికి ఏదో చెప్పాడు. అతను గబగబ వెనుక గదిలోనికి పరుగెత్తాడు. రెండు నిముషాల్లో విస్కీ బాటల్‌తో ప్రత్యక్షమైనాడు. దాన్ని చూడగానే నా ప్రాణాలు గొంతులోకి వచ్చాయి. నోరు ఊరింది.

నా ఆనందం కనిపెట్టినట్లున్నాడు నాయకుడు. చేత్తో నా భుజంపైన ఘట్టిగా తట్టి సీసాకేసి చూస్తూ "త్రాగుతారా" అని సైగ శేస్తూ అడిగాడు.

నేను కూడా సైగ జేసి చెప్పాను త్రాగుతానని.

ఆ బాటిల్ నా చేతిలో పెట్టాడు.

దాని కార్కు ఊడదీసి పైకెత్తాను. గటగటమని త్రాగేశాను సగందాకా ఒక్క ఊపులో. అతను నాకేసి

చూస్తూ వుండిపోయాడు.

బాటిల్ క్రిందిపెట్టి, అరచేత్తో గుండెపైన సద్దుకుని త్రేన్చాను. వొంట్లోకి క్రొత్త శక్తి, ఉత్సాహం ప్రవహించినట్లయింది.

ఇంత మంచి సరుకు వీళ్ళ కెలా దొరికిందా అన్న సందేహం కలిగింది. అతన్ని అడిగాను.

అతను అరుస్తూ, సైగలు చేస్తూ, చేతులూపుతూ, కళ్ళు త్రిప్పుతూ, నాకు అర్థమయ్యేందుకు వీలుగా నానాతంటాలు పడి ఆ విస్కీ చరిత్ర చెప్పడం మొదలెట్టాడు.

నాకంతా అర్థంగాలేదు. కానీ చాలావరకు తెలిసింది.

ఆ ఆటవికుల ముఠా సముద్రంపైన దొంగతనాలు చేస్తూంది. ఆ దొంగతనాలకు వెళ్ళినప్పుడు దొరికిన సరుకది. అదేగాకుండా రకరకాల వస్తువుల్ని కూడా కొల్లగొట్టి తెచ్చినట్లు చెప్పాడు నాయకుడు.

అంతకుముందు రోజు కత్తులు సాన పెట్టడం గుర్తొచ్చింది. అదంతా దొంగతనానికి వెళ్ళేందుకు వాళ్ళు చేసుకున్న ఏర్పాట్లు కాబోలనిపించింది నాకు.

బాటిల్ పూర్తిగా త్రాగేశాను.

ఖాళీ బాటిల్ తీసేశాడా అడవి మనిషి. ఇంకో బాటిల్ తెచ్చిపెట్టాడు. నాకు డెల్లా గుర్తొచ్చింది. ఆమెకూడా కాస్త మందు ఇస్తే బాగుండుననిపించింది. నాయకుడ్ని అడిగాను డెల్లా గురించి. మందు సీసా చూపించి ఆమెకిది అంటే చాలా ఇష్టమని తెలిసేటట్లు సైగలు చేశాను.

అతను నవ్వాడు.

గదిలోవున్న మనిషితో ఏదో చెప్పాడు.

అతను లోనికి వెళ్లి మరో బాటల్ తెచ్చాడు. దాన్ని నాకు చూపించి గబగబ వెళ్ళిపోయాడు.

బహుశా డెల్లాకు దాన్ని ఇచ్చేందుకు తీసుకెళ్తున్నాడనుకున్నాను.

రెండో బాటల్ కూడా కొద్ది కొద్దిగా త్రాగడం మొదలెట్టాను. నాయకుడు నాకేమో చెప్తూ వున్నాడు. సగం వినీ, మిగిలిన సగం వినకుండా, మధ్య మధ్య విస్కీ త్రాగుతూ, ఊకొడుతూ కూర్చున్నాను.

నాకు వాళ్ళమాటలు బాగా అర్థం అవుతున్నాయి. కొన్నికొన్ని మాటలు తిరిగి అనగలుగుతున్నాను కూడా.

సముద్రంమీద దొంగతనాలు చేస్తున్నారు తప్ప, వాళ్ళకు అక్కడ్నుంచి తెచ్చిన వస్తువులేమిటో, అవి ఎందుకు పనికొస్తాయో, తెలీక ఒకచోట గుట్టవేసి ఉంచారనీ వాట్ని చూసి దేనికైనా ఉపయోగిస్తాయో లేదో చెప్పమని అడిగాడా నాయకుడు. సరేనన్నాను. ఇకపైన జరపబోయే దొంగతనాల్లో నన్నుకూడా వెంటరమ్మని కోరాడు. ఒప్పుకున్నాను.

మే మిద్దరం లేచి అతని గుడిసె వెనుకనున్న ఇంకో చిన్న గుడిసె వద్దకుపోయాం. ఒక అడవి మనిషి కాపలా కాస్తూ తిరుగుతున్నాడు. మమ్మల్ని చూడగానే ప్రక్కకు తప్పుకున్నాడు.

నాయకుడు అతన్ని తలుపు తెరవమన్నాను.

ఆ మనిషి చెప్పినట్లు చేశాడు.

ఇద్దరం లోనికి వెళ్లాం.

ఆ గుడిసె నిండా రకరకాల సామానులు కనుపించాయి.

వాళ్ళు కొల్లగొట్టి తెచ్చిన వస్తువుల్లో కొన్నింటిని చూచి నాకు నవ్వొచ్చింది. ఒక పెద్ద రిఫ్రిజిరేటర్ వుంది.

ఆ దీవిలో దాని ఉపయోగం శూన్యం. బిస్కట్లడబ్బాలున్నాయి. జామ్ బాటిల్స్, సిగరెట్ కార్టన్స్, రకరకాల సూట్ కేసులు, వాచీలూ, బట్టలు, తుపాకులు, రివాల్వర్లు, చిన్న సైజు మ్యూజియంలా తోచింది నాకా గది.

బంగారంగానీ, మరే దేశపు కరెన్సీగానీ కనుపించలేదు నాకా చోట. అక్కడున్న వస్తువుల్లో తినేందుకు ఉపయోగించే వాటినన్నింటినీ వేరు చేయించి, వెలుపలకు చేర్పించాను.

మధ్యాహ్నం ఆ దీవిలోవున్న జనాన్ని మొత్తం రప్పించి, అందరికీ ఆ బిస్కట్లు బ్రెడ్‌లు పంచిపెట్టి, వాట్ని ఎలా తినాలో అభినయించి చూపించాను. అందరూ తిని, ఆ క్రొత్త రుచికి మురిసిపోయి ఎగిరి గంతేశారు.

విస్కీ కూడా అందరికీ పంచాను.

త్రాగి ఎగిరారు ఆనందంగా.

నాయకుడితో చెప్పి కొంత సరుకు ఆడవాళ్ల కాంపుకు కూడా పంపించే ఏర్పాట్లు చేశాను.

అలాగే నాలుగైదు రోజులు గడిపోయాయి. తినటం, త్రాగడం, నాయకుడితో కుక్కనెక్కి అడవంతా చాలా దూరం తిరగడం, తిరిగివచ్చాక మళ్ళా త్రాగడం, పడుకోవడంలా మారింది నా దినచర్య.

కానీ డెల్లాను కలుసుకునే మార్గం మాత్రం తోచలేదు.

ఆ దీవిలో ఆడమగ కలయికలకు కొన్ని నిబంధనలున్నాయి.

పున్నమి చంద్రుడు వచ్చిన రోజే స్త్రీ పురుష సంపర్కం జరుగుతుంది. ప్రతి ఆటవికుల గుంపుకు పాతిక మందికన్నా మించి ఆడవాళ్ళు లేరు. అందువల్లే వాళ్ళను అతి జాగ్రత్తగా కాపాడుకుంటారు. వాడుకుంటారు.

వాళ్లల్లో పెళ్ళిళ్ళు మొదలైనవి లేవు. ఆడ ముఠా మొత్తం, మగ ముఠాకు ఉమ్మడి ఆస్తి. పున్నమి రాత్రి ఆడవాళ్ల కళ్లకు గంతలు కడ్తారు. వాళ్లను మగగుంపు పైకి వదుల్తారు.

తడుముకుంటూ వచ్చి మొదట ఎవర్ని తాకితే వాళ్లే ఆ రాత్రి వాళ్లను అనుభవించడానికి అర్హులు. మిగిలిన వాళ్ళు తిరిగి వెళ్ళిపోతారు.

నాయకుడికి కూడా అదే నియమం వర్తిస్తుందిట.

ఈ వివరాలు తెలుసుకున్నాక నాకు ఒక విధమైన భయం వేసింది.

డెల్లానుకూడా ఈ గుంపులో కలిపి, వచ్చే పున్నమి నాడు కళ్లకు గంతలు కడతారేమో నన్న అనుమానం కలిగింది.

ఆమెకు అసలీ ఆటవికులన్నా, వాళ్ల రూపాలన్నా, భయం, అసహ్యం. దానికితోడు ఇదీ జరిగితే గుండె ఆగి చస్తుందనిపించింది. ఆ ప్రమాదంనుండి ఆమెను ఎలాగైనా కాపాడాలన్న నిర్ణయానికొచ్చాను. అదే నాకు ముఖ్యమయిన పనిగా తోచింది.

ఆ రాత్రి హాయిగా త్రాగి అరుబైట పడుకున్నాను.

ఆకాశంకేసి చూశాను. చంద్రుడు కనుపించాడు. అతని ఆకారాన్ని బట్టి పున్నమి రెండు మూడు రోజుల్లోనే రాబోతుందని ఊహించాను.

నాయకుడు వచ్చాడు.

చూచి లేచి కూర్చున్నాను.

"ఇంకా నిద్రపోలేదా?" అడిగాడు అతని భాషలోనే.

"లేదు!" అన్నాను నేనూ.

"నీతో వచ్చిన అమ్మాయి గురించి ఆలోచిస్తున్నావా?"

"కాదు!"

"మరి."

"నా గురించే నేను ఆలోచిస్తున్నాను" అంటూ నే నెందుకు బయలుదేరిందీ, చివరకు ఎలా ఇక్కడ చిక్కిపోయిందీ వివరంగా చెప్పాను.

"నువ్వింక ఎక్కడకూ పోవద్దు! మనిద్దరం ప్రాణస్నేహితులం. నాతోనే వుండు" అన్నాడు నాయకుడు.

"అలాగే!" అన్నాను. నిజానికి నాకూ అక్కడుండడం ఆనందంగానే వుంది. అంతకుముందు ఎన్నడూ అనుభవించని రకం జీవితం కావటంవల్ల కాస్త ఆకర్షణీయంగా అనిపించి వుంటుంది.

అదే అదనుగా భావించి డెల్లా సంగతి ఎత్తాను. ఆమె చాలా భయస్తురాలనీ, వాళ్ళ నియమాలు, కట్టుదిట్టాలు, సంప్రదాయాలు ఆమె పట్ల కాస్త సడలించమనీ, వినయంగానే, నాయకుడికి విన్నవించుకున్నాను.

"అలాగే! కానీ నిన్నుకూడా ఈ విషయంలో మా గుంపుకి దూరంగా వుంచాల్సి వస్తుంది!" అన్నాడు నాయకుడు.

"వుంటాను" అన్నాను.

"నువ్వు ఆమె ఇప్పుడు కాకున్నా మరి కొన్నాళ్ల తర్వాతయినా మాతో కలసిపోవాలని నా కోరిక. అలా కలసిపోయిన రోజున నిన్ను ఈ తెగకు నాయకుణ్ణి చేస్తాను. నీ బంటుగా వుంటాను నేను" అన్నాడు నాయకుడు.

అతని ఆప్యాయత, నా పట్ల అతనికున్న గౌరవభావం నన్ను ముగ్ధుణ్ణి చేశాయి.

అతను నాకు నాయకుని పదవి కట్టబెట్టినా చెయ్యగల నన్న నమ్మకంలేదు. అయినా అతనెందుకు విసుగెత్తిపోయాడో తెలుసుకుందామనిపించింది.

"నాయకుడిగా ఉండటం కష్టమా?" అడిగాను.

"ఆఁ! ఈ దీవిలో మొత్తం మూడు తెగలున్నాయి. ఎప్పుడూ యుద్ధాలు జరుగుతుంటాయి. అవి భయంకరంగా జరుగుతాయి. మంత్రతంత్రాలతో పాటు, ఆయుధాలు కూడా వాడుతారు. ప్రాణాలు తీసుకుంటారు. గెలిచేది మాత్రం లేదు. అవతలిగుంపులోవాళ్ళు మనకు చిక్కితే వాళ్ళను తెచ్చి వెట్టిచాకిరీ చేయించుకుంటాం. అంతే!" అన్నాడు.

"వాళ్ళను గెలిస్తే!"

"మొత్తం గుంపంతా మనకు లోబడి వుండాలి. కానీ అది సాధ్యంకాదు. మా యుద్ధాలు ఎన్నో ఏళ్ళనుండి జరుగుతున్నాయి" అన్నాడు.

"మనం కొంత కృషిచేసి, తగిన విధంగా తయారయితే గెలవొచ్చనుకుంటాను" అన్నాను కాస్త దృఢంగా.

"అలా చెయ్యగలిగితే ఈ దీవి మొత్తం మనక్రిందే వుంటుంది. మనం ఎవ్వరికీ భయపడవలసిన అవసరం ఉండదు. నువ్వు ఎలా చెపితే అలా చేస్తాను. మిగిలిన రెండు ముఠాలను గెలిచేందుకు ఏం చెయ్యాలో ఆలోచించు" అన్నాడు నాయకుడు.

"అలాగే!" అన్నాను.

"ఈ క్షణంనుండి నువ్వు నా తర్వాత ఈ ముఠా నాయకుడివి. నాకు ఎంత గౌరవం ఇస్తారో, నీకు అంతే ఇవ్వాలి. మనిద్దరిదీ ఒకటేమాట" అంటూ నన్ను గట్టిగా నే కవుగలించుకున్నాడు.

నాగరికత పెరిగిన దేశాలకూ రాజ్య విస్తరణకాంక్ష వుంది. అందుకోసం ఆటంబాంబులు, విమానాలు వాళ్ళు తయారుచేస్తున్నారు. అనాగరికతతో పశువుల్లా తిరుగుతూ

పెరుగుతూన్న ఈ అడవి మనుషులకూ_డా రాజ్యకాంక్ష ఉండటం విచిత్రంగా తోచింది.

నాయకుడు వెళ్ళిపోయాడు.

ఆలోచిస్తూ పడుకున్నాను. మిగిలిన రెండు తెగలను గెలిచేందుకు మార్గాలకోసం అన్వేషించసాగాను కళ్ళు మూసుకునే. నాకు తెలీకుండానే నిద్రపట్టింది.

మళ్ళీ కళ్ళు తెరచేసరికి కుక్కలు పెద్దగా మొరుగుతున్నాయి. జనం అటూ ఇటూ పరుగెడుతున్నారు. అందరి చేతుల్లోనూ కత్తులూ, కటారులూ వున్నాయి. నాయకుడి ఇంటిముందుకు పోయారు జనం.

నేను లేచి కూర్చున్నాను.

దూరంగా తప్పెట్ల శబ్దం వినవచ్చింది. చీకటి విడిపోలేదింకా. వెలుతురుకోసం దివిటీలు వెలిగించారు. లేచి వెళ్ళాను నాయకుడుండే చోటికి. నన్ను చూడగానే అతను ముందుకొచ్చి "యుద్ధానికొస్తోంది గుంపు" అన్నాడు.

"ఇంత రాత్రిపూటా!" అడిగాను ఆశ్చర్యపోతూ.

"మా యుద్ధాలు రాత్రిళ్ళే జరుగుతాయి. వచ్చి చూస్తావా?" అడిగాడు.

"వస్తాను. కానీ ముందు హెచ్చరించకుండా, ఇష్టం వచ్చినప్పుడు ఇలా అర్ధరాత్రిపూట వచ్చి పైనపడే పద్ధతి బాగాలేదు" అన్నాను.

"మీకు బాగుండే పద్ధతులు మాకు అలవాటులేవు. మేముకూడా ఇలాగే వెళ్తాంటాం మిగిలిన వాళ్ళపైకి యుద్ధానికి" అన్నాడు నాయకుడు.

నేను ఒక మనిషిని వెంటతీసుకుని అంతకుముందు వెళ్ళిన గదికి వెళ్ళాను. తలుపులుతీసి రెండు తుపాకులు, కొంత అమ్యూనిషన్ తీసుకున్నాను. తలుపులు మూసుకోమని చెప్పి

వెనక్కి వచ్చేశాను. నా చేతిలోవున్న తుపాకుల్ని చూసి "అవెందుకు?" అడిగాడు నాయకుడు.

"యుద్ధానికి!" అన్నాను.

"వాటిన్ని ఎలా ఉపయోగించాలో మాకు తెలీదు."

"నాకు తెలుసు. వస్తున్నాను పదండి!" అన్నాను.

"వాటిన్ని ఎలా వాడాలో నాకు తెలీకున్నా, అవి ప్రాణాలు తీస్తాయన్న విషయం మాత్రం తెలుసు నాకు. సముద్రంపైకి దొంగతనాలకు వెళ్ళినప్పుడు చాలాసార్లు నౌకల్లోవున్న నాగరికులు మాపైన కాల్పులు జరిపారు. మావాళ్ళు కొంతమంది చచ్చిపోయారుకూడా. ఈ తుపాకులు మామీదికొచ్చే గుంపు దగ్గరలేవు. వాళ్ళ దగ్గరలేని ఆయుధాలతో మనం వాళ్ళపైకి వెళ్ళడం అన్యాయం. అదీగాక మా యుద్ధాలు మనుషుల్ని చంపుకోనుకాదు జరిగేది. నాయకత్వం పెంచుకోవడంకోసం. ఆ తుపాలొద్దు" అన్నాడు నాయకుడు.

అతని మాటలు నన్ను మూగవాణ్ణి చేశాయి. అంత న్యాయం, ధర్మం, వున్నవాళ్ళను అనాగరికులని ఎలా అనుకోవాలోకూడా నాకు అర్థంకాలేదు. గెలుపుకోసం, ఆధిక్యతకోసం ఎంత నీచానికైనా పాల్పడే నాగరిక ప్రపంచం వాళ్ళముందు తల వంచుకుని నిలుచుకోవలసిందే ననిపించింది.

తుపాకులు రెండు దూరంగా విసిరేశాను.

"వెళ్దాం! పదండి!" అన్నాను.

అందరూ కదిలారు ముందుకు.

నేనుగూడా ఒక పొడవాటి కత్తి తీసుకున్నాను.

దివిటీలు వెలుగుతున్నాయి. మావైపుకూడా జనం తప్పెట్లు చెవుల తుప్పు వదిలేట్లు మ్రోగించటం మొదలెట్టారు.

అందరికన్నా ముందు నాయకుడు నడవడం ప్రారంభించాడు. అతని వెనుక నేనూ, నా వెనుక మిగిలిన గుంపు ముందుకు కదలిపోసాగాం.

మాపైకి దాలుదువ్వుకొచ్చిన గుంపు చేస్తున్న అల్లరి, కోలాహలం, దగ్గరవాజొచ్చింది. రెండు మైళ్ళకేపైనే నడిచాం. వాళ్ళ దివిటీల వెలుగు కనుపించింది.

విశాలమైన ఖాళీ ప్రదేశంలో రెండు గుంపులు ఎదురెదురుగా నిలుచున్నాయి. రణగొణ ధ్వని ప్రారంభమైంది. నాకు తమాషాగావుంది.

రెండువైపులా జనం నేలమీద కూర్చున్నారు వరుసగా. నాయకులుమాత్రం నిలుచున్నారు. నేనూ, మా నాయకుడి వెనుక కూర్చున్నాను.

"అడవి దేవత ఆనతిచ్చింది. నీ నాయకత్వంలో అందరూ కష్టాలు పడుతున్నట్లు, నువ్వు వాళ్ళచేత అన్యాయాలు చేయిస్తున్నట్లు నాకు తెలిసింది.

"నీ నాయకత్వం యింక పనికిరాదు. నువ్వు నాకు లొంగిపోయి నీ గుంపుతో నా నాయకత్వాన్ని గుర్తించు. నీకూ, నీ వాళ్ళకూ ఏ లోటూ రాకుండా చూసుకొంటా. ఏమంటావ్?" అడిగాడు ఎదుట గుంపు నాయకుడు.

మా నాయకుడు తన ఆరాధ్య దైవాన్ని కాసేపు జపించాడు.

"తరతరాలుగా వున్న గుంపు నాది. మాలోంచి విడిపోయి, మా నాయకత్వానికి ఎదురుగా మరో గుంపును తయారుచేసింది నువ్వు నీవాళ్లు. మర్యాదగా నువ్వు లొంగిపోయి, నీ గుంపుతో వచ్చి చేరు. మా దేవతను క్షమాభిక్ష కోరుకో" అని అర్థమొచ్చేట్లు చెప్పాడు మా వైపున్న నాయకుడు.

అలాగే చాలాసేపు ఏమేమో చెప్పుకొన్నారు. తూరుపు దిక్కున వెలుగు రేఖలు కనుపించాయి. తెల్లవారబోతోంది. బాగా వెలుతురు వస్తేగానీ యుద్ధం చేయ్యరేమో ననుకున్నాను.

ఇద్దరూ వాద ప్రతివాదాలు చేసుకొన్నారు. ఆఖరకు మాటలు లాభం లేదన్న నిర్ణయానికొచ్చారేమో, తప్పెట్లు మ్రోగించారు.

మా నాయకుడే, పేరు పేరునా పది మందిని పిలిచాడు. వాళ్ళంతా ఆయుధాలతో వచ్చి వరుసగా నిలుచున్నారు.

ఎదుట వేపున్న గుంపు కేసి చూశాను. అక్కడా వాళ్ల నాయకుడి ముందు పదిమంది నిలుచున్నారు.

మా నాయకుడు చేతిలోవున్న ఎముకను పైకెత్తాడు. అతని అనుచరులు రివ్వున ఎదురుగా వున్న గుంపు వేపు పరుగెత్తారు. ఎదుట వాళ్ళుకూడా అలాగే వచ్చారు వీళ్ళ పైకే.

కత్తులు ఒరుసుకున్నాయి. ఒక్కొకరు ఒక్కొక్కరితోనే పోరాడటం గమనించాను.

కత్తులు క్రింద పడిపోయిన వాళ్ళు చేతులలో కొట్టుకుంటూ, కసీలు పడుతూ, పెద్దగా అరుస్తూ, గుండెలు బాదుకుంటూ, తొడలు చరుచుకుంటూ, నానాహంగామా చేస్తూ అల్లరి చెయ్యసాగారు.

నా వెనుకనున్న జనం అరుపులతో హుషారెక్కించ సాగారు తమ వాళ్లకు. మదనాత్తే భాల్లా భీకరంగా పోరాడారు వాళ్ళు వీళ్లూ. దాదాపు అరగంట జరిగింది. అవతల వాళ్ళను నలుగుర్ని ఇటువైపుకి లాక్కొన్నారు మా గుంపులో వాళ్ళు.ఇద్దరు అవతల వేపు గుంపులోకి పోయారు.

ఆటవిడుపు ఆరంభమైంది.

పోరాటం పది నిముషాలు ఆగింది. గుంపులో కొచ్చిన నలుగురు క్రొత్తవాళ్ళు నన్ను వింతగా చూస్తు నా వెనుకే కూర్చున్నారు.

మళ్ళీ తప్పెట్లు మ్రోగాయి.

ఇంకో బాచ్ సిద్ధమైంది.

అవతలవేపు బాచ్ కూడా తయారైంది.

మళ్ళా యుద్ధం మొదలైంది.

నాకు వాళ్ళు యుద్ధంచేసే పద్ధతి, పెట్టుకున్న నియమాలు, చాలా బాగున్నాయనిపించింది. నిజానికి మా ముఠా చాలా బలమైంది. మొత్తం ఆరొందలకు మించివున్నారు. ఎదురుగావున్న గుంపులో గెండొందల మందికన్నా ఎక్కువ జనంలేరు. ఒక్కుమ్మడిగా వాళ్లు వీళ్లు పోరాడితే, నిముషంలో ఆ గుంపు మొత్తాన్ని లాక్కురాగల శక్తి వుంది మా జనానికి. అయినా అలాంటి పద్ధతి అనుసరించలేదు. సరిసమానంగా, సమ ఉజ్జీలుగా, పోరాడటం మొదలెట్టారు. ఆ రోజంతా జరిగింది పోరాటం. బాచ్ తర్వాత బాచ్ వెళ్తూనే వున్నారు.

చాలాసార్లు ఏ విధమైన నష్టం లేకుండా, ఒకరిద్దర్ని ఎదుట గుంపులో వాళ్లనే లాక్కువచ్చారు. సాయంత్రానికి అవతలివేపు వాళ్లంతా యుద్ధంలో పాల్గొనటం పూర్తయింది.

వాళ్ల నాయకుడు వెళ్ళిపోయాడు తన మనుషులను వెంటబెట్టుకుని.

నేను లెఖ్ఖ వేశాను. మా గుంపులోని వాళ్లు పదహారు మంది అటువేపుకు, అటువైపు వాళ్లు నలభైమంది దాకా మా గుంపులోకి మారిపోయారు.

తిరిగి బయలుదేరింది మూకంతా మా మకాంకు.

"ఎవరు గెలిచినట్లు?" అడిగాను నేను నాయకుడి వెంట నడుస్తూ.

"మనమే!" అన్నాడతను.

"అది ఎలా నిర్ణయిస్తారు?"

"ఎవరు ఎక్కువమంది మనుషుల్ని పోగొట్టుకొంటే వాళ్లు ఓడిపోయినట్లు!" చెప్పాడు నాకు.

"అతను ఓడిపోయినాక, నీ నాయకత్వాన్ని అంగీకరిస్తూ నీ కెందుకు లొంగిపోలేదు!" అడిగాను.

"అతని మనుషులందర్నీ మనం మన గుంపులోకి గెలుచుకొని రాగలిగితే గాని అతను లొంగడు. అదే మా పద్ధతి. నేను నాయకుడుగా వచ్చేసరికి వాళ్ల గుంపులో మూడొందల మందిదాకా వుండేవాళ్ళు. ఇప్పుడు రెండొందలకన్నా తక్కువ మంది వుంటారు" అన్నాడు నాయకుడు.

"అతను అందర్నీ మన గుంపుకే పోగొట్టుకున్నాడా? లేక మూడో గుంపుతో కూడా కొంతమందిని నష్టపడ్డాడా?"

"ఎక్కువమందిని మనము గెల్చుకొన్నాం. ఆ గుంపు అసలు న్యాయమైనది గాదు. మా తండ్రిగారి తోబుట్టువు, మాతాతో పేచీ పెట్టుకొని కొంతమందిని వెంటబెట్టుకొని చీలిపోయి ఈ గుంపు పెట్టుకున్నాడు. ఇప్పుడొచ్చిన నాయకుడు నిజానికి చాలా మంచివాడు. మూడో గుంపుకూ మాకూ అసలు వైరం. అది తరతరాలనుంచి వస్తోంది. నేను గెలవవలసింది వాళ్లను. వాళ్లతో యుద్ధం వస్తే, ఈ గుంపు కూడా మనతో కలసి పోరాడుతుంది" అన్నాడు నాయకుడు.

వాళ్లకు పెద్ద చరిత్ర వుండటం, తిరగబడి క్రొత్త గుంపులు పెట్టుకోవటంలాంటి సంఘటనలున్నందుకు విచిత్రం కలిగింది.

—(సశేషం)

# సప్లిమెంట్ పోటీ

53,54,55,56,57 అంకెలను తీసుకొని, మీకు నచ్చిన వరుస క్రమంలో, ఈ క్రింది గళ్ళలో పూరించండి. మీ జవాబులను ఒక పోస్టుకార్డుసైజు తెల్లకాగితంపై వ్రాసి, దానితో 75 పైసల పోస్టలు స్టాంపులు జత పరచి, ఈ నెల 30 వ తేదీలోగా మాకు చేర్చాలి.



మా ఆఫీసులో సీలు వేసిన జవాబుతో సరిపోలిన జవాబుకు ఒక ఏడాది పత్రిక లేదా సప్లిమెంట్ ఉచితంగా పంపుతాం. ఈ పోటీలో అందరూ పాల్గొనచ్చు.

ఒక్కొక్కరు 3 కూపన్లకు మించి పంపకూడదు. ప్రతి కూపనుకు 75 పైసల పోస్టలు స్టాంపులు పంపాలి. ఫలితాలు జూన్ '75 నెల మాస పత్రికలో చూడండి.

# ముఖచిత్ర వ్యాఖ్యల పోటీ

ఈ నెల "సప్లిమెంట్" ముఖచిత్రాలు పరిశీలించండి. రెండింటికీ సంబంధం వుండేటట్లుగా ఒక్క మాటలోగాని, చిన్న వాక్యంలోగాని, చక్కటి వ్యాఖ్యలు ఒక పోస్టుకార్డుసైజు తెల్లకాగితంపై వ్రాసి, ఈ నెల 10 వ తేదీ లోపల మాకు చేరేటట్లు పంపండి. ఒక్కొక్కరు ఎన్ని వ్యాఖ్యలైనా పంపవచ్చును.

మాకు వచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు రు. 20-/లు నగదు బహుమతి పంపుతాము.

దీనిలో "హోమ్ డెలివరీ" సభ్యులు మాత్రమే పాల్గొనాలి. సభ్యులుకానివారు తమ సభ్యత్వ రుసుము పంపుతూ వ్యాఖ్యలు పంపవచ్చును. ఫలితాలు వచ్చే నెల మాసపత్రికలో ప్రచురించబడతాయి.—ఎడిటర్.



## 54

ఒక సినిమా డైరెక్టర్ తన సినిమాలో 'కొట్లాట' దృశ్యాన్ని సహజంగా తీయాలనుకున్నాడు. ఆ దర్శకుడు హీరోతో ఇలా అన్నాడు: ''అదిగో అక్కడ ఒక మనిషి వస్తున్నాడు. అతనివెంట భార్యవుంది. ఆమెను గురించి అవమానకరంగా తిట్టు. అప్పుడతడు నీతో కలహిస్తాడు. దాన్ని షూటింగ్ చేద్దాం!''

నాయకుడు ఆ మనిషి దగ్గరకు వెళ్ళి అతని భార్యను గురించి ఇలా అన్నాడు: ''ఛీ! ఛీ! నీ భార్య ఎంత అంద వికారంగా వుంది'' అని.

ఆ హీరో కొట్లాటకు సిద్ధమయ్యాడు. కానీ ఆ వ్యక్తి ఏమీ అనలేదు. తన భార్యవైపు తిరిగి ''ఏం ఇప్పుడైనా నమ్మావా? నే ననేది నిజం కదూ'' అన్నాడు.

* * *

ఒక పిచ్చివాడు ఒక చిన్న కత్తిని తీసుకుని పిచ్చాసుపత్రి మిద్దెమీదకెక్కి ఇలా అరవసాగాడు. ''నా దగ్గరకు రాకండి. ఎవరైనా వస్తే చంపేస్తాను.''

డాక్టర్ అప్పుడేవచ్చి ''క్రిందకు దిగుతావా లేదా? దిగ కుంటే ఈ ఆపరేషన్ కత్తితో ఈ మిద్దెనే కోసేస్తాను. ఊం దిగు!'' అని గద్దించాడు.

అంతే! బుద్ధిగా మేడదిగి వచ్చాడు ఆ పిచ్చివాడు.

* * *

రామానందం ఒక ఫోటోను చేతిలో పట్టుకుని వెక్కి వెక్కి ఏడుస్తున్నాడు.

శివానందం దగ్గరకు వచ్చి "ఎందుకేడుస్తున్నావ్‌! ఎవరు అతడు? మీ తండ్రా?" అని అడిగాడు.

రామానందం:- కాదు.

శివా:- అన్నా-? మామా? లేక మీ బంధువా?

"వా రెవరూ కాదు. నాభార్య మొదటి భర్త. అతడు చనిపోయినందుకేగదా, నాకీ దురదృష్టం ప్రాప్తించింది" అంటూ మళ్ళీ భోరున ఏడ్వసాగాడు.

—సి. జయానాగేశ్, మల్దకల్.

## 55

ప్రొఫెసర్: పనిలేనివారికి పని కల్పించడానికి ఒక ఉపాయాన్ని ప్రతిపాదించండి?

విద్యార్థి: మొదటగా అందరు ఆడవాళ్ళని ఒక దీవిలోను, అందరు మగవాళ్ళని ఒక దీవిలోను పెట్టెయ్యాలి.

ప్రొఫెసర్: అప్పుడు వాళ్ళేం చేస్తారు?

విద్యార్థి: పడవలు తయారు చేసుకుంటారు!

* * *

జడ్జి: ఇతను బాగా త్రాగేడని మీరెలా గ్రహించారు?

ఆఫీసరు: ఇతను ఒక టాక్సీ డ్రైవరుతో గట్టిగా దెబ్బలాడుతున్నాడండీ

జడ్జి: దానికి తాగేడనడానికి సంబంధ మేమిటి?

ఆఫీసరు: కాని అక్కడ ఎవరూ టాక్సీ డ్రైవరు లేడండి.

* * *

పబ్లిక్ ప్రాసిక్యూటర్: ఇప్పుడు చెప్పవయ్యా. నువ్వు కారు ఎందుకు దొంగిలించావో?

ముద్దాయి: కారు స్మశానం దగ్గిర పెట్టిఉంది. అందుకవి

బహుశా యజమాని చచ్చిపోయి ఉంటాడనుకొని కారు తీసుకుపోయాను!

—ముళ్ళపూడి నాగేశ్వరరావు, కాకినాడ-2.

## 56

ఒక స్టేజిమీద గంభీరమైన ఉపన్యాసం దంచుతున్నాడో పెద్దమనిషి, "యీ దేశంకోసం నేనేమైనా చేస్తాను. ఏమైనా చేస్తాను."

అంతే. జనంలో కల్లోలం బయలుదేరింది. ఈలలు. చప్పట్లు. కొయ్. కొయ్. అరుపులు.

ఉపన్యాస మిస్తున్న ఆ పెద్దమనిషి రెచ్చిపోయాడు."మీరు మనుషులుకాదు పశువులు." అరిచాడు, మైక్ బ్రద్దలయ్యేలా.

అధ్యక్ష స్థానంలోవున్న మరో పెద్దమనిషి, నెమ్మదిగా యిలా అన్నాడు. "స్వజాతాభిమానం బొత్తిగా లేదంటి వాళ్ళకు!!"

*   *   *

డిటెక్టివ్ కాంతారావ్ ట్రైన్‌లో ప్రయాణిస్తున్నాడు. సీరియస్‌గా డిటెక్టివ్ నవల చదువుతున్న ప్రక్క వ్యక్తిని 'ఆ నవల పేరేంట'ని అడిగాడు.

'అమ్మాయి-ఆత్మహత్యం'టూ ముఖచిత్రం చూపించాడు.

వెంటనే కాంతారావ్ యిలా అన్నాడు. 'ఆ అమ్మాయి చనిపోవటానికి కారణ మెవరో తెలుసా?"

"ఆమె భర్త" అని సమాధాన మిచ్చాడా యువకుడు.

"నో, నేనే కారణం. ఆ నవల రచయితను. నేను కనుక!"

—'రాం-సూరి', తిమ్మరాజుపేట.



